# భారతి

మాస పత్రిక

*

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

అక్టోబరు 1977

సంపుటము : 54 సంచిక : 10

విడిపత్రిక వెల రూపాయిన్నర



# క్షీరసాగరం అల్లదిగో......

ఆంధ్రప్రదేశ్‌లో పాడిపరిశ్రమ పరవళ్లుతొక్కుతూ ముందుకు సాగుతున్నది. ఆంధ్రప్రదేశ్ పాడిపరిశ్రమ అభివృద్ధి సంస్థ 1974 లో ఏర్పాటు కావడంతో యీ రంగంలో నవశకోదయమయింది. 1976-77 సంవత్సరంలో యీ సంస్థ 889 లక్షల లీటర్ల పాలు సేకరించింది. దానికి తోడు 425 టన్నుల వెన్న, 2218 టన్నుల నెయ్యి, 1167 టన్నుల పాలపొడి ఉత్పత్తి చేసింది. ఈ విధంగా ఈ సంస్థ పాడిపరిశ్రమలో సత్ఫలితాలు సాధించింది.

మన రాష్ట్రంలో ఈ సంస్థ ఆధ్వర్యాన ప్రస్తుతం నాలుగు పశుగ్రాసం తయారీ కర్మాగారాలు పనిచేస్తున్నాయి. వీటిద్వారా పాడిపశువుల పెంపకందార్లకు సరితూగే పశుగ్రాసం అందజేయగలుగుతున్నారు. ప్రతిరోజు 85 టన్నుల పశుగ్రాసం సరఫరా అవుతున్నది. త్వరలో పశుగ్రాసం తయారుచేసే మరో రెండు కర్మాగారాలు నెలకొల్పుతారు. భవిష్యత్తులో కూడా పాడిపరిశ్రమ కీలకపాత్ర వహిస్తుందనడంలో సందేహంలేదు.

జా రి. క్ష. ర.
సమాచార పౌరసంబంధశాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.

# విషయానుక్రమణిక

## అక్టోబరు 1977





# మ కు ట ధా రి

## "సాంధ్యశ్రీ"

నేనీ శతాబ్దపు ఉత్తరార్ధంలో
నిలబడి
కోమల భావ శబలత్వాన్ని
మానవతా మకుటంగా—ధరించి
మహోద్యమంవైపు
సాగిపోతాను ...

దిగంతాల దివ్యత్వంతో
వసంత వాల్లభ్యాన్ని
మధువుగామార్చి
మనోచషకంతో తాగి
సోలిపోయే నా నీలికళ్ల దీవుల్లో
పద్యాల పతాకాల నెత్తుతాను...

కాలప్రవాహంమోసే
పూల పడవల నడవలో
వాడని వసంత పేశలగానాన్ని
నాగళంలో
మేళవిస్తాను ...

కిసలయించిన
కాల లతాగ్ర చైత్రమధూలికా
సుమాన్ని ధరించిన
ఈ ఋతుకన్య సిగలో
శశాంకుణ్నై ఉదయిస్తాను ...

ఋతుశోభ లెరుగక
దిగులు ప్రవాహంలో గిలగిలలాడే
అమాయిక పట్టణాలకు
పల్లెసీమల్లో ప్రభవించి
పరిమళించే
వసంతహేలను
నవ వధువులా అలంకరించి
మందార మధువుతో పంపుతాను...

ముత్తైపు రెక్కనెల వెన్నెల్లోచిక్కి
నిట్టూర్చిన గాలిమేని విరుపును
ధనువుగా మలుస్తాను ...

నీలిమయ సోయగంలో
చెదరిపడిన—చదల
చుక్కల కొసమెరుపును
బాణంగా విడుస్తాను ...

అవంధ్య సౌగంధ్య వాసితా
విలస ద్వ సంతకు
సంధ్యపుప్పొడి తిలకమద్ది
వింధ్యమీద నిలుపుతాను ...

పువ్వుల్నిమోసే నదుల్ని
నవ్వుల్నిమోసే పెదిమల్ని
లోకంమీదకు వదలి
వసంతాన్ని సంతర్పణచేసే
నేను
మహా గమిని
సదా శమిని ...

చూశారుకదా
కాలానికి నే పూయించిన
సమతా ప్రసూనాలను
ఇది ఒక మహోద్య మా విర్భూత
నాందీ సంగీతం...

చూశారుకదా
కాలానికి నే చేయించిన
హసనాభరణాలను
ఇది ఒక ప్రేరణా ప్రభావిత చైతన్య
సంకేతం...

ఈ హసన కుసుమోత్కరాలను
పంచుకునే పండుగలో
ఈ గుబురు కోర్కెల గుంపు
స్వరమెత్తిన మెత్తని సందడిలో
నా హృదంతరంలో ఒక మయూఖ
నా వదనారవిందంలో ఒక దరహాసరేఖ
ఇది సాధనపురిటికై సావిక
ఇది ఒక కొత్త తరానికి వేదిక
మీ కళ్లనిండా గుమిగూడిన
కలల శిలలను
శిల్పాలుగా మలచి
రసజగత్తును మేల్కొలిపే
ఉత్సాహోత్సవంలో
అసంఖ్యాక అవ్యక్త ఆత్మలను
రసార్ద్రంచేసి
అనుభవానుభూతి సంకేతంగా
ఆవిష్కరిస్తాను
అందరికీ
అంకితమిస్తాను ...

తరంనుండి తరంవైపు
తరలిపోయే చరిత్రలో
ఇది ఒక పూట
తర తరాల నుండి
తరాల నెన్నింటినో మోసే ధరిత్రిలో
ఇది ఒక ఘట ...

చూశారుకదా
నా ప్రాచీరేఖమీద తలెత్తిన ఉదయాన్ని
నేనిప్పుడు నిత్యచైతన్య శీలిని
చూశారుకదా
నే నావిష్కరించిన హృదయాన్ని
నేనిప్పుడు నవ జనతా వనమాలిని.

# శిశిర వసంతసంధి-ఉగాది

## శ్రీ కొండేపూడి సుబ్బారావు

(వసంతశోభ శాశ్వతంగా తనకోసమే ఉండిపోవాలన్న మానవుని ఆకాంక్షకు కాలపురుషుని ప్రబోధము)

**1**

తలిరుం జొంపములై చివుళ్ళు తలలెత్తన్ పైకి, క్రొంగ్రొత్త కెం
పుల కోవల్ చవులూరు వే జిలుగు పూవుల్ త్రోవలై తీయ తే
నెలు చిందించినచోట పుప్పొడుల వన్నెల్ వెల్గ వాకింటి ముం
గలకున్ వచ్చిన నూత్న చైత్ర రథ మ్మాగన్ లేదు జామ్మైననున్.

ఆశగా వసంతము వచ్చినట్లె వచ్చి,
మూడువందల దినములు పాడువడ్డ
హృదయమును లిప్తలో గికురించి చనిన
ప్రథమ దిగ్భ్రమ వెడలిన భావమందు

**2**

మానవుడు

"ఓయి వసంతుడా నిలువు మొక్క నిమేషము, వాయువేగివై
పోయెదవేల లోని తలపుల్ పలుకాడగ నిమ్ము — నూతన
చ్ఛాయల తీర్చికొన్న మన సౌహృద సమ్మదముల్ నవోదయ
శ్రీయుత కాంతిమద్రుచిర జీవన మార్గము లీ మనోజ్ఞముల్
గడచిన యట్టి పీడకలగా మదిలో వెత నించు రాపిడై
పుడమిని నేటికైదు ఋతువుల్ గుమిగూడిన అడ్డకట్టులన్
విడివడివచ్చి మా విమల వీధుల నిల్వకయే గమింతు వే
గడసరివోయి, ఏ మహిత కార్యము నావల నుద్ధరింతువో

చటులానలమ్ము లుచ్ఛ్వాస నిశ్వాసమై
గ్రీష్మహి తనపడగెత్తి నిలచి,
దూసిన కత్తులై తొరగు వర్షాధార
లవనీధ్రములు బద్ధలగుచువచ్చి,
వెలవెల్లి నగు శరద్వీథీ నిశీథమ్ము
తనువులంతంత చల్లనగ జేసి,
హేమంతములు పుష్ప సీమాంతముల దాక
కఱకు వారిన మంచు తెరలు క్రమ్మి,
తుట్ట తుదకిది యొక చలిపిట్ట పిడుగు
శిశిరమై వచ్చి బ్రతుకు కృశించి పోవ
ప్రకటితార్ద్రస్మృతి ప్రతోళికల యందు
కాచుకొని యుంటిమి వసంతకాంతి కొఱకు.

తిరిగి వసంతకాల మరుదెంచును నించును మా మనమ్ములన్
సురుచిర రాగ రంజిత రసోల్బణ కాంతి మయూఖముల్ వనాం
తరములు సౌహృదమ్ములగు నంచు దలంచుచు నుంటి మింతలో
పరుగిడి పోదువేమి యట వచ్చిన వాడవు వచ్చినట్లుగా
మ్రోకలు శీర్షమందు చివురుల్ సవరించను లేదు, కొమ్మలన్
కోకిల పాడలేదు తన గొంతుకనెత్తి, మనోజ్ఞ మల్లికల్
రేకుల విప్పలేదిల పరిమళముల్ విరజిమ్మ, తేటులున్
తాకగలేదు క్రొత్తపువుదారుల బారులు దీరి తెనెకై
మాకొక నందనోత్సవ సమంచిత నిత్యమనోజ్ఞ రాగమా
లాకమనీయ సుందర విలాస విభాసుర కాంతిరేఖ కా
దా కలకాల మీ నవసుధా మధుమాస విభూతి ఈ
రాకలు పోకలేటికి నిరంతర మీకడ నుండ గూడదో''

### 3

కాల పురుష ప్రబోధము —

''పురుషుడ వీవు వెఱ్ఱివయి పోకుము తేకుము వింతభావముల్
పరుగిడు కాలచక్ర పరివర్తన మియ్యది దీని నాప నె
వ్వరి తరమౌను, కాలపరిపాకము లోకము పోక లెప్పుడే
తెరగున నెవ్వరెవ్వరికి తీరిచి దిద్దునొ జీవనాదృతుల్
తపమదిలేదు లేదు ఫలితార్థము జీవితమందు, కాల చ
క్రపు ఋతు ధర్మమందు శిశిరమ్ములు రాక వసంత కాంతుల
చ్చపు తరితీపు తేనియల జల్లులు రావు—సమస్త జీవ లో
కపు గతులీ విధిక్రమము గాదని పోదగు త్రోవలేదునున్
ఒకరి వసంతశోభ మఱి యొక్కరికిన్ శిశిరమ్మ లీ ఋతు
ప్రకర పరిక్రమమ్ములు పరస్పర దోహల కార్యముల్ ప్రపం
చకమునకున్ సమానముగ సంపద లింపొనగూర్చు తీర్పు లీ
ప్రకృతి మహావిధానములు స్వార్థములేని మనోజ్ఞ ధర్మముల్''

### 4

మానవుడు

''సాధనలైన ఈ శిశిర సంపదకున్ మధుమాస వైభవా
పాదిత సత్తప ప్రథిత భాగ్యములన్ ముడివెట్టు సంస్కృతుల్
స్వాదురసార్ద్ర భావ యుగసంధులు సంచిత రాగ సింధువుల్
గాదిలి తెల్గు పండుగలుగాదులు నిత్య శుభోదయమ్ములున్.
ఆపం బోకుము కాలచక్రపురుషా అత్యంత లోకాశ్రయ
వ్యాపారోజ్జ్వల సంగ్రహార్థ శిశిరవ్యాలోల లీలాక్రమం,
బాపంబోకుము మోహనార్ద్ర రుచిర ప్రాచుర్య మాధ్వీక ధా
రాపూర్ణ ప్రభలీ వసంత విజయ ప్రస్థాన హేలాకృతుల్''



# నల సమర్పించిన ఉత్తమ కావ్యాలు:౧

## గుండెల్లో మంటలూ : కన్నులనిండా నీళ్లూ-

**మ**నోహర కావ్యం నిశాంతం*, నల ఉగాదికానుకగా కవితా రసజ్ఞుల కందింది. ఇతఃపూర్వంసాహిత్యవిమర్శకులుగా,కథకులుగా, నవలా రచయితగా, బహు గ్రంథకర్తగా సుప్రసిద్ధులైన శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం కవిగా ప్రథమ దర్శనం కలిగించి ఆశ్చర్యచకితుల్ని చేశారు. ప్రఖ్యాత కవి విమర్శకులు శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ—కావ్యతత్త్వ ప్రదీపిక అనే విపుల పీఠిక సంతరించారు. ఈ కావ్య సౌగంధికం విపులీకరించారు.

ఈ కావ్యం చదువుతున్నంతసేపూ ఏదో అవ్యక్తమధురమైన అగ్నికీల గుండెల్లో ప్రవేశించి కాలుస్తున్నట్లుంటుంది. కాని కన్నులు ఆనందవలాహకాలవుతాయి. అమృత వర్షిణులవుతాయి! విచిత్రమైన అసందిగ్ధ సమ్మేళనం అర్థంకాదు. తర్కానికి అతీతమైన తలంలో మన భావుక హృదయం విహరిస్తుంది. గుండెల అగ్నికీ, కంటినీటికీ ఏమిటి సంబంధం?

శ్రీ శేషేంద్ర చక్కని తాత్త్విక భూమిక చేకూర్చారు. వారు—వైదిక సూత్రాలనుంచి ఆధునిక ఆలోచనాధార వరకూ ఎన్నో గొప్ప సూక్తుల నుల్లేఖించి ఈ కావ్యగత తాత్త్వికాంశకు వ్యాఖ్యానం చేశారు. కనక నేనా తాత్త్విక విషయాలను స్పర్శించను. భగవంతుడ్నికూడా వర్ణాశ్రమధర్మ పక్షపాతిగా, బ్రాహ్మణీకపు అంగరక్షకునిగా మార్చిన వైశ్వనాథీయ ఛాందస మౌఢ్యానికి అస్పృశ్యత కల్పిస్తాను. కేవలమొక కవితా రసైక భోగిగా నా అనుభూతిని పలకదలచాను.

తాత్త్వికచర్చ అనేసరికిరసమయహృదయతలంనుంచి—తార్కిక మనోతలానికి మీమాంస తన ఉనికిని మార్చుకుంటుంది. విశ్వాసాల మౌఢ్యానికి జారితే—అనుభవ మాధుర్యాలను పోకార్చుకుంటుంది. అంధకూపాలకు హృదయం జారిపోతుంది. అంతుదొరకని పాతాళాలకు పతనమవుతుంది. కనుకనే ఒకడు కవితా హృదయంతోనే, స్వాప్నిక శోణిత క్షోణితలంలో విహరించే భావుకునిగా పలకడమే ఉత్తమ ధర్మమనిపిస్తుంది.

ఇంత మంచి కవిత్వం రాసిన శ్రీ సుదర్శనం ఇంతకాలంగా రసజ్ఞుల కంటపడకుండా ఎలా తప్పించుకొన్నారో— ఆశ్చర్యమే! 'ఆకులందున అణగి మణగీ కవిత కోకిల పలుకవలెనోయ్!' అని ఆధునిక సాహిత్య పితామహుడన్న దానికి—కవిత్వాన్నే కవి భహిర్గతం చేయాలి గాని, తన వ్యక్తిత్వాన్ని కాదనే అర్థంతప్ప—కవి ప్రజలకు దూరంగా అజ్ఞాతంలో ఉండిపోవాలని కాదు. కాని ఈ కావ్యాన్ని చాలాకాలం క్రితమే విశ్వనాథ సత్యనారాయణగారు మెచ్చి, అడిగి అంకితం తీసుకొన్నారట. అచ్చు వేయించారట కాని శ్రీ సుదర్శనానికి ఒకే ప్రతినిచ్చి మిగిలిన కాపీలన్నీ 'కృష్ణార్పణం' చేసినట్లుంది. ప్రజలలోకి రాలేదు. ప్రాయముక్తై వ్రాలిన పెద్దల బుద్ధులిలా పెడతలలకు చేరడ మీ దేశానికి సనాతనాచారంకాబోలు! 'తమర్ని పరోక్షంగా ధనుర్విద్యా గురువుగా ఆరాధించి ఈ విలువిద్య నేర్చుకున్నానయ్యా'అని ఒక అమాయకుడంటే—''అలాగా ఏదీ నీ బొటనవ్రేలునరికి నాకు గురుకట్నంసమర్పించు!''అని అలనాడొక దుర్మార్గుడడగలేదూ? అదీ మన గురు పరంపరా సంప్రదాయం! ఇంత కాలానికి శ్రీమతి ఇందిరాదేవి ధనరాజ్‌గిర్ తమ ఇండియన్ లాంగ్వేజెస్ ఫోరమ్ పక్షాన ప్రచురించి కవితా రసజ్ఞులకు విందు చేశారు.

ఈ పరిశీలకుడు వ్యక్తిగతంగా శాస్త్రీయ మానవతావాది; అంటే సంప్రదాయవాదుల భాషలో నాస్తికుడని అర్థం. పైగా గతి తార్కిక భౌతికవాది. కాని మంచి కవిత్వాన్ని అనుభవించడానికి పై రెండూ ఎన్నడూ అభ్యంతరం కాలేదు. వాస్తవికవాదీ, ఫ్యూచరిస్టూ, అధివాస్తవికవాది, అస్థిత్వవాదీ, ఆదర్శవాదీ—రాసినవాడి విశ్వాసాలేవైనప్పటికీ రాయబడినది కళావైభవంతో తనరారితే సహృదయులకు అవశ్య మనుభోక్తవ్యమే! ఒక రచయితనుంచి రసజ్ఞుడు కోరుకొనేది అచ్చమైన కవితా హృదయాన్నే కాని వాడి విశ్వాసాలనుకాదు. కనుకనే నోరూ వాయీ లేనివాడు ఇతరేతర ఊతకోలల బలంతో కవినని మూకాభినయం చేస్తే చెల్లదు.

'నిశాంతం' అనే ఈ కావ్యం ఏ తాత్త్విక వాదానికి చెందినదనే విచికిత్స కావ్యరసానుభవానికి అవసరమున్నది కాదు. ఇది **Metaphysical poetry** యా ?(**Based on abstract general reasoning of super natural vision** అనే నిర్వచనం ప్రకారం) లేక **mystical poetry** యా?

[**Poetry which seeks by contemplation and self surrender to obtain union with or absorption into the almighty** అనే నిర్వచనం ప్రకారం!] వంటి విచికిత్సతో సహృదయునికి ప్రమేయం ఉండనక్కరలేదు.

''... ... ... బ్రతుకు సర్వమును లోగొనెడు కాల సర్పమొండు ఛాయయై వెంబడించి విశ్రాంతిలేని చోదకత్వము వహించు; స్ఫూర్తియొండు సూత్రమైలాగు !'' అనగలగడం అంతర్దర్శనగల అనుభవ పారమ్యతకేసాధ్యం. కవి హృదయంలోసాగే అంతర్మథనానికి ఇట్టి సుందరోక్తులు అవలీలగా స్వాధీనమవుతాయి. కాలసర్ప మొకటి బ్రతుకునంతా లోబరుచుకుంది. అదీ సర్పరూపంతో కనిపించి పైనపడదు. ఉందోలేదో తెలియని నీడలా వెంబడిస్తుంది. విశ్రాంతి దొరకనీయదు. అశాంతి కలిగిస్తుంది. అలా మనస్సు తనవెంట నడిపించుకుంటూ పోతుంది. ఒక మానసిక

స్ఫూర్తి ముక్కుతాడులా లాక్కుపోతుంది. ఇంత చక్కని కవితా భావాన్నివిశ్లేషించి—ఇది భౌతికమా, అది భౌతికమా అన్న తర్కంలో చదువరిమనసు ప్రవేశింపగానే రసానంద పారవశ్యం యింకిపోతుంది. ఆధునిక విజ్ఞానశాస్త్రం కాలాన్ని **కూడా** భౌతిక ప్రమాణాలలోనికి యిముడ్చుకుని నూత్న విజయాలు సాధిస్తున్న స్ఫురణ ఈ భావ నానుభూతికి సహకరిస్తుంది.

''నీ దృగంచలాల వెలుగు నీడలవును పవలురేయి, మొదలు తుదలవును నాకు ఉభయ సంధ్యల మధ్య నిట్లూగుచున్న బ్రతుకు టూయెల, దీనికి స్వాస్థ్య మెట్లో ? ...'' ఉభయ సంధ్యలనే కొక్కేలకు కాలమనే చేతులు పన్ని నిర్మించిన ఊయెలలో బ్రతుకు ఊగుతోంది. ముందుకురికితే పగలు, వెనుకకు ఒరిగితే రాత్రి. అనవరతం బ్రతుకు ఊగుతూనే ఉంటోంది. అట్టి జీవునకు స్వాస్థ్యం ఎలా దొరుకుతుంది ? దీనినే భౌతికశాస్త్ర పరిధిలో **"LIFE IS DYNAMIC, BUT NOT STATIC"**అనేసూత్రార్థంలోనూ అన్వయించుకోవచ్చు.

''పోల్చుకోలేదా? అనుభూతి ముద్రితమ్ము కాలరేఖా మన శ్చిత్ర కల్పనమ్ము స్నిగ్ధతను గోలుపోయిన జీవితమిది; విరహిణీ నఖ విరచిత ప్రేమలేఖ ! ''—అన్న పద్యం చదవగానే మన వాసనా భండారమంతా ఒక్కసారి మెరుస్తుంది. కదులుతుంది. మన మనో పటలంపై పరిచిత **పూర్వ**మైన చిత్ర మొక్కటి సాక్షాత్కరిస్తుంది. గరిక పచ్చల తివాసీపై ఒక సుందర నారి బోరగిల పడుకుంది. చిబుకానికి ఎడమ చేతిని దాపుగా పెట్టింది. కుడికాలు రవంత పైకెత్తింది. కుడిచేతి గోళ్లతో తామరాకుపై ప్రేమలేఖ రాస్తున్నది. ఆమె ఎవరో కాదు. వల్కలాంబరధారిణి శకుంతలే దర్శనమిస్తుంది. తరువాతి పద్యంలో—అది శకుంతలా విద్యున్న ఖాంకితమ్ము అనకపోయినా ఆమె మూర్తి గాఢంగా చిత్రితమై తరుగని కాంతులు వెదజల్లుతుంది

''నీ ప్రశాంత శరత్పూర్ణిమా ప్రభావ మెడద నించియు నీలాల కడలి కేది నిశ్చలత్వమ్ము, తృప్తి? నిర్నిద్ర ఘోష వాంఛ సేయును వాగర్థ ఫలమునెపుడు '' ......... శారద **పూర్ణి**మా జ్యోత్స్నలను కడుపార గ్రోలుతున్న కడలి పారవశ్యపుమాదకత్వంతో హాయిగా ప్రశాంతి పొందడంపోయి అతృప్తితో కందళించి పోతోంది. అలాగే ఒక పరవశీ భూతభావం హృదయంలో నిండగానే వాగర్థ ఫలాలను వాంఛిస్తూ తరంగిస్తుంది!

ఆత్మ కపురంపుటారతి యై జ్వలించు
నిన్ను ప్రేమించి భ్రమియించి నృత్యమాడె
బ్రతుకనెడు నారికేళమ్ము వ్రక్కలగుచు
వలపు వెల్లువ పారె నీ పదములంటి !

ఏకాంత సేవా నిరతమైన ప్రకృతి పూజారిణి ఆత్మ కపురపు టారతిగా వెలిగింది. పరమ పురుషుణ్ణి ప్రేమించి ఏదో భ్రమాస్పద ఆనంద పారావారిలో ఓలలాడి నృత్యం చేసింది. బ్రతుకనే నారికేళం ముక్కలై అందలి గుప్తోదకం వెల్లువగా పారింది. ఆ పురుషుని పాదాలను ప్రక్షాళనం చేస్తోంది. నారికేళంతో బ్రతుకును ఉపమించడం, అందులోనికి జీవాగమన నిర్గమనాలు ఎవరికి తెలియవని ధ్వనించడం—గొప్ప ఊహ !

''రుద్ధము నిశాప్రశాంత సరోవర గత చంద్రబింబము నా యాత్మ; **జాము**గడచె, తెల్లవారుచునుండె; విదీర్ణతటిని స్వప్న మొక్కటి చుక్కయై జారిపడును.!''

నిశ ప్రశాంత సరోవరం లాగుంది. అందులో జారిపడిన చంద్రబింబం రుద్ధమై ఉక్కిరి బిక్కిరవుతోంది. నిశయామవతి! యామములు గడచాయి. చివరి అంకంలో పడింది నిశ ! తెల తెల వారుతోంది. కలవరపడుతున్న తటంపై నిశాంతంలో రాత్రికనిన కల ఒక్క దీన తారగా జారిపడు**తోం**ది. అంత చంద్రబింబాన్నీ మింగిన రాత్రి ఒక్క చిరుచుక్కను మిగుల్చుకుంది. జీవితమూ అంతే! ఫలవంతమైన ఆనంద **పూర్ణ** బింబాన్ని కోల్పోయి—వెర్రి కల వంటి ఒక్క చుక్కను చివరికి మిగుల్చుకుంటుంది. ఈపద్యం ఈ ఖండికకు ప్రాణప్రదమైనది.వెనుక నడచిన రెండు పద్యాలకీ, ముందు రాబోయే **మూడు** పద్యాలకీ, పరచుకొన్న భావనామయ శాఖాసంచయానికి **మూ**లాధారమైనట్లుంది. దేహళీ నిక్షిప్త దీప కళికలా భాసిస్తోంది.

రకరకాల రంగురంగుల **పూ**వుల అసంఖ్యాక పరిమళాను భూతులన్నీ ఒక గంధవహంలో సంలీనమైనట్లు – ఎన్నో జన్మలు కాలంలో విలీనమవుతున్నాయి. ఈ కాలం ఎలాంటిది? తన తోక తానే కరచుకొనినట్లు తిరుగు**తు**న్న కాలచక్రం! అందులో రేఖా మాత్ర స్వరూపం హృదయంలో ఒదిగి కాలం**లో** అంతర్నిబిడమైంది. ఈ భావనా మనోహరత్వం సహృదయ మథనంలో అమృత నిష్యంద మవుతుంది.

సైకతము లామె విహరణ స్థలములందు
నిర్జనము నీరవమ్ము అగు నియతవేళ
ఆత్మవీణ నూహాగాన మందుకొనును
ఆమె రాగమునకు స్థాయి అంబరమ్ము...

రమ**ణీ**య పులిన స్థలాలలో ఆమె విహరిస్తూ వుంటుంది. నిర్జనమూ, నీరవమూ అయ్యే నియత వేళల్లో ఆమె ఆత్మవీణపై ఊ**హా**గానం అందుకుంటుంది. ఆమె రాగాలకు అంబరమే చరమ స్థాయి. ధ్వని జనన స్థానమూ ఆకాశమే! విలీనమయ్యే స్థానమున్నూ అదే. ఆమె రాగాలు **తార**స్థాయిని పొందినపుడు అంబరంలో సంలీనమవుతాయి. నిర్జనములూ నీరవములూ అగు సైకతములు ఒక మహానాదానికి వివశమవుతాయి. ఆమె **ఆత్మ**గానం—అవలీలగా ఆకాశ పథాల నందుకో గలిగే శక్తివంతం. ఈ అభివ్యక్తి లౌకిక స్థాయి లోనూ, పారలౌకిక స్థాయిలోనూ**(Physical and Meta physical Levels)** ఒకేమారు రెండు విచిత్ర ధ్వని తరంగాలను ఉద్భూతం చేస్తుంది.

శాపమనే ఖండిక నాలుగే పద్యాల సమాహారం. కాని అనవద్య కావ్య సురభిళాన్ని వెదజల్లుతుంది. ''సిగ చెదరి రాలె **పూవులు,** గగన మలుకపూనె; మోము క్లాంతమ్మె భూమి గరువపు సెగల వేగెను; పొగచూరెను సంజ ఎరుపు, ప్రొద్దును పొడిచెన్!'' అనే

ఈ పద్యభావమంతా ప్రొద్దుపొడవడంలోనే పర్యవశిస్తోంది. నిశాకాంత ధరించిన తలపూలు చెదరి, రాలిపోయాయి. ఆమె ముఖం అలుక పూనినట్లు జేవురిస్తోంది. అలసినట్లున్న భూమి ఉమిసిన విపరీత ఉష్ణవీచులకు — గగనం కగ్గిపోయింది. తూర్పు సంజ ఎరుపులపై పొగమబ్బు లల్లల్లాడుతున్నాయి. ఈ పద్యమంతా **personification తో** రాత్రిని వర్ణించి, నిశాంతా వృత్తిని కన్నులముందు నిలుపుతుంది.

"దైన్య మేకాంత భావమ్ము ధర్మనిష్ఠ
కలసి నిర్మితమైనట్టి కఠిన సౌధ
మీ అహంత!"..................

మానవాహంకారం దైన్యంతోటీ, ఏకాంతికత్వంతోటీ, ధర్మనిష్ఠతోటీ నిర్మితమైంది. ఈ మూడు పదార్థాలూ కలబోసి నిర్మించిన కఠినసౌధంవంటిది అహంకారం. అది ఎలాంటి వార్షుక మేఘ గర్జారావాలకీ చలించదు. ఎలాంటి తుపాను గాలులకూ లొంగదు. అకుంఠితంగా మానవ హృదయంలో నిలచే ఉంటుంది. ఇలా వ్యపదేశించడం హృదయ ద్రావకమైన సరసాభివ్యక్తి!

"రక్తసిక్త మస్తంగత రవిసుఖమ్ము పశ్చిమ శ్మశానమున కప్పబడువేళ ఆవులించెను ముసలిదై ఆశలుడిగి గొయ్యికడ నక్కవలె కాచుకొన్న కొండ!" అంత పెద్దకొండ సహజంగా ముసలిదే! కాని ముసలి నక్కవంటి దనడం అపురూపం. రక్తసిక్తమైన అస్తమిత సూర్యమండలం పశ్చిమ శ్మశానంలో కప్పబడిపోతోంది. సూర్యుని సమాధికడ ఆవులిస్తోంది ముసలి నక్క. ఆశలుడిగి సెలవులు నాకుకొంటోంది. ఈ చిత్రణ అపూర్వరమణీయం. ఇలాంటి తావులలోనే ఒక రచయిత కవిగా ఉజ్జ్వలించగలుగుతాడు.

గగన శూన్యాన నేనుసన్ గవయలేని
చెరవిడని ప్రతీక్షా విషాద రుధిరమ్ము
సలదికొని యుండు, చరమ సంధ్యాతమస్సు
మృత్యువగుచు నా ప్రజ్ఞ హరించుదాక!

ఇక్కడ నేను అనే భావం సూర్యునితో సాదృశమై భాసించడం ఎన్నో ఊహలకు దారులేర్పరుస్తోంది.

"ముకురములు కొన్ని, తెలిమంచు ముత్తియములు కొన్ని, శృంగార వేణికల్ కొన్ని, తృష్ణదీర్చు పానీయములు కొన్ని, తీరి నిల్చు ఆది పరువెత్తు బ్రతుకు తోయమ్ములన్ని!"...ఆదిలో అంతా ఏకజల స్వరూపమే! అదే కాలవశాన కొన్ని జలాశయ ముకురాలుగా మారింది. కొన్ని ఉదబిందువులు తెలిమంచు ముత్యాలుగా భాసించాయి. శృంగారవేణికలుగా మరికొన్ని తనరారాయి. తృష్ణతీర్చు మధుర జలధారలుగా కొన్ని పాత్ర నిబద్ధితాలయ్యాయి. కాని అన్నీ ఆదిమరూపంలోని జలధినుంచి ఉద్భూతమైనవే!

సత్యభామ అనే ఖండకావ్యం ఒక అద్భుత మణిదీపం; "నాలో సత్యము రణమున లీలన్ నిల్చి నరకు నవలీలన్ గూల్చున్; కాలము దీపావళియై ఈ లోకము తెల్లనారు హితమై స్మితమై!" మానవునిలోని సత్యమే రణరంగంలో సత్యభామగా నిలచి నరకాసురుని అవలీలగా కూల్చగలుగుతుంది. అలాంటి హననం జరిగిన రోజున కాలమే దీపావళిగా భాసిస్తుంది. ఈ లోకమే తెల్లగా మెరిసిపోతుంది. ఆ మెరవడం ఎలా ఉంటుంది? "హితమై, స్మితమై" మెరుస్తుంది. అందరికీ హితమై మెరుస్తుంది. అందరినీ అలరించే స్మితమయ్యా మెరుస్తుంది. ఈ అభివ్యక్తితో కవిత పరాంకోటి నందుకుంటుంది.

"ప్రణయ హేలను నవ్యధవళిమ చిద్రుప
చిద్రుపలై ఆర్ద్ర హృదయమ్ము జేరి, హస్త
సంచలనహేతు నిక్వాణ సరణి స్వాదు
రసము విరిసి మిన్నేటిపై రాత్రివేగె!"

ప్రణయ హేలా హేవాకమున ప్రహసించగా ధవళిమ చిద్రుప చిద్రుపలై విరబారుతుంది. ఆర్ద్ర హృదయంలో జేరుతుంది. హస్త సంచలన హేతువువల్ల కంకణనిక్వాణం ఉదయించినట్లు స్వాదురసం విరుస్తుంది. అప్పుడు మిన్నేటిపై రాత్రి వేగిపోతుంది. నాలుగు చిన్నపాదాల గీతపద్యంలో సలభై వాక్యాల భావం దట్టించబడింది. ఇంద్రజాలికుడు నత్తగుల్లనుంచి అనంతచేలం లాగినట్లు మనసులో ఊటలూరిస్తుంది.

"కాలకాసార ముకుళిత కమలినీ విలాసలాస్యమ్మొ; దాడిమీ ప్రసవ మోహముగ్ధనేత్రోచ్ఛలనమొ; విస్ఫురిత విరహ కీల ఊహాకృతి నటించు క్రీడనమ్మొ?" అనే పద్యంలో మూడు స్థాయీ భావాలను తెలిపే మూడు సమాంతర పదచిత్రాలు అసమానంగా భాసిస్తున్నాయి. ఒకటి—కాలకాసారంలో కమల ముకుళాల విలాస లాస్యం. రెండు—దాడి మీ ప్రసూనాల ముగ్ధనేత్రోచ్ఛలనం; మూడు విస్ఫురిత విరహకీల ఊహాకృతిపొంది నటించడం...ఈ మూడూ ఒకదానితో ఒకటి అంతస్సంబంధంలేనివిగా కనిపిస్తాయి. కాని అన్నీ విస్ఫురిత విరహకీలా సూత్రానికి నిబద్ధమైన ఊహాకృతులే! అదే విచిత్ర సంపుటి...

30వ పుటలో—"ప్రథమ జన్మము శారద రాత్రివేళ—చంద్రికా క్షీరసాగర స్నాపితమ్ము, ఈ పునర్జన్మ వర్ష సంభృత మనంత కృష్ణసాగర మధ్య నిర్లిప్తతరణి!" మానవాహంతకు ప్రథమ జన్మ శారదరాత్రి రమణీయ దృశ్యంలో...ఆ స్థితి చంద్రికా క్షీరసాగర స్నాపితమై భాసించింది.

అహంతకు అమృతత్వం లభించింది. ఈ పునర్జన్మ వర్ష సంభృతమూ అనంతమూ అగు కృష్ణ సాగర మధ్యంలో! అది నిర్లిప్తంగా తరణిలా సాగిపోతోంది. తరణి సూర్యుడొక్క పడవ కూడా కావడం యిక్కడ ఒక మనోహర చిత్రానికిఉపాలంభమైంది.

ఈ వసంత ముహూర్త సమీక్షణమ్మె
దగ్ధ కామ మనంగతానర్శనమ్ము!
సత్య సుందర మద్వైత శాంతి కాంతి!
రాత్రి అవతలి గట్టుపై ప్రసవమైన
ఆత్మ బహిరంతరముల నిశాంతమూర్తి!

అన్న ఐదు పాదాలూ మొత్తం కావ్యానికే పంచప్రాణాల వంటివి. ఒక సంపూర్ణత్వాన్ని చేకూర్చే గోపుర కలశ ప్రతిష్ఠాపన కావించాయి. వాసంతికా ముహూర్తాన్ని సమీక్షిస్తుంటే — దగ్ధమైపోయిన కాముని అనంగత్వం దర్శనమిస్తోంది. వసంతం కామ సందర్శనానికి కాక, కామ దహనానికే ప్రతీకగా నిలుస్తోంది;

కుమార సంభవ మాహాత్మ్యంతో! కనక అనంగదర్శనమైంది. అంటే సర్వకామనలు భౌతిక రూపాన్ని త్యజించి, ఆత్మ అనే అనంగత్వాన్ని భజిస్తోంది. ఎంత మనోహర భావాన్ని ఎంత సంగ్రహంగా అభివ్యక్తం చేయగలిగాడో కవి! ఆ అనంగతాత్మ ఎలా ఉంది? సత్య సుందర – శాంతి కాంతుల అద్వైత స్వరూపంగా భాసిస్తోంది. రాత్రి ఆవలి గట్టుపై ప్రసవించిన ఆత్మ అది. ఈ ప్రసవించడమూ ఒక గడసరి మాటే! పూవుగా విరియడమూ, జీవ స్వరూపంగా అవతరించడమూ ఈ పదం ద్వారా దర్శనమిస్తాయి. ఆత్మ బహిరంతరాల నాక్రమించిన నిశాంతమూర్తి! కనక కావ్యమే నిశాంతమైంది!

ఇంత మధుర మంజులమైన కావ్యాన్ని రచించి సహృదయులకు ఎలలో సమర్పించినందుకు కవినీ, ప్రచురణకర్తనీ హృదయపూర్వకంగా అభినందించవలసిందే! కేవలం స్థూలీపులాకమైన పరిశీలనకే యింత గ్రంథం పెరిగింది. దీనినిబట్టే సహృదయులీ కావ్య ప్రాముఖ్యత నవగాహన చేసుకోగలుగుతారు. కావ్యాన్ని సమగ్రంగా పరిశీలిస్తూ తన రస లుబ్దతను ప్రదర్శించే వ్యాఖ్యాత ఎంత గ్రంథం రాయవలసి వస్తుందో! ఒక సుదీర్ఘ తపోదీక్షలో కవి హృదయం నుంచి ఉద్గారమైన కావ్యమిది. జీవన సాఫల్యమిది

["నిశాంతం" ప్రతులకు శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం: ప్రిన్సిపాల్, గవర్నమెంట్ కాలేజీ, అనంతపూర్, అనే చిరునామాకు మూడు రూపాయలు పంపితే సహృదయులీ కావ్యాన్ని పొందగలరు. ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు 3237 రాష్ట్రపతి రోడ్, సికిందరాబాద్–నుంచి కూడా కాపీలు పొందగలరు.]

శ్రీ సోమసుందర్

# నేత్రము

## కుమారి విజయ సంజీవ

అన్యాయాలుచూసి భరించమని కళ్ళు ఇచ్చినవాడు
న్యాయం చూడాల్సి వస్తే మూసుకొమ్మని
రెప్పలుకూడా ఇచ్చాడు.
నా శరీరానికే ఒక జత కళ్ళున్నాయి
అవి ఎపుడూ తెరిచి ఉంటాయి.
మూసుకునే అవసరమే రావటంలేదు—!?
అలిసిపోయింది. విశ్రాంతి కోరుకుంటుంది
నా నేత్రం, ఇక చూడలేక పోతుంది.
నా మనో నేత్రం ఎన్నో తప్పులు వెతికి
లిస్టు రాసిచ్చి నిలదీసింది.
నా విజ్ఞాన నేత్రం ఆ తప్పులను పట్టుకోవాలని
శతవిధాల ప్రయత్నం చేసింది.
నా అనుభవ నేత్రం "నీకెందుకు? నోర్మూసుకోరాదూ"
అని గట్టిగా కసిరి కొట్టింది.
యథాతదంగా కళ్ళజత, మనో నేత్రం
తదేకంగా కృషి చేస్తున్నాయి యంత్రాల్లా –
ఫలితం శూన్యం!
నా బుద్ధి నేత్రం మాత్రం ఎందుకో నిద్రపోతుంది
తన కిలాంటి వేమి పట్టనట్లు.
ఒక్క నా బుద్ధి నేత్రమేగాదు, బుద్ధితో
పాటు సర్వ లక్షణాలు
స్తబ్దత పొందాయి, నేనేమిటో, ఉన్నానో–లేదో
తెలుసుకోలేక పోతున్నాను.
చైతన్యపు చురుకు పెట్టింది అవసరం
నిలువలేక పోయానొక్కక్షణం!
గతమనే పశ్చాత్తాపపు సెగలలో వాడి, కాలి
మసైపోయి, నిర్మలత బూదిగా వస్తేగాని
సత్యాన్ని నా అంతర్నేత్రం వినిపించలేక పోయింది.
అపుడు ఆప్యాయంగాకలుసుకున్నాయి రెప్పలు.
అంతా చీకటి ఆవరించుకుంది. ఎంత ప్రశాంతంగా
హాయిగా ఉందీ చీకటి!
నిజానికి ఇన్నినాళ్ళున్న చీకటిలో చూడలేని
కళ్ళు ఇంద్రియాలు కావేమో?!
ఈనాడు చీకటిని భరించి చూడగలిగే
ఈ నయనాలు విలువైనవి.
ఇపుడు నా కళ్ళు పలుకోణాలనించి చూస్తాయి
పరమార్థాన్ని అన్వేషిస్తాయి.
ఇక ఏమాత్రమూ అన్యాయాలను చూడలేను
చూసినా సహించబోను. అందుకే
ధర్మ నిరూపణకు; ధైర్యానికి; మానవత్వానికి నాలో
దాగియున్న శక్తికి, రక్తికి, యుక్తికి
పరీక్ష అని మేలుకున్నాను–మరి మేలుకొనే ఉంటాను.

డా. యెల్దండ రఘుమారెడ్డి

# బాలసంతువారి ఉత్తరరామాయణం

జానపద సాహిత్యాన్ని కడుపునిండ చల్లగ నింపుకోని కలకాలం కాపాడుకుంటున్నవాళ్ళు జానపదులు. వాళ్లల్లో జానపద భిక్షుకులది మరింత ప్రత్యేకత. ఈ భిక్షుకులవల్ల ఇతిహాస పురాణ గాథలేగాక, రాజులకు సంబంధించిన చారిత్రికాంశాలుకూడ ఇప్పటికీ మిక్కిలి ప్రచారంలో వున్నాయి. ఇతిహాస పురాణ గాథలను వాళ్ళు తమ ప్రత్యేక బాణీలో భాషలో అల్లి బతుకుతో ముడేసి ధర్మాన్ని ప్రచారం చేసింద్రు. పలనాటి, బొబ్బిలివంటి వీరగాథలను చెప్పి జాతి పౌరుషాన్ని తెల్పి జాతీయ చైతన్యాన్ని పాదుకొల్పింద్రు. అందువల్ల వీళ్ళు కేవలం భిక్షుకులుకారు. సంస్కృతీ సంరక్షకులు, ధర్మప్రచారకులు, జానపద జీవన వైతాళికులు.

వెనుకటి దినాల్లో, జానపద భిక్షుకులు రాజవంశాలను ఆశ్రయించి జీవించింద్రు ఆ వంశాలు రూపుమాసిపోయిన తర్వాత ఆయా భిక్షుకులు ఆయా ప్రత్యేక జాతులవాళ్ల ఆదరంలో బతుకు సాగించింద్రు. ఆ పిదప నేటికీ అన్ని జాతుల వాళ్లను, అన్ని తెగల వాళ్లను అడిగి పొట్ట గడుపుకోవటం దిక్కయింది. ఈ స్థితిలో వాళ్ల పరిస్థితి దుస్థితి పాలయింది. కడప కడప కాడ కడుపు ఎండి గత వైభవాన్ని గానం చేస్తున్నా పట్టించుకోకపోవటం విచారకరం. ఎవరు పట్టించుకోకపోయినా వాళ్లు మాత్రం వాస కోయిలోలె పాడుకుంటూ మూసిందో పాసిందో ముత్తెవంత పెట్టించుకోక మానరు.

జానపద భిక్షుకులలో శారదకాండ్రు, వీరముష్టివాళ్ళు, పిచ్చుకగుంట్లు, బీరన్నలవాళ్ళు, దాసర్లు, బాలసంతులు, బుడబుడకలవాళ్ళు, గంగెద్దులవాళ్లే గాక ఇంకా అనేక రకాల వాళ్లుంటరు. సాధారణంగా వాళ్లందరివి సంచార జీవితాలు. అధిక సంఖ్యాకులు శైవ మతావలంభులు. శైవ వైష్ణవ మత విజృంభణకాలంనుంచే ఇట్టి జానపద భిక్షుకు లెక్కువగా రూపొందుట జరిగివుండును. సామాన్య జనానీకానికి వారివారి మతాలను మిక్కిలి చేరువగా గొంపోవుటకు చేసిన యోజనలో జానపద భిక్షుకుల సృష్టి ఒకటి.

## బాలసంతులు :-

బాలెంత తనం లేదా సంతు (సంతానం) నిచ్చువాళ్ళు బాలసంతులు. వీళ్లు శైవ సంప్రదాయకులు. గురువులు జంగములు. ఇప్పటికీ సంవత్సరానికి జోలెవొక్కంటికి (ప్రతి బాల సంతువానికి) ఐదు రూపాయల చొప్పున జంగాలకు గురుదక్షిణ ఇచ్చుకునే కట్టడి వుంది. ఒక్క బాలసంతు వాళ్లే సుమారు ముప్పై రకాల వేషాలతో కనిపిస్తుంటరు. కాటిపాపని వేషం, సాధువేషం, మందపిచ్చోని వేషం, తగరుజోగు వేషం, వంటివేగాక; తోలుబొమ్మలాట, బయిరోపు లొల్లాటలు గూడ వీళ్లే వేస్తుంటరు. అందులో తాంబూర మీటుతూ హస్త సాముద్రికం చెప్పేవేషం కూడ వుంది. ఈ వేషగాళ్లంతా వేరువేరు గోత్రాలవాళ్లు. అయినప్పటికీ వీళ్లదంతా బాలసంతుశాఖనే. వీళ్లల్లో వీళ్లు పిల్ల నిచ్చుకోవటం వంటి వివాహాది సంబంధాలున్నాయి.

సంతానం లేనివాళ్లు బాలసంతు వాళ్లవద్ద పాత అంగీలు, కుల్లాలు, బొంతలు, అడుక్కోని కలిగిన తమ సంతానానికి తొడుగుతుంటరు. బాల సంతుల ఆశీర్వాదం ఫలిస్తుందని వాళ్ల విశ్వాసము. సాధారణంగా బాలసంతులు తొలికోడికూసిన యాళ్ల లేసి, పొద్దుపొడిసేలోపల ఇల్లిల్లు దర్శించి, బిచ్చమెత్తుకోని పోతుంటరు. అప్పుడే పొలం పనులకు సిద్ధమయ్యే పల్లె జనానికి బాలసంతు వాళ్లరాక శుభప్రదం. వంటింటిలో ఇంకా వంట ఆరంభింపక ముందే వచ్చిన ఆ భిక్షుకులకు బిచ్చం పెట్టి, స్త్రీలు వంట చేయుటలో మునుగుట ఇటీవలి దాక జరిగింది. మోటగొట్టి సేద్యంచేసే దినాలలో పల్లెజనం తొలికోడికూయంగనే మేల్కొంటుండేది. బాల సంతులకు బట్టబాతలు దానం చేస్తుండేది. నేటికీ అచ్చం పల్లె వాతావరణం వున్న పల్లెల్లో ఇట్లే జరుగుతుంది. దాన మడిగి తెచ్చుకున్న బట్టబాతలు ఎప్పుడూ తమ కావడి బద్దకు తగిలించుకోని తిరుగుతు సంతు అయిన వాళ్లకు తిరిగి దానం చేయటం బాలసంతు వాళ్ల పరిపాటి. తమ కవసరమయ్యే మిగతా గుడ్డలను మాసికెలు మాసికెలుగా కలిపి కుట్టి వెనుక వైపున ముందువైపున నేలకానునట్లు జారగట్టుకొనే బొంతను 'పేరిణి బొంత' అంటుంటరు. బహుశః ఇది శివుడు పేరిణి తాండవమాడేటప్పుడు ధరించే లేడి చర్మాన్ని తలపింపజేస్తున్నట్లనిపిస్తది. ఆ బొంతను ధరించటం వాళ్ల వేష ధారణలోని ప్రత్యేకత. పసిపిల్లలకు వాతం, మలబద్దకం, ఉబ్బసం, కడుపునొప్పివంటి ఉదర వ్యాధులు వస్తే బాలసంతువాళ్లచేత వాళ్లాదే శంఖాన్ని సానరాయిమీదు నూరించి, ఆ గంధాన్ని తమ పిల్లలకు నాకిపిస్తుంటరు. బాలసంతుల శంఖాన్ని చూస్తే అది అరిగిపోయిన గుర్తులు స్పష్టంగా కనపడుతయి.

వీళ్లు సీతమ్మ కథను, అందులో ఉత్తర రామాయణ ఘట్టాన్ని విలక్షణమైన బాణీలో కరుణ రసాత్మకంగా పాడుతు ఇల్లిల్లు తిరుగుతుంటరు. సీతమ్మ అంటే బాలసంతులకు ఎక్కడ లేని ప్రేమ.

లోకాపవాద భీతివల్ల రాముడు తిరిగి సీతమ్మను అడివికి సంపటం, ఆ అడివిలో దిక్కులేనిదై ఆమె ప్రసవించి పడేగోసలు అయోధ్యలో నిద్రలో మునిగిన లక్ష్మణునికి కలలో తోచటం, వెంటనే ఆయన దిగ్గునలేచి శివుని వద్ద కావడిబద్దను, జోలెలు, శంఖం, గంట మొున్నగునవి గైకొని జంగం వేషం గట్టి జోలెల్లో బాలెంత మందులు, అంగికుల్లాలు, హంసల తొట్లె, పెట్టుకొని సీతమ్మతల్లి చెంతకుపోయి చూసి, మనసులోనే ఏడ్చి ఏడ్చి బాధను మింగుకొని తాను తెచ్చిన గాయి మందులన్నీ ఆమెకు దానం చేసి తిరిగి అయోధ్యకు చేరుకోవటం వంటి విశేషాలు బాలసంతుల ఉత్తర రామాయణంలో వున్నాయి. ఇట్లా సంతు అయిన సీతమ్మను కారడవిలో ఆయాస పడకుండ లక్ష్మణుడు జంగమ వేషంలో పోయి ఆదుకొన్న విషయమే బాలసంతు వాళ్లకు సంప్రదాయమయింది.

అందుకే వాళ్లు అట్టి వేషంతో, అదే ధ్యేయంతో, వృత్తిని చేపట్టినట్లు వాళ్లవల్ల తెలుస్తుంది. ఇపుడు బాలసంతు వాళ్ళు పాడే ఉత్తర రామాయణాన్ని గురించి పరిశీలింతం.

## ఉత్తర రామాయణం :-

ఆదికవి వాల్మీకి మహర్షి రామాయణం లోకమంతా పేరెల్లింది. ఎందరో రచయితలు పెక్కు భాషల్లో దాన్ని అనుసరించి రాసింద్రు. కొందరు కొన్ని మార్పులతో కలిపి రాసింద్రు. మనదేశంలో రామాయణ కథ తెలువని వాడుండడు. పండిత వర్గంలో రామాయణం వాల్మీకీయంగా ప్రాచుర్యం వహిస్తే, పామర జనంలో అందలి అనేక ఘట్టాలు వల్లీయంగా రూపు దిద్దుకున్నాయి. జానపద సాహిత్యంలో రామాయణ సంబంధ గేయాలు పరిశీలిస్తే పల్లెటూరి హృదయం ప్రకృతి అంత కనిపిస్తది. సీతారాములు వాళ్లకు తల్లిదండ్రులు. సీతారాముల పెండ్లి చూసి వీళ్లు బతుకునిండ పచ్చతోరణం కట్టుకుంటరు. వాళ్ల అడివి సోకం చూసి వీళ్లు గుండె అవిసిపోయేటట్లు ఏడుస్తుంటరు. సీతమ్మతల్లి మంటల్ల దుంకుతుంటె ఎద గుద్దుకొని గుద్దుకొని సస్తుంటరు.

బాలసంతులు, ఇరువైపుల జోలెలు తగిలించుకున్న కావడి బద్దను భుజాన మోసుకుంటు, ఒక చేత గంట వూపుకుంటు, మధ్యమధ్య శంఖం వూదుకుంటు, ప్రత్యేకమయిన తమ బాణీలో ఉత్తరరామాయణం పాడుతుంటె రాతిగుండెకూడ సిమ్మటిస్తది. వీళ్లరామాయణంలో రాముడు సీతమ్మను తిరిగి అడివికి పంపటానికి చాకలివాడు తన భార్య శీలాన్ని శంకించి సీతమ్మ పరంగా రామున్ని ఎత్తి పొడుస్తూ నిందించిన పలుకులే కారణం.

''ఈ అదనా సాకలివాడు ఆ అదనా సాకలివాడ
బజార్లలోపల ఈ పట్నంలోపల
ఈ ఎర్రిరాముడు ఎడ్డిరాముడు గనక
ఏలుతున్నడు భార్యను, నేను ఏలుతానా
నిన్ను అన్నడూ పాని భార్యతో వాడన్నడూ''

అనుట ఇది వాల్మీకీయమయింది.

కంకంటి పాపరాజకృత ఉత్తర రామాయణంలో—

''కాకలంకమయినట్టి సతి
సంభవించియు రామచంద్రుడకట
తొడమీద నిడుకొని దోషాచరాగ్రణి
యెత్తుకచని లంక నేడు కాల
ముంచిన యిల్లాలి నించుక కొంచక
మరల దాగొని వచ్చి మరులు పె
యెచ్చరికములేక యేలుచున్నాడు
చేతకు విశ్వానికి జిక్కినాడు
పగతు రేకాంతలను జెఱపట్టి కొన్న
బలిమి విడిపించు కొనితెచ్చి కలియవచ్చు
ప్రజకు రాజాను మతమె ధర్మంబుగాదె''
(షష్ఠాశ్వాసము—200)

అనుచు పురజనులు పలికినట్లు చెప్పటం జరిగింది. ఇది వాల్మీకీయం.

రాముడు లక్ష్మణుని పిలిసి సీతమ్మను అడివికి తీసుకపోయి తలపండుగొట్టి కనుగుడ్లు తెమ్మని ఖడ్గమిచ్చి చెప్పిన విషయం సీతమ్మకు అయోధ్యలోనే తెలుస్తుంది. ఆమె లక్ష్మణునితో—

'' ఓ నాయనా ! మరదీ లక్ష్మణా
మీా అన్నయ్య ఆజ్ఞలు ఎల్లినయి
పోదాము పదవయ్య నా లచ్చుమయ్యా'

అంటూ రామాజ్ఞ తప్పదంటది. ఇదంత బ్రహ్మరాసిన రాత అనుకుంటది. మారేండ్లు చింతించినా పోదమనుకుంటది. వాల్మీకి రామునికంటె బాలసంతువాళ్ల రాముని ఆజ్ఞ క్రూరంగా వుంది. ఇది కొందరు పూర్వం రాజులు వేసే శిక్ష వంటిది. వాల్మీకి రామాయణాన్ని దృష్టికి పెట్టుకున్న కంకంటి తన ఉత్తర రామాయణంలో రాముడు లక్ష్మణునితో—

''అ, వాల్మీకుల్ వసియించు నాశ్రమము
చేర్పన్ డించిరమ్మా వెన్షన్'' (ష. ఆ—222)

అంటడే గాని మరే క్రూరత్వం చేయించలేదు. అదేగాక ఆ రహస్యాన్నికూడ ఆమెకు తెలువనీయలేదు. అందుకే సీతమ్మతో లక్ష్మణుడు ''మాతా గంగాతీరాశ్రమ మేక్షాసక్తిన్ నినునందు దోడ్కొని పొమ్మంచున్,

విభుడంపినన్—వచ్చితి రథము దెచ్చితి విచ్చేయు'' మంటడు. అయితే ఏమెరుగక వేడుక పడుతది. కాని త్రోవలో దుశ్శకునాలు కన్పించగా భయపడుతది. లక్ష్మణుడు ఆమెను వాల్మీకాశ్రమ ప్రాంతాన విడిచి రామాజ్ఞ విన్నవిన్నడు. అప్పుడామె కన్నీటి వలపోత మొగులు వగిలి కుండలపోత పోసినట్లె. కరుణరసం గంగ పొర్లాడినట్లె అయితే బాలసంతు వాళ్ల సీతమ్మ అడివికి తెరెక్కిపోలేదు. జారు పదులోలె కాలినడక సాగిన్నది. నడిసి నడిసి అలిసి సొలిసి పోతది మధ్య మధ్య—

''ఓ నాయనా ఓ మరదీ లక్ష్మణా
ఈ అడివిలోపల నడిసి నడిసి
నడిసి నా కాళ్లకు బొగ్గలొచ్చె నాయనా
ఊపినా సేతులను లేవలేనైతి
రాళ్లకు తాకిన గోళ్లకు సిల్లుసిల్లున రగుతమూ
సిల్లులాయె నాయనా నాముద్దు మరదీ నాయన్నా నీవూ''

అంటూ దైవాన్ని తలుస్తూ క్రూర మృగాలు తిరిగే ''ఇటువంటి అడివిలో, ఆరండపడివిలో—తిరుగ నా వశము గాదు మరదీ—నా లచ్చుమయ్యా'' అంటూ వలపోస్తుంటది. లక్ష్మణుడేమో ఒక వంక అన్నగారి చండశాసనం దలచుకొని, మరోవంక వదినమ్మ వల పోత కండ్లార చూస్తూ—

''అయ్యయ్యో దైవమా లోకరక్షకా
వొదినమ్మా సీతాజానకమ్మా
పొద్దు వోతుంది అన్నయ్య రామచంద్రుడు
అతి కోపస్తుడు నడువమ్మ లోకమాత''

అంటూ అడకత్తిలో పోకోలె అయినప్పటికీ,అన్నగారి ఆజ్ఞపాలించక తప్పదాయె. పాపం! అతని పరిస్థితి గమనించి సీతమ్మ—

''మీ అన్న ప్రాణాల కంటె ఎక్కువనా
పోదాము పదవయ్య లక్ష్మణా
పోదాము పదవయ్య తలపండు కొడ్డువు
నా ముద్దూ మరదీ —నాయన్న నీవూ'' అంటూ అడివి

నడిసి నడిసి దేవాన దేవతలను దలుసుకోని ఒకచోట మొద్దుమీద తల మోపుతు తెగనరుక మంటుంది. అప్పుడు లక్ష్మణుడు కండ్లు రొంపి రొంపి చేసుకోని రాముడిచ్చిన ఖడ్గమెత్తి —

''ఆ సెనికల్ల కొట్టిన సెంద్రహారాలయితయి
ఆ నడుముల్ల కొట్టిన నడుముకు డాములయితయి
కాళ్లమీద కొట్టిన బంగారు కడియాలయితయి''
అప్పుడు ''అయ్యో దైవమా లోక రక్షకా
లోకమాత సీతమ్మతల్లి యందే తప్పులులేవు
న్యారములులేవు పరమాత్మా భగవంతా'' అంటు

లక్ష్మణుడేమి తోసక నిలవడుతడు. సీతమ్మ

''ఇప్పుడన్న ఎల్లిపోదం పదవయ్య
పర్ణశాలకు నాయనా''అంటుంటది. కాని

రామాజ్ఞ ఎంతటిదో లక్ష్మణునికి తెలుసు. కడకో ఉపాయం ఆలో చించి లేడినిగొట్టి దాని కనుగుడ్లను దీసి డొల్లల వెట్టుకోని అవి వదినమ్మవని సెప్పుతానంటూ సీతమ్మకు మొక్కి వలవల ఏడ్చు కుంటూ అయోధ్యకుపోయి అవి రామునికి సూపిస్తడు రామునికోసం సీత ఆరాటపడ్డ విషయం, తలపండు గొట్టేటప్పుడు ఆమె గిలగిల గొట్టుకొన్న దృశ్యం సేదకుత్తుకతో వివరించి చెప్పినప్పుడు తల గిర్రున తిరిగి ఆ రామచంద్రుడు—

''హా సీతా హా సీతా ఎందు వోతివే కుందరదన
నా ప్రాణమా నా ప్రాణసఖీ ఎందువోతివే జననీ
అయ్యో నాయనా తమ్ముడా లక్ష్మణా
కోపతాపాన అన్నంత పని చేస్తివా
హా లక్ష్మణా నా ముద్దుల తమ్మీ
నా లచ్చుమయ్యా నీవు'' అంటూ

వాపోతడు. దీనివల్ల సీతను రాముడు శాసించిన విధమంతా కోప తాపానవేగాని నిజంగా కాదని ఇక్కడ తెలుస్తుంది. మళ్లీ ఇక్కడ వాల్మీకి రాముడనే అర్థమవుతది. కోపతాపాన తలపండు గొట్టి కనుగుడ్లు తెమ్మన్నట్టి ఆజ్ఞమాత్రం వెనుకటి రాజుల ఆజ్ఞ వంటిదే కాని అసలు రామునిది కాదనే చెప్పుకోవాలె.

వాల్మీకి నాటి వాతావరణం జానపదుల వాతావరణంలో ఇటు వంటి మార్పులే చోటు చేసుకుంటుంటయి.

అయోధ్యలో రాముడొకవంక పరితపిస్తుంటే ఇక్కడ సీతమ్మ ఏకాకి అయి దిక్కుతోచక—

''ఇటువంటి అడివిలో ఓ చిలుక హంసల్లారా
ఓ కోయిలల్లారా ఓ పొన్నరుచ్చం లారా
ఓ గున్న మావిల్లారా ఓ కల్కి వొనాంతంలారా
ఓ తల్లుల్లారా ఓ యమ్మలారా వినుండమ్మ
నా అష్టకష్టాలు నా అరిబాధలు తల్లులార మీరు''

అంటూ మొరపెట్టుకుంటుంది. ఆ మొర విన్న పక్షులెల్ల నొసట రాసిన ఫలం నోమినా పోదుతల్లీ అంటూ ఓదార్చినయి.

(కాని వాల్మీకి రామాయణంలో ఆశ్రమంచెంత వలపోసే సీతను మునిసుతలు సూసి వాల్మీకికి చెప్పుతారు. అప్పుడు వాల్మీకి ఆమెను సీతగా గుర్తించి తన ఆశ్రమానికి దెచ్చి సుఖంగా వుంచు తడు.)

అయినా ఆ తల్లి సొద ఆరదు. ''నరుడులేని నారాయణుడు లేని ఆరండంలో—నా అలతి గాదంటది పొలతి సీతమ్మ''. పండ్లు ఫలాలు దింటూ, బల్సుకాయలు దింటూ—

''నిండు చూలాలై వద్దిమానుకింద కూసోని
వొలవొల వొలపోస్తు ఏమంటున్నదమ్మా
నడుములు కలుకు మంటుందంటది
గుండె జల్లు జల్లు మంటుందంటదమ్మా''

ఇటువంటి స్థితిలో చుక్కలు చూడవాయె. సూర్యుడు గతిదప్పె నాయె. తొలిగాలి కమ్ముకొన్న యాళ్ల లాలిముద్దుల లవ కుమారున్ని గన్నది. కుమారుని సూసుకోని గుండె సెరువై రోదిస్తుంటే దగ్గెర పట్లపోతున్న వాల్మీకి మునీశ్వరుడది విని ఆమె తానికివచ్చి వూరు పేరులన్ని అడిగి తెలుసుకుంటడు. వాల్మీకి రామాయణం లోని వాల్మీకి; సంతానం కాకముందే సీతను చూడటం, ఆశ్రమా నికి తోలుకపోవటం, అక్కడనే ఆమె కుమారులను కనటం జరుగు తుంది. బాలసంతు రామాయణంలో సీతమ్మకు మరింత దిక్కు లేకుంటయ్యింది. అడివిలోనే ప్రసవించటం జరిగింది. అదుకునే వారులేరు. అడివే దిక్కు.

అడివి దిక్కైన ఆ సీతమ్మ తల్లి వొద్ది మానుకు తొట్లె గావించి అందులో పిల్లవాన్ని పండవెట్టి బతుకే కన్నీటి పాటై జోలవాడుతు, వచ్చిన మునీశ్వరున్ని జూసి —

"ఓ తాతయ్య ఈ అడివిలోపల నాకెవరు దిక్కులేరు.
ఈ పిల్లగాని తాన కావలుండవయ్యా తాతయ్య
ఆ సముద్రానికోయి తానమాడి వొస్తా" నంటది. సరే అంటూ వాల్మీకి తొట్లె ఊపుతు నిద్రపోతడు. సీతమ్మ బాలెంత నీళ్లు పోసుకోనటానికి సముద్రానికి పోతూ త్రోవలో —

"ఆ కోతులూ కొనెంగలూ
దుప్పలూ మనుపోతులూ
తమ పిల్లల సంక నెత్తుకొని పోతుంటే" చూసి

"ఈ అడివి మృగాలకు లేని బరువు
నా వొక్కదానికి వొచ్చెనా అయ్యో దైవమా" అంటూ వెంటనే తిరిగి వొద్దెమాను చెంతకు వొస్తది. వాల్మీకి నిద్రపోయి వుంటడు. అతనికి చెప్పి తన పిల్లవాన్నెత్తుక పోదామనుకుంటది. కాని నిద్రలేపితే ఆ మునీశ్వరునికి ఏ కోపమొస్తదో ఏ శాపం బెడ్తడో అని భయపడుతూ మెల్లగా పిల్లవాన్ని తొట్లె నుంచి సంక నెత్తుకొని సముద్రానికి పోతది. కొంతసేపటికి వాల్మీకి నిద్ర లేసి చూస్తే పిల్లవాడు కన్పించడు. అడివి మృగాలెత్తుకపోయి తిని వుండ వొచ్చు ననుకుంటడు. సీతమ్మవస్తే ఏమి తిట్టి పోస్తదో, ఏ శాపమిస్తదో అని తక్షణమే —

"అప్పుడా మునీశ్వరుడు ఎద రొమ్ము తాకి
మట్టిబొమ్మను జేసి జీవులు వోసి
ఆ తొట్లెల ఏసి లాలి లాలి లాలీ
రార నాయన్న లాలీ" — అంటూ జోగల వాడుతుంటడు.

అటు సముద్రంలో పిల్లవాన్ని కడిగి, తాను జలకమాడి సీతమ్మ తిరిగి వొద్దిమాను కాడికి వొస్తది. మరో పిల్లవాన్ని చూస్తది. మునీశ్వరున్ని అడుగుతది. జరిగిన సంఘటన గూర్చి ఆయన చెప్తడు. రెండవ కుమారునిగా పెంచుకొమ్మని సెలవిస్తడు. దీవించి ఆన్పుంచి ఎల్లిపోతడు ఇదంతా అవాల్మీకీయం. బాలసంతు వాళ్ళ కల్పన. అయినా సీతమ్మకు ఒక్క కుమారుడే పుట్టటం, రెండవ కుమారున్ని వాల్మీకి సృష్టించటం అన్న విషయాలు మనం గ్రహించాలె. కంకంటి పాపరాజు ఉత్తర రామాయణంలో సీతమ్మ ఇద్దరు కుమారుల గన్నట్లు,

"ధరణీ పుత్రియు నాటిరాతిరి శభస్థానంబులన్ సద్గ్రహో
త్కరముల్ నిల్వగ వంశ దీపకుల పుత్రశ్రేష్ఠులన్ గాంచె ని
ర్వుర దత్సంభవవేళ బూలు కురిసెన్ మ్రోసెన్ దివిన్
దుంధుబుల్
దొరసెన్ జల్లనిగాడ్పు నల్గడల సంతోషించి రచ్చోబుషుల్"
(స—ఆ—పద్యం—96)

అని చెప్పట, బాలసంతు వాళ్లకన్న మూల వాల్మీకాన్ని పూర్తిగా ఈ విషయంలో పాటించుట జరిగింది.

వాల్మీకి వెళ్ళిపోయిన వెనుక వొద్దిమాను తొట్లెలో ఏడ్సే ఆ బాలలను ఊపుతూ —

"ఏడ్వకురా ఏడువకురా ఎర్రి లవ్వన్నా
ఏడ్సితే నిన్నెవరూ ఎత్తుకోరు తనయా
లో లో లలో అల్లా
రార రార రార లవన్నా నీవూ
సిన్న కుశలన్నా నా కుశ వీరా
నీ అవ్వా కౌసల్య కైకా సూమిత్రా
నీ తండ్రి రాముడు జగతీ వీరుడూ
పినతండ్రి లక్ష్మణా ప్రేమాతో పెంచూ" అంటూ జోల పాటలు, లాలిపాటలు పాడుతుంటది. అయోధ్యలో పుడితే ఆ బాలల వైభోగమే వేరుగా వుండేదని తలపోస్తూ వుంటది. అక్కడ అయోధ్యలో ఉక్కుకోళ్ల మంచం మీద నిద్రపోయిన లక్ష్మణునికి సీతమ్మతల్లి వొద్దిమానుకింద ప్రసవించినట్లు, కుమారులగన్నట్లు, అష్టకష్టాలనుభవిస్తున్నట్ల కల వడ్తది.

"అప్పుడా లక్ష్మణస్వామి ఉక్కుకోళ్ల మంచం నుంచి
దిగ్గున లేచి అయ్యో రామ రామ
ఊరి బయటికెళ్ళి ఈశ్వరుని వద్ద కోయి
కావడి గట్టుకోని సిలుక తొట్టెలె వెట్టుకోని
ముందట మున్నూరు జోలెలు,
ఎనుక వెయ్యి నూర్ల జోలెలు,
నడుమ నాగలోకాల జోలెలు వెట్టుకోని
బాలెంత ఎచ్చాలు బాలలకు సమరులు
ఎన్నా గురుగులు కుట్టినంగీలు కచ్చుల కుల్లాలు
తీసుకోని హర హర శంభో" అంటూ సీతాదేవి వున్న సోటి కొచ్చి, ఆమె బాధలు సూస్తడు. లోలోపలనే దుఃఖాన్ని మింగుకోని—

"ఓ తల్లి లోకమాతా దానమని వస్తినమ్మా
దా మీయమ్మ బాలసంతు దానమను
జంగమయ బిచ్చంబెట్టు తల్లి బాల సంతులం"

అని దానమడుగుతడు. బాలసంతులకు బిచ్చం బెట్టలేని అడివిపక్షి నైతినని ఆ తల్లి మదన పడుతుండగానే—బంగారు మొంటెలనిండ ముత్యాలు వొస్తయి. అని లక్ష్మణుని జోలెలో పోస్తది. అతడేమో తాను దెచ్చిన బాలెంత గాయమందులు కుట్టినంగీలు కుచ్చుల కుల్లాలు, ఎన్న గురుగులు అన్నీ ఆమె కిచ్చి తిరిగి శివునిటానికొచ్చి కావడిబద్ద, గంట, జోలెలు, ఇచ్చేస్తడు.

అప్పుడా లోకమాత —
ఎన్న గురుగుల ఎన్న ఉగ్గు వట్టించీ
సిలుక తొట్టెల్ల బాలలవేసీ
జోలపాటలు పాడు తుండేనమ్మా
శివ జానకమ్మా" అంటూ

బాలసంతులు చివరికి ఆ తల్లిని అడివిపాలుజేసే ఒప్పంద్రు. రామచంద్రుడుగాని, భూతల్లిగాని, ఆ వాల్మీకిగాని, ఆమెను ఆదుకున్నట్లు లేదు. బాలసంతువాళ్ల సీతమ్మగాథ విషాదాంత మయింది. మరింత దయనీయమయింది.

శ్రీ మాదాడి నారాయణరెడ్డి | శ్రీ ముదిగొండ ఈశ్వరచరణ్

# ఆదిలాబాద మాండలికాలు

వ్యక్తమైన వాక్కు భాష. వాక్కు వ్యక్తమగుటలో ఎన్నో మార్పులు పొందుతుంది. కులాలనుబట్టి, వృత్తులనుబట్టి, రాజకీయ సాంఘిక ఆర్థిక విద్యా సంస్కార స్థితులనుబట్టి, దేశ కాల పాత్రములనుబట్టి, శీతవాతాతపములనుబట్టి మార్పులుపరిపరి విధాలుగా ఉంటాయి. వేర్వేరు భాషల కలయిక చేతకూడా భాషలో కొన్ని క్రొత్త పదాలు చేరడం జరుగుతుంది. ఈ విధంగా ఒక భాషయొక్క ఉచ్చారణ విధిలో, పదస్వరూపంలో, వాక్యనిర్మాణంలో కలిగిన మార్పులను పరిశీలించి మండలాలవారిగా లేక ప్రాంతాల వారిగా వర్గీకరించి వాటిని ఆ భాషయొక్క మాండలికాలని చెప్పడం పరిపాటి.

మండలానికి చెందినది మాండలికం. మండలం అంటే దేశ మని శబ్దరత్నాకరం చెబుతున్నది. పూర్వకాలంలో దేశాన్ని మండ లాలు, నాడులు అని విభజించేవారు. ఇప్పుడు జిల్లాలు తాలూకాలు అని విభజిస్తున్నారు. ఈనాడు 'జిల్లా' లేక 'డిస్ట్రిక్టు' అనే పదా లకు సమానార్థకంగా మండలం వాడుకలో ఉన్నది. ఒకే భాష మాట్లాడే దేశంలో ఒక మండలంలోని వాడుకను ఇతర ప్రాంతా లతో పోల్చి చూచి కనుపించే ప్రత్యేకతలను అక్కడి మాండలికము అని చెప్పవచ్చు. స్థూలంగా ఇదీ నిర్వచనం.

ఆదిలాబాద మండలం ఆంధ్రప్రదేశ్‌లో బహుశా పెద్దజిల్లా. తెలంగాణా ఉత్తర దిశన మహారాష్ట్రకు సరిహద్దులో ఉన్నది. సుమారు సగభాగానికి తెలుగు దేశంకంటే మహారాష్ట్రతోటే సామీప్యం ఎక్కువగా ఉన్నది. ఇంతేకాకుండా తెలంగాణలోని ఇతర ప్రాంతాలతో రవాణా సౌకర్యాలు నిన్న మొన్నటివరకు అభివృద్ధి చెందకపోవడంచేత ఇక్కడ తెలుగుదనంకంటే మహారాష్ట్రీయత ఎక్కువగా కనబడుతుంది.

ఆదిలాబాద జిల్లా కేంద్రస్థానం. దీనినే 'ఏదులాపురం' అని కూడా పిలుస్తారు.ఇది మహారాష్ట్రకుకేవలం ఏడుమైళ్ళదూరంలో ఉంది. ఇక్కడి సంబంధ బాంధవ్యాలు,రాకపోకలు,వర్తకవాణిజ్యాలు సర్వం మహారాష్ట్రతో జరుగుతూ ఉంటాయి. ఇక్కడి జనాభాలో ఎక్కువమంది మహారాష్ట్రనుండి వలస వచ్చినవారు. వీరితో కలసి ఇక్కడి తెలుగువారు కూడా తమ నిత్య వ్యవహారంలో, గృహకృత్యా లలో మరాఠీయే మాట్లాడటం వింటే మహారాష్ట్రయొక్క ప్రభావం ఎంత ఎక్కువగా ఉందో అర్థం అవుతుంది. కట్టూ బొట్టూ, ఆచార వ్యవహారాలు, సంస్కృతీ సంప్రదాయాలు తెలుగు మరాఠీల కలగలుపుగా కనిపిస్తాయి. ఇప్పుడిప్పుడు తెలుగు తనం మొగ్గలు వేస్తున్న మండలం ఇది. కాబట్టి ఇక్కడి మాండ లికాలలో తెలుగు మరాఠీలు కలసి మెలసి సహజీవనం చేస్తుంటాయి. ఇదికాక తక్కిన తెలంగాణకువలె రాజకీయ కారణాలవల్ల ఉర్దూ పదాలు కూడా సాక్షాత్కరిస్తాయి.

1 ఆయి : (మ) తల్లి.

2 అమ్మాయి : అమ్మ + ఆయి : తల్లితల్లి.

3 బాయి : (హిం) : స్త్రీ : పేరు చివర గౌరవార్థంలో చేరుతుంది—లక్ష్మీబాయి.

4 తాయి : అక్క : పేరు చివర గౌరవార్థంలో చేరుతుంది: మంగతాయి.

(1) (హిం) పెద్ద తండ్రి భార్య.

(2) (తె) వైకృత విశేషం : తల్లి.

5 బాటి : (మ) : చిన్న పాప. ముద్దు పిలుపు.

6 మావుషి (మ) : మావ్‌షి : తల్లి అక్క లేక చెల్లెలు.

7 కాకు (హిం. కాకీ) : చిన్నాయన భార్య.

8 వయ్ని : (మ) వయిని : వహిని : వదిన.

9 బొప్పడు : అన్న లేక తమ్ముడు.
(శ. ర. దేశ్య విశేషణం — మూఢుడు.)

10 దాద : (మ) అన్న.

11 బొప్ప (ప్పె) : పల్లెటూరివాడు—అమాయకుడు.

12 గురడి కాపులు : రెడ్లు : (గుడాటి భవం కావచ్చు.)

13 గూండ్లోళ్ళు : బెస్తవారు.

14 జిన్గరోళ్ళు : నకాశివారు.

15 బేల్దార్లు (ఉ) : సుతారివారు.

16 బారోళ్ళు : తమలపాకులు, పూలుమొదలైనవి అమ్మువారు.

17 శల్కం (తు) : వంశము.

18 బుడు (బు) ంగలు : వేరుశనగకాయలు.

19. తొగర్లు (ఉ : తువ్వర్) : కందులు.

20. మక్కలు : మొక్కజొన్న కంకులు.

21 కొల్లోడు : ఊరి కాపరి — మస్కూరి.

22 చకడ / రేంగి : సవారి బండి. (ఒకరు లేక ఇద్దరు ప్రయాణం చేయడానికి వీలుగా ఉండే చిన్న బండి.)

23 దమ్ని : సవారి బండి. (నలుగురైదుగురకు వీలైనది.)

24 కసల(2)ం : (తె : కచ్చడము) పెద్ద బండి.

25 బురక : బండియొక్క తడక గూడు.

26 కాండి : కాణి.

27 (బొ) దొత్తెలు : బేరెడి జోళ్ళు. (ఇక్కడ కొన్ని ప్రాంతాలలో కేవలం వాగలికి ఉపయోగించువానిని బేరెడి జోళ్ళని, బండ్ల కుపయోగించు వానిని దొత్తెలని అంటారు.)

28 జూళ్ళు : గంగిరెద్దులమీద వేయు రంగు రంగుల బట్ట. ఇక్కడ మామూలు సవారి బండ్ల ఎడ్లమీదకూడా వేస్తారు.

29 సవార్లు : పేరీలు.

30 సుద్ద : చిన్న వాగు.

31 కంక : కోడెదూడ.

32 మర్కోళ్ళు : (తె) : ఇతరులు. చాలా విచిత్రంగా మారిన పదం.మరియొకళ్ళు—మరొకళ్ళు—మరుకొళ్ళు—మర్కోళ్ళు—మర్కోళ్ళు.

33 కొడలి : కొడవలి.

34 బారాయి : మోటబావి — మోటబారు.

35 పోవు : (తె) : (1) చౌక (2) మంచి.

(1) ఇవ్వాళ కూరగాయలు పోవు.

(2) రెక్సోనా కన్న లక్సు పోవు.

36 లాకి : (తె) : తొందర : నేను లాకి పోవాలె.

37 బేటి (ఉ : భేట్) : కలుసుకొనుట.

38 బర : (మ) : అయితే.

39 సౌరగ : చక్కగ—సూటిగ. (సౌరుభవం)

40 సోవ (గ) : అందముగ.

41 ఖర : (మ) : నిజము. (ఉర్దూ 'ఖరార్' నుండి మరాఠీ లోనికి, అందుండి తెలుగునకు వచ్చి వుండాలి.)

42 ఖరాసి (మ) : నిజంగ.

43 సోప (మ) : సులువు. (Easy)

44 ఖ(క) ట్ల : (మ) : సంసారము.

45 మిలు : మీరు

46 చేద్దాడి : చేద్దాము.

47 చూద్వాడి : చూద్దాము.

48 మేరంగ : మేర : వలె.

49 మూతి : ముఖము. (సాధారణంగా నిందార్థములో వాడుతారు. 'నీ ముఖంలా ఉంది' అనడానికి నీ మూతిలా ఉంది)

50 ధూం : (ఉ) : ఎక్కువ.

51 ధింగాన : (మ) లొల్లి — అల్లరి.

52 సీద : (తె) సాయిత్యం. బియ్యం, పప్పు, ఉప్పు మొదలైన వంట దినుసులు.

53 మెందు : కష్టము.

54 జవరు : (ఉ) పెద్ద.

55 గూసులాట : (తె) : కొట్లాట—జగడము.

56 లడ్డె (గ) : (తె) లడ్డు + గ=లావుగ.

57 కొజ్జ (గ) : (తె) : పొడవుగ.

58 (నె) లెంకుట : వెతుకుట.

59 నిదానం : సూటిగ.

60 కొలాట్కం : పల్టీలు.

61 సులారి : (మ) బండి వెనుకకు లేచుట మిఠాయి లేచుట.

62 పల్సోనం (పలుసోనం) : (తె) : శోభనం.

63 ఫ్రబొట్టు : పూలు పండ్లు.

64 శాకర్‌పుడా (మ) : పూలు పండ్లు.

65 పైడి ముడువు (తె) : ఒలి యెత్తి యిచ్చుట.

66 భావ్‌బీజ్ : (మ) : ఒక పండుగ. (దీపావళి తెల్లవారి చెల్లెండ్రు అన్నలకు క్రొత్తబట్టలు పెట్టి పండుగ చేసుకుంటారు. 'ఆదిలాబాద పండుగ'లను గురించి ప్రత్యేక వ్యాసంలో వివరించబడుతుంది)

67 చల్లంబలి (తె) : పోచమ్మ (గ్రామదేవత) పూజ.

68 జడు : బరువు.

69 తానం—బోనం : స్నానం భోజనం.

70 ఉరుపట : (తె) : తల్లక్రిందులగుట!

71 రికం (ఉ) : ఖాళీ (సంస్కృత 'రిక్త'నుండి ఉర్దూ 'రికాం' వచ్చి వుండాలి.)

72 హర్ కట్ (ఉ) : ఇబ్బంది.

73 మాపు (ఉ : మాఫ్) : కొలత.

74 చిట్టెడు—చిట్టాగ : 1 సేరు.

75 అట్టెడు—అట్టాగ : $1\frac{1}{2}$ సేరు.

76 మిర్గు : మృగశిరా నక్షత్రం.

77 లేవు (ఉ. గరీబ్) : పరువు.

78 దున : కప్పుకునే దుప్పటి (దుశ్శాలువనుండి వచ్చి ఉండవచ్చు.)

79 రజాయి : కప్పుకునే పరువు. (బొంత లాంటిది)

80 పోత : గోనె పంచి.

81 పక్కపొన్న : ప్రక్కన.

82 మానల : మాదిరి.

83 పిస : పిచ్చి.

84 పిస—పిస : పిచ్చి పిచ్చి

85 బింగి—బింగి : పిచ్చి పిచ్చి.

86 టికిలీలు : పూర్ణీలు.

87 గోల్పాడి : గోచి లేకుండా కట్టుకునే చీర. (6 మీటర్ల పొడవుది.)

88 తేల (మ) చిన్నకొట్టు. పాన్‌షాప్ లాంటిది.

[ఈ తేల గురించి దాదాపు 1 సంవత్సరం క్రితం ఇక్కడ జరిగిన విచిత్రమైన వాస్తవికగాథ. ఆదిలాబాదలోని ఒక పిల్లవాడికి మహారాష్ట్ర పిల్లను ఇవ్వడానికి మాట్లాడుకున్నారు. ఆస్తిపాస్తుల విషయం వచ్చినప్పుడు పిల్లవాడి వాళ్ళు తమకు 5–6 తేలా లున్నా యని చెప్పారు. పెండ్లి జరిగిపోయింది. పిల్ల తరపువాళ్ళు 'మీ తేలాలు చూపండి' అని అడిగారు. పిల్లవాడి వాళ్ళు బజారుకు తీసుకువెళ్ళి వరుసగా ఉన్న తమ తేలాలు చూపారు. అప్పుడర్థమైంది పిల్ల తరపు వాళ్ళకు తాము మోసపోయామని. మహారాష్ట్రలో తేలా అంటే లారీ అని అర్థం. 5, 6 తేలాలంటే 5, 6 లారీలని వాళ్ళు భావించారు. ఇక్కడ తేలాలకు మంచి గిరాకీ ఉంది. ఒక్కొక్క తేలా తయారీకి సుమారుగా రూ .లు 2500/ అవుతాయి. ఒక్కొక్కటి నెలకు రూ.లు 100/– నుండి రూ. 200/–లు వరకు కిరాయ సంపాదిస్తుంది. చాలామంది తేలాలు కిరాయల కిస్తారు.]

89 మడ్గి : (ఉ) : కొట్టు : దుకాణం.

90 వర్కు (మ.) : కాగితం.

91 తుకిడి (మ) : 1 వ తరగతి.

92 రంజను : కూజా వంటి పెద్ద మట్టిపాత్ర. కాగు. (ఇక్కడి రంజనులు చాలా ప్రసిద్ధి. వేసవిలో నీరు నింపితే 'ఐస్ వాటర్' లా చల్లగా ఉంటాయి.)

93 బంబు — టాకి : (1) ఆయిలు పీపాలు.
(2) నీళ్ళు కాచుకునే బాయిలర్.

94 గాది : దుకాణపు గద్దెమీది పరుపు.

95 ఖోలి (మ) : గది.

96 బైఠక్ : (మ) ముందు గది — 'డ్రాయింగ్ రూం'.

97 మిరక్కాయ : మిరపకాయ.

98 ఖాసు : (ఉ. ఖాస్) : బాగు.

99 గంజు : పాత్ర.

100 ప్యాల : చిన్న గిన్నె.

101 మశాలు : దివిటీ.

102 సున్నితం : సున్నితపు త్రాసు.

103 ఇరపోత : ధాన్యం తూర్పార బట్టుట.

104 కొజాగిరి పున్నమ : ఆశ్వీజ పున్నమ.
(ఇదొక ముఖ్యమైన పండుగ)

105 దూర : హద్దు — ఎల్ల.

106 యాకం : ఎక్కువ.

107 బొన్ని (నిగి) : బోణి.

108 మంటి నూనె : కిరసనాయిలు.

109 చుకార (మ) : బాకీ చెల్లించుట.

110 ఇసార (మ) : అడ్వాన్సు — సంచకరి.

111 వోదస : సంపాదన.

112 ఊరగాయ : ఆవకాయ.

113 గంగెద్దు : గంగిరెద్దు.

114 అల్గారి (రు) : బాధ — ఫికరు.

115 మస్తు : ఎక్కువ.

ఇక్కడి మాండలికాలయొక్క సేకరణ విరివిగా సాగవలసి ఉంది. అకాడెమీవారి 'మాండలిక వృత్తి పదకోశం'లో వృత్తులకు చెందిన కొన్ని పదాలు మాత్రమే చోటుచేసుకున్నాయి. ఇదికాక ఈ రచయితల గమనికలో 1976 జూన్ 'స్రవంతి' సంచికలో శ్రీ బి. బాలస్వామి ఎం. ఏ. గారు 'ఏదులాబాద మాండలికము— ఒక పరిశీలన' అనే పేరుతో కొన్ని పదాలను పరిశీలించారు.

ఈ వ్యాసంలో పరిశీలింపబడ్డ పదాలు కేవలం జిల్లా కేంద్ర స్థానమైన ఆదిలాబాద నగరంలో సేకరించినవి మాత్రమే. అందు వల్లనే 'ఆదిలాబాద జిల్లా మాండలికములు' అనకుండా 'ఆదిలాబాద మాండలికము'అని ఈ వ్యాసాన్ని గుర్తించటం జరిగింది. ఆదిలాబాద, ఉట్నూరు, బోత్, భైంసా మొదలైన ప్రదేశాలలో చిత్రవిచిత్రాలైన ప్రయోగాలు, పదాలు లభిస్తాయి.

కేవలం మాండలికాలే కాకుండా ఇక్కడి పండుగలూ పబ్బాలు, జానపద గేయాలు, సంప్రదాయాలు పరిశీలించవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఆ పరిశీలనలో మరికొన్ని మాండలికాలు లభించవచ్చు. ఈ రచయితలు అందుకు పరిశ్రమిస్తున్నారు.

ఏది ఏమైనా ఒకటిమాత్రం నిజం! వెనుకబడిన ప్రాంతం అన్న అపవాదుండున్నా ఆదిలాబాద మండలం పరిశోధకులకు చక్కని కాణాచి. ఎంత లోతుకు దిగితే అంత విలువైన ముత్యాలు లభిస్తాయి.

[మ : మరాఠీ; హిం : హిందీ; తె : తెనుగు; ఉ : ఉర్దూ]



శ్రీ కలువకొలను సదానంద

# నగ్నరాత్రి

*(గతసంచిక తరువాయి)*

## 7

పిచ్చెక్కిన మదపుటేనుగులా గొలుసులు తెంపుకుంటోంది కన్నె వయసు !

తుంపర వానకు తుత్తరలాడే కరువునేలలా కోరికలు ఆవిర్లు గ్రక్కుతున్నాయి.

ఆశాప్రియ నిద్రపోలేదు.

తొడుగును నేలమీద పారేసి, ఆశలగొడుగుకు అతుకులు వేసుకుంటోంది.

ఊరకున్నదాన్ని ఉసికొల్పి, ఊహల ఊయలలెక్కించి, ఊగే త్రాళ్ళను ఒక్కసారిగా ఉత్తరించి, వెక్కిరించి వెళ్ళిపోయాడు చపలకుమార్.

పాలగిన్నెను పొయ్యిమీది కెక్కించి, పొయ్యిలో మంటవేసి, పొంగిపోతున్న పాలగిన్నెను దించుకోకుండా వెళ్ళిపోయాడు చపల కుమార్.

పొంగిన పాలంతా పొయ్యిపాలేనా ?

గుండె గిలిగింతలతో నిండిపోయింది. గిలిగింతలు పట్టని గుండెకు చిల్లిపడింది.

పులకింతలతో మేను పరవశించి పోయింది. పారవశ్యంతో పొంగులువారిన మేను ప్రిదిలిపోతున్నది.

ఆశలకు అలవాటు పడిన కళ్ళలో బూమలు గమ్ముతున్నాయి. బూచులు కమ్మిన కళ్ళు కొత్త ఆశలకోసం దోబూచులాడుతున్నాయి.

పాతదీపం దిబ్బలో పారెయ్ !

కొత్తదీపం వెలిగించుకో !

కళ్ళల్లో ప్రతిఫలిస్తూ కిటికీముందు నుంచి కదిలిపోయే కోటి ఆశలదీపాలు ! గుండె చీకటిలో గోరంత కాంతి నింపిపోయే పండుగ దీపాలు !

...ఎవరు నీవారో...తెలుసుకోలేవో...

పడుచుదనానికి పతాకలా...విలాసానికి కలికితురాయిలా... అల్లరికి ఆఖరి మెట్టులా...మరునితేజిలా...పూలరంగడు !

రోజుకోరకం బట్టలు! వేళ్ళనిండా ఉంగరాలు ! జేబునిండా కొత్తనోట్లు ! ఒంటినిండా సెంటు వాసనలు ! కంటినిండా కొంటె పిలుపులు ! పెదాలపైన వంకర నవ్వులు !

ముఖం మీాద వచ్చిపడిన పూలచెండులా తొలిపలుకు...... 'నిన్ను చూసినాక నిద్రలేదు. రాత్రికి వస్తావ్ ?...'

ఆమె గుండె గొంతుకలోకి వచ్చింది. బుగ్గలు మొగ్గలైనాయి. పెదాల మీాద నవ్వు బెదురు బెదురుగా తొంగిచూచింది.

'...రాత్రికి వస్తావ్?'

చచ్చినోడా ! ఎందుకూ ? వచ్చి నీ బులపాటం తీర్చటానికా ?

ఆమె ఒంట్లో నరాలన్నీ జివ్వుమన్నాయి.

వెళ్తే ఏం ?

అమ్మో...ఇంకేమన్నా వుందా?

ఏమవుతుందేమిటీ ?

వాడు...వాడు... నన్ను కొరుక్కుతినడూ?

నువ్వు మాత్రం వాణ్ణి కొరుక్కుతినవూ? వెళ్ళరాదూ?

ఉహుఁ ...అంతధైర్యం నాకుందా?

ధైర్యం చెయ్యాలి !

ఏమన్నా అయితే?

ఏమీా కాదులే !

పరువు?

పోతే పోయింది వెధవ పరువు ! ఆ పరువేమైనా నీకు కూడు పెట్టిందా, గుడ్డ పెట్టిందా? పరువూ పరువూ అని ఎందుకింకా ఆ పాత కోకను కట్టుకుని మూలగూర్చుంటావు? విప్పేసి వెళ్ళిపో !

ఛీఛీ...నావల్లకాదు...తప్పు చెయ్యలేను !

మనసులో చేస్తే, అది తప్పుకాదా?

మనసులో చేస్తే భయమేముంది? ఎవరికి తెలుస్తుంది ? మనస్సులోపలికి ఎవ్వరూ తొంగిచూడలేరు. అవి ఉక్కు తలుపులు. ఆ తలుపులకు గొళ్ళెంపెట్టి, లోపల నేనేమైనా చేసుకుంటాను. మనసు మారుమూలల్లో గుట్టుగా కట్టుకున్న వసంత మంటపంలో పరువు పాతకోకను విప్పి పక్కనబెట్టి పూలరంగడిముందు సిగ్గెగ్గులు విడిచి స్వేచ్ఛగా నిలబడతాను.

అంతే చాలు !

అంతకంటే యింకేమీ చెయ్యలేని సిరికి వాజమ్మను !

ఆమె ఆలోచనలన్నీ అమరజ్యోతులై, మనసులోపలి వసంత మంటపం నిండా వెలుగుల్ని నింపాయి.

ఆ ఆలోచనలకు అంతరాయం రాకుండావుంటే, ఆ కలల తోనే ఆమె కళ్ళు మూతలుపడి వుండేవి.

ఆశాప్రియ నిద్రపోలేదు.

కోరికల ముళ్ళు గుండెను చీరేస్తూవుంటే, కళ్ళు మూసుకుని పడుకుంది. కళ్ళు మూసుకుని, ఒళ్ళంతా కళ్ళు చేసుకుని, అంతా గమనించింది.

తన తల్లి మెటికలు విరుచుకోవటం, తన పక్కనుంచి లేవటం, దీపం ఆర్పి తారాడుతూవెళ్లి మొగుడిపక్కన పడుకోవటం ...అన్నీ చూచింది. వాళ్ళ గుసగుసలన్నీ ఆమె చెవుల్లో పడ్డాయి.

గుండె కుతకుత లాడిపోయింది. తల్లిదండ్రులమీద రోత పుట్టింది.

ఛీ ! వీళ్లేం మనుషులు ? ఇందరు పిల్లల్ని కని యింటి నిండా పారేసి, పెద్దపిల్లకు పెళ్ళిచెయ్యకుండా పొట్టన పెట్టుకుని, చెట్టంత కొడుకుని చెత్తకు వొదిలేసి, పెళ్ళీడుకొచ్చిన పిల్లను పక్కన పెట్టుకుని, ఈ యిరకాటంలో...ఇందరిలో...ఛీ ఛీ !

ఈ పాటికి తనకు పెళ్ళిచేసి ఇద్దరు మనవల్ని ఎత్తుకో వలసిన ఈ వయస్సులో...థూ !

ఆశాప్రియ గుండె బుసలు కొట్టింది.

ఆమె కళ్ళలో ఆశలన్నీ కరిగిపోయాయి.

వీళ్ళింతే ! పక్కలో పడుకోవటం తెలుసు వీళ్ళకు ! అవలీలగా పిల్లల్ని కనటం తెలుసు ! బొందిలో ప్రాణం వున్నంతవరకు యిలా పడుకుంటూనే వుంటారు, పిల్లల్ని కంటూనే వుంటారు. వీళ్ళకింకేమీ చేతకాదు. కడుపున పుట్టిన బిడ్డలకు కూడూ గుడ్డా యివ్వటం తెలియదు. వాళ్ళకు చదువులూ సాములూ చెప్పించటం తెలియదు. వాళ్ళ ముద్దూ ముచ్చటా చూడటం తెలియదు. ఈడొచ్చిన పిల్లలకు పెళ్లీ పేరంటాలు చెయ్యటం తెలియదు. బిడ్డలకోసం బండెడు నిట్టూర్పులు విడిచి, వాళ్ళ సుఖం వాళ్ళు వెతుక్కుంటారు. కూతుళ్ళు ఎలా పోతేనేం, కొడుకులెలా పోతేనేం? వాళ్ళ సుఖమే వాళ్ళకు గొప్ప !

ఆశాప్రియ కృంగిపోయింది.

వీళ్ళ స్వభావం యింతే ! వీళ్ళను నమ్ముకుంటే కుక్కతోక పట్టుకుని గోదావరి ఈదిన ట్టే. ఇంట్లో పెళ్ళి కావాల్సిన పిల్ల ఒకతి వుందే అని వీళ్ళేమైనా ఆలోచిస్తున్నారా? దానికొక మొగుణ్ణి తెచ్చి ముడెయ్యాలనే ధ్యాస వీళ్ళకుందా ? దాని మూగ గుండెలో ఎన్ని బెంగలున్నాయో పట్టించుకుంటున్నారా ?

కూతురు ముండకు మొగుడెందుకూ ? తన మొగుడు తనకుంటే చాలు ! కూతురికి మొగుడు లేకపోయినా కిమ్మనకుండా వుండిపోతుందది. కన్నెపిల్లకదా, కాలు జారితే దాని పరువూ పోతుంది, ఇంటిపరువూ పోతుంది. కనుక గుక్కపట్టుకుని గుట్టుగా పడుంటుంది. మొగుడూ, పెళ్ళామూ ఎందుకు వూరుకోవాలి ? అందుబాటులోవున్న సుఖాన్ని అరక్షణమైనా ఎందుకు వొదులుకోవాలి ?

అసలు వీళ్ళెప్పటికైనా పెళ్ళి అంటూ తనకొక కార్యమో, కర్మాంతరమో చెయ్యగలరా ?

చెయ్యలేరు ?

కట్నం లేకుండా పెళ్ళిచేసుకుంటానని ఏ నవయువకుడు ముందుకొస్తాడు ? కట్నం వొద్దని ఏ కుంటివాడో, కురూపివాడో వచ్చినా, పెళ్ళిచేసి పిల్లను పంపే స్తోమతయినా వుందా వీళ్ళకు !

తనకు పెళ్ళికాదు.

ఎప్పటికీ కాదు.

ఈ యింట్లో ఇలా పడివుండాల్సిందే...ఎంగిలి మెతుకులు తింటూ...కోరికల్ని బలవంతాన లాగి పైనేసుకుంటూ !

ఈ జీవితం యిలా వ్యర్థమైపోవాల్సిందేనా ? బ్రతుకులో ఏముందని ఈ బ్రతుకు బ్రతకటం ? సుఖంలేని బ్రతుకు బ్రతకటంకంటే చచ్చిపోవటం నయంకదా ?

'ఔను ! చచ్చిపోవటమే మేలు !' అనుకుంది ఆశాప్రియ.

చచ్చిపోతావా ?

తప్పకుండా !

ఎప్పుడు ?

ఇవాళో, రేపో...

ఇంత తొందరగా చస్తావెందుకే, పిచ్చిపుల్లమ్మా ! మరి కొన్నాళ్ళుండి, చావు !

ఏం సుఖం వుందని మరికొన్నాళ్ళు బతకటం ?

సుఖం లేకేం

ఎక్కడుంది ?

అక్కడే !

ఎక్కడ ?

పూలరంగడి దగ్గర !

తప్పు కదూ ?

సుఖాన్ని పట్టుకుని తప్పంటావేం ? ఎవరి సుఖం వాళ్ళు వెతుక్కుంటున్నారు. నీ సుఖం నువ్వు వెతుక్కుంటే తప్పా ?

అయితే చచ్చిపోవద్దంటావా ?

చచ్చిపోవటంకంటే సుఖాన్ని వెతుక్కోవటం మేలు. ఎప్పటికైనా చావు నిన్ను విడిచిపెట్టదు. నువ్వు సుఖాన్ని విడిచిపెడతావా? లే ! వెళ్ళు !

ఊఁ... ఇప్పుడేనా ?

ఇప్పుడే !... గడిచిపోయిన రాత్రి తిరిగిరాదు. ప్రాణం వొదులుకోకు ! ప్రాణం వున్నంతవరకు రాత్రిని వొదులుకోకు !

గుండెమీద చెయ్యి వేసుకుంది ఆశాప్రియ.

గుండెదగ్గరచేరి గుసగుసలాడుతున్నాడు పూలరంగడు.

'రాత్రికి వస్తావ్ ?'

ఆమె గుండె బెదిరింది.

'రాత్రికి వస్తావ్ ?'

ఆమె గుండె గొంతు సవరించుకుంది.

'రాత్రికి వస్తావ్?'

ఆమె గుండె కేకవేసింది. 'వస్తాను...వస్తాను...వస్తాను!'

ఆశాప్రియ పక్కకుపొర్లి, కళ్ళుతెరిచి చూచింది. పక్కనే పడుకుని వుంది తల్లి — యథాప్రకారంగా. పిల్లలంతా సన్నగా గురకపెట్టి నిద్రపోతున్నారు. పెద్దవాళ్ళు నిద్రపోతున్నారో, మేలుకునే వున్నారో?

ఆమె గుండె గుబగుబలాడింది.

ఇప్పుడు తానేం చేయాలి? పైకి లేవాలి ... చప్పుడు కాకుండా తలుపు తెరిచి వీధిలోకి వెళ్ళాలి....మూడిళ్ళకవతల వున్న ఆ మేడ దగ్గరికి వెళ్ళాలి...పూలరంగడు కొండంత ఆశతో కళ్ళు కాయలు చేసుకుని ఎదురు చూస్తుంటాడేమో? తానువెళ్ళి తలుపు మీద...టక్...టక్...ఎవరదీ?...టక్‌టక్...ఎవరంటుంటే ?... సమాధానంగా చేతిగాజులు గలగల...పూలరంగడు తలుపు తెరిచి ఆశ్చర్యంతో కొయ్యబారిపోడూ ? ...నువ్వా ! ...వొచ్చావా ! ... అంటూ ఆనందంతో ఉక్కిరిబిక్కిరైపోయి...అమాంతంగా...

ఆమె కళ్ళు మెరిశాయి. హృదయం ఉప్పొంగింది.

స్వర్గంలో తాను తేలిపోయి, అతణ్ణి తేల్చి మత్తుగా తిరిగొచ్చేస్తుంటే 'రేపు మళ్ళీ...' అంటూ బతిమాలుకుంటాడు కదూ పూలరంగడు ? ...రేపుమళ్ళీ...రేపుమళ్ళీ...రేపుమళ్ళీ... అలా ఒక వారం...ఒకనెల...మరోనెల...మూడోనెల...

బాగా డబ్బున్న వాడు పూలరంగడు. కోరినవన్నీ కొనుక్కోమని, కోరకనే డబ్బులిస్తాడేమో! ఇవ్వనీ ! ఇద్దరూ కలిసి ఆనందం పంచుకుంటున్నపుడు, ఇద్దరూ డబ్బు పంచుకుంటే తప్పా ? ...వాణ్ణి తాను, తనను వాడూ దోచేసుకుంటూ అన్ని రాత్రులూ హాయిగా...తీయగా...

హాయిగా...తీయగా...తనకు నెల తప్పితే?...

పూలరంగడు తనను పెళ్ళి చేసుకుంటాడా?

వాడితల్లి ముండమొయ్య; చేసుకోడు.

చేసుకోకపోతే మాత్రం నష్టమేమిటి ?

చస్తే పోయింది, కుమారిలాగా.

పుత్తు చెవికంటే తాటాకు చెవి మేలుకదా !

పెళ్ళీ పెడాకులూ లేకుండా చిరంజీవిగా బ్రతకటం కంటే, పూలరంగడితో ముచ్చటగా మూన్నాళ్ళు గడిపి, గుట్టు రట్టు కాకుండా చచ్చిపోవటం మేలు !


ఆంధ్ర సచిత్ర వార పత్రిక

— చందా వివరాలు —

విడి ప్రతి వెల ... 0-75 పైసలు

| | మ్యాన్ ఏజంటుద్వారా | | పోస్టుద్వారా | |
|---|---|---|---|---|
| | రు. | పై. | రు. | పై. |
| సంవత్సర చందా | 39—00 | | 41—60 | |
| అర్ధ సంవత్సరం | 19—50 | | 20—80 | |
| మూడు మాసములకు | 9—75 | | 10—40 | |

మేనేజరు
ఆంధ్రపత్రిక

చావు అందరికీ వస్తుంది.

సుఖం అందరికీ రాదు.

చేతికందిన సుఖాన్ని జీర్ణించుకున్న తర్వాత, చావంటే భయమెందుకు?...ధైర్యంగా చచ్చిపోవచ్చు !

ఆశాప్రియ మెల్లగా పైకి లేచింది. ఊపిరిబిగబట్టి తల్లి వైపు చూసింది. వంటింటి వైపు నడుస్తూ తండ్రి వైపు చూసింది. గ్లాసెడు నీళ్ళు ముంచుకొని గుటగుటా తాగింది. తిరిగివస్తూ మళ్ళీ చూసింది వాళ్ళిద్దరివైపు. చప్పుడు కాకుండా వచ్చి పడుకొంది.

వీళ్ళు నిజంగానే నిద్రపోతున్నారా ?

ఈ లోపల మేలుకోరుగదా?

ఆమె కాళ్ళలో వణుకు ప్రారంభమైంది.

గుండె వేగంగా కొట్టుకోసాగింది.

## 8

మూడిళ్ళ కవతల వున్న ఆ మేడలోని పూలరంగడి పేరు రహీం. అకిలాలీ పెద్దకొడుకు. అకిలాలీ పెద్ద పెళ్ళాం కొడుకు. మొన్నటి ఎలక్షన్లలోనే మొదటిసారిగా వోటువేసిన క్రొడెకారు కుర్రవాడు.

రహీం యింటినుండి వేరుపడిపోయి రెండు నెలలవుతోంది. ఈ రెండు నెలలుగా అతడు ఆ మేడలోనే వుంటున్నాడు. భోజనం హోటళ్ళలో చేస్తున్నాడు. అకిలాలీ యిటీవల కొన్నదే ఆ మేడ!

అతన్ని యింట్లోంచి అతని తండ్రే స్వయంగా వెళ్ళగొట్టాడు. ఇంట్లోకి రావద్దన్నాడు. నీ బట్టలూ, నీ పరుపూ తీసుకుని ఆ ఖాళీగావున్న మేడలోకి వెళ్ళిపో — అన్నాడు. తొందర్లోనే పెళ్ళిచేసి నీకోదారి చూపించేస్తాను, అంతవరకూ నెలకో రెండువందలు నేనే పంపిస్తాను, ఇక ఈ గుమ్మం తొక్కకు, మళ్ళీ నాముఖం చూడకు—అన్నాడు.

దీనికంతా కారణం నాంచారు.

ఆర్నెల్ల కిందట అకిలాలీ ఐదోపెళ్ళి చేసుకున్నాడు.ఎందుకు చేసుకున్నాడు? ఉన్న పెళ్ళాలు చాల్లేదనా ? కాదు. అప్పు ఆ విధంగా రాబట్టుకోవాల్సి వచ్చింది. ఏది ఎలా జరగాలో అలాగే జరగాలి ! అందుకు భిన్నంగా మాత్రం జరగకూడదు !

ఆవగింజంత ఆస్తి కూడాలేని తాగుబోతువాడొకడు అకిలాలీ దగ్గర అప్పుచేసి తీర్చలేకపోయాడు. అతడు పుచ్చుకున్నది రెండు వందలు. సంవత్సరం కాగానే వడ్డీ మూడువందలు కలుపుకుని మొత్తం ఐదు వందలయింది. మరో సంవత్సరానికల్లా వడ్డీ మరో ఏడువందలై అప్పు వెయ్యి దాటింది.

అకిలాలీ తాగుబోతువాడి పాకమీదికి వెళ్ళి 'ఒరే నా అప్పిస్తావా, చెప్పుతో కొట్టమన్నావా ?' అంటూ పిడుగులు దొర్లించాడు.

'అట్లాగే కొట్టేసిపోసామీ !' అంటూ కాళ్ళుపట్టుకుని కన్నీళ్ళు పెట్టుకున్నాడు తాగుబోతువాడు.

'అయ్...నిన్ను కొట్టేసి వొదిలేస్తాననుకున్నావా? ఆ పప్పులేం వుడకవ్...' అంటూ గుమ్మంవైపు చూశాడు అకిలాలీ.

పదహారేండ్ల పచ్చి పసుపుకొమ్ము గుమ్మంలో నుంచుని వుంది. అప్పు తీర్చలేని వాడి గుమ్మంలో అపరంజి బొమ్మ !

'ఎవర్రా ఆ పిల్ల ?' అన్నాడు అకిలాలీ ఓరచూపులు చూస్తూ.

'నా కూతురే సామీ !'

'పెళ్ళయిందా ?'

'ఇంకా లేదు'

'పెద్దమనిషయిందా ?'

'సంవచ్చరం ముందే అయింది.'

అకిలాలీ కాసేపు ఆలోచించాడు. 'సరే, నాతోరా!' అన్నాడు. తాగుబోతువాణ్ణి తనయింటికి తీసుకువెళ్ళాడు.

ఒరే ! నా డబ్బివ్వకపోతే చచ్చినా నిన్నొదిలిపెట్టను. 'వడ్డీతోసహా నా బాకీ చెల్లిస్తావా, లేకపోతే మరో ఐదువందలు తీసుకుని నీ కూతుర్నిస్తావా ?...ఏదో ఒకటి తేల్చేయ్ !'

తేల్చక ఏంచేస్తాడు, ఆ తాగుబోతువాడు ? అకిలాలీకి తన కూతుర్నిచ్చి అప్పు తీర్చేశాడు.

అకిలాలీ యింట్లో అడుగుపెట్టిన ఆ కొత్త పెళ్ళికూతురే నాంచారు !

ఒకే యింట్లో వుంటూ, ఒకర్నొకరు చూసుకుంటూ వూరుకోలేక పోయారు నాంచారు, రహీం! వాళ్ళు ముందూ వెనుకా చూడలేదు. మంచీ చెడ్డా ఆలోచించలేదు. నిద్రకాచి యిద్దరూ కలుసుకునేవారు. మనసులు, తనువులు పెనవేసుకున్నారు.

ఇలా నాలుగు నెలలు జరిగాక, రహస్యం బట్టబయలయింది. అర్థరాత్రివేళ తన పక్కలోంచి లేచి వెళ్ళి పెరట్లో బాదంచెట్టు కింద — కట్టెలమోపుల చాటున — రహీం కౌగిట్లో కరిగిపోతున్న నాంచారును కళ్ళారా చూశాడు అకిలాలీ.

అవమానంతో కుతకుత లాడి పోయాడతను.

చిలకలాంటి చిన్న పెళ్ళాం మనసును తాను దోచుకోలేకపోయానని తెలుసుకుని సిగ్గుతో చిమిడిపోయాడు.

అతడి అవమానమూ, సిగ్గూ కొడుకుమీద కోపంగా మారాయి. కొడుకును యింట్లోంని గెంటేశాడు.

పదహారేళ్ళ పడుచుపెళ్ళాన్ని మురిపించటానికీ, ఆమె దృష్టిలో తనకంటే మొనగాడు మరొకడు లేడనిపించుకోటానికి — లేహ్యాలూ చూర్ణాలూ కొనితెచ్చుకున్నాడు.

గట్టునపడ్డ చేపలా గిలగిలలాడిపోయాడు రహీం.

నాంచారు లేని బ్రతుకు ఉప్పులేని చారులా వుందతనికి. రంభలాంటి చిన్నదాని చెంగుపట్టుకుని నాలుగు నెలలపాటు స్వర్గలోకాన్ని పరిపాలించిన రహీంకు ఈ ఒంటరితనం నరకంలా వుంది.

ఇక తాను నాంచారును చూడటానికి వీల్లేదు.

ఆమెతో మాట్లాడటానికి వీల్లేదు.

రాకుమారిని ఒంటిస్తంభం మేడలో దాచి పహరాకాచే రాక్షసుడి కంట్లో కారం కొట్టడం సాధ్యం కాదు.

ఇంట్లో తండ్రిలేని సమయం కనిపెట్టి మొన్న వెళ్ళాడు రహీం. 'మేము ఏం పాపం చేశాము? ఎందుకు మాకీ శిక్ష ? ... నాంచారు లేకుండా నిమిషమైనా బతకలేకపోతున్నాను...నీకడుపులో పుట్టిన పాపానికి ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటాను' అని కన్నతల్లితో చెప్పుకుని కన్నీరు పెట్టుకున్నాడు. ఆమె అతన్ని సముదాయించింది. చిన్న సవతిని చెంతకు పిలిచి, తాను చాటు కెళ్ళింది.

నాంచారూ, రహీం ఒకర్నొకరు చూస్తూ నుంచున్నారు. కన్నీళ్ళు పెట్టుకున్నారు. ఈ ఎడబాటు సహించలేకున్నామని ఒకరితోఒకరు చెప్పుకున్నారు. ఒకరి కన్నీళ్ళొకరు తుడుచుకున్నారు.

అంతలో రానే వచ్చాడు అకిలాలీ !

వేదనల్ని వలపోసుకుంటున్న పెద్దకొడుకును, చిన్నపెళ్ళాన్నీ చూసి కోపంతో గజగజలాడిపోయాడు.

'తప్పుడు కొడకా ! మళ్ళీ ఎందుకొచ్చావ్ నాయింటికి ?' అన్నాడు.

'ఎందుకో తెలియదా ?'

'మాదర్చోద్...నాపెళ్ళాంతో నీకేంపని ?'

'నీ పెళ్ళామా ? ...నాపెళ్ళామది ! ...కావాలంటే దాన్నే అడుగు !'

'పోతావా పోవా ?' అంటూ అకిలాలీ బెల్టు విప్పుకున్నాడు.

'నా పెళ్ళాన్ని నాతో పంపేయ్. పోతాను.'

బెల్టుతో ఛెళ్ళుమని ఒకదెబ్బ వేశాడు అకిలాలీ.

బెల్టు లాక్కుని వీధిలోకి పరిగెత్తాడు రహీం.

ఆ బెల్టు యిప్పుడు గోడనిూది చిలక్కొయ్యకు వేలాడుతోంది.

ఈసారి వెళ్ళినప్పుడు 'ఎందుకొచ్చావ్ నాయింటికి?' అని అకిలాలీ మళ్ళీ అంటే ఈ బెల్టుతోనే ఆత్మరక్షణ చేసుకోవాలి... అనుకున్నాడు రహీం.

ఆలోచనలు అతన్ని నిద్రపోనివ్వటంలేదు.

పరుపుమీద వెల్లకిలా పడుకుని సిగరెట్టుమీద సిగరెట్టు కాల్చుతూ, రింగులు వొదులుతున్నాడు.

ఆ రింగుల్లో నాంచారు నవ్వుల్నీ, కిటికీ చాటున వెలిగిపోయే ఆశాప్రియ కళ్ళనీ వెతుక్కుంటున్నాడు.

ఇంతలో తలుపుమీద చిన్నగా చప్పుడయింది.

'టక్...టక్!'

రహీం లేచి కూర్చున్నాడు. 'ఎవరదీ?'

'టక్...టక్!'

'ఎవరంటుంటే?'

సన్నగా చేతిగాజుల గలగల !

రహీం కళ్ళు మెరిశాయి.

ఎవరు?

ఎవరై వుంటారు?

రోజూ ఆ కిటికీ దగ్గర కూర్చునే పిల్లేనా?

ఆ పిల్లేనా?

అంత సులభంగా వచ్చేసిందా ఆ పిల్ల!

లేచి వెళ్ళి తలుపు తీశాడు రహీం. గుమ్మంలో కనిపించిన మనిషినిచూసి సంభ్రమాశ్చర్యాలతో కొయ్యబారిపోయాడు. ఆశ్చర్యం నుంచి తేరుకుని ఆమె చెయ్యి పట్టుకుని లోపలికి లాక్కున్నాడు. దడాలున తలుపు మూసి గొళ్ళెం పెట్టాడు. ఆమెను అమాంతంగా కౌగిలించుకుని, చెట్టుమీదికి ప్రాకిన తీగలా పెనవేసుకుపోయాడు.

వచ్చిందెవరు ?

పదహారేళ్ళ పచ్చి పసుపు కొమ్ము !

నాంచారు !

నాంచారు వచ్చింది !

రహీం కోసం స్వయంగా నడిచి వచ్చింది.

మళ్ళీ రెణ్ణెల్ల తర్వాత —

చీకటిక్కూడా నిద్ర నుంచుకొస్తూన్న ఈ మూడో జామున —

కోరికల పొగరణచటానికి,

కొరడాలాగా వచ్చింది!

'నాంచారూ !'

'రహీం !'

'నాంచారూ !'

'రహీం !'

'అబ్బా..'

'హాయ్...'

భూమి, ఆకాశం క్రింద మీదులైనాయి. గాలీ, వానా పడుగూ పేకలైనాయి. గోళాలన్నీ కళ పెళ కాగిపోయాయి. సముద్రాలు పోటెత్తి చెలియలి కట్టల్ని ముంచెత్తాయి.

'నాంచార్లూ! ఎలా వచ్చావు, ఆ కాపలా కుక్క కళ్ళబడకుండా?'

'ఇంట్లో లేదు. ఎక్కడో తగలబడ్డాడు.'

'నువ్వు పక్కన లేకుంటే బతకలేడే, ఎలా వొదిలిపోయాడు నిన్ను?'

'నేనే వొదిలించుకున్నాను, బయట జేరానని బొంకులు జెప్పి.'

'గుండె ధైర్యం వున్నదానివే! ... ఇంట్లో అందరున్నారు కదా, ఎలా రాగలిగావు?'

నాంచారు నవ్వింది.

'మీ అమ్మే పంపింది...'

ఆ యింటి నిండా వెన్నెలలు విరిశాయి. కోయిలలుపాడాయి. కలువలు పూశాయి. రతీమన్మధులు ప్రణయపారవశ్యంతో శృంగార తాండవం ఆరంభించారు.

రతీమన్మధులు అలసి సొలసి విశ్రాంతికోసం ఒరిగిపోయిన తర్వాత చీరంచులో చెదిరిపోయిన సరిగపోగును సవరించుకుంటూ కూర్చుంది నాంచారు.

ఆమె పైకి లేవలేదు. వెళ్తాననలేదు. వెళ్ళు అని రహీం అనలేదు.

'వెళ్ళిపోవాలా?' అన్నాడు.

'మళ్ళీ వొచ్చేయ్‌మంది మీ అమ్మ' అంది నాంచారు.

'వొద్దు నాంచారూ!'

ఇంకేం చేద్దామన్నట్లు చూచిందామె.

'ఈ చీకట్లోనే ఈ వూరొదిలి ఎక్కడికైనా వెళ్ళిపోదాం...'

'అందుకేగా ఇన్ని నగలూ వేసుకొచ్చాను!' అంటూ నవ్విందామె, తెలివి వుట్టిపడేలా.

రహీం చివాలున పైకి లేచాడు. బట్టలన్నీ సూట్‌కేసులో కుక్కాడు. పర్సులోవున్న డబ్బు లెక్కపెట్టి, పర్సు జేబులో వుంచుకున్నాడు.

ఇంటికి తాళంవేసి యిద్దరూ బయటపడ్డారు.

వీధిలోంచి సాగిపోతూ ఒక్కక్షణం ఆగి, మళ్ళీ ముందుకు కదిలాడు రహీం.

అప్పుడే యింట్లోనుంచి బయటకువచ్చి, తలుపు జాగ్రత్తగా దగ్గరకువేసి, పూలరంగడి మేడవైపు నాలుగడుగులువేసి, ఎదురుపడిన ఆ యిద్దర్నీ చూసి స్థాణువులా నిలబడిపోయింది ఆశాప్రియ.

రహీం ముందుకు వెళ్ళాడు. అతడివెంట నడుస్తున్న చిన్నది తిరిగిచూస్తూ వెళ్ళింది. ఇద్దరూ మలుపు తిరిగి కనుమరుగైపోయారు.

ఆశాప్రియ ఆశలన్నీ గాలిలో దీపాల్లా రెపరెపలాడి ఒక్కసారిగా గుప్పున ఆరిపోయాయి.

ఆమె యింటివైపు చూచింది.

ఇల్లొక వల్లకాడు!

మేడవైపు చూచింది.

మేడొక ఎండమావి!

వీధినిండా చూపులు బరపింది.

వీధి ఒక చీకటిదారి!

కారుచీకటి కనిన గారాబు కూతురులా చీకటిలో నిలబడిపోయింది ఆశాప్రియ.

అయ్యో! పూలరంగడు వెళ్ళిపోయాడా? పూలరంగడుకూడా వెళ్ళిపోయాడా? మచ్చికైన మచ్చల లేడిలా వస్తున్న మచ్చికంటికోసం ఆగలేనివాడు ఎందుకు రమ్మనాలి? ఎండిపోయిన ఆశలకు ఎందుకు నీళ్ళు పోయాలి?

ఛీ! సిగ్గుమాలిన బ్రతుకు తనది! ఇంత తెగించి వచ్చినా, ఇసుమంత సుఖంకూడా చీదరించుకుని వెళ్ళిపోయిందే!

పూలరంగడు యిక తిరిగిరాడా? దీపం వెంట వెలుగులా, పాటవెంట పల్లవిలా—అతడి నీడలో నీడగా నడిచిపోయిన ఆ చిన్నదెవరో?...అదృష్టవంతురాలు!

ఆశాప్రియ నిట్టూర్చింది. తన ఆశల కొన ప్రాణాల్ని ఆ నిట్టూర్పులోనే వొదిలేసింది.

బ్రతుకులో తనకు మిగిలేవి కలలే!

ఉత్తుత్తి కలలు!

కల్లబొల్లి కలలు!

...ఆ చిన్నదాని అదృష్టం తనదై వుండరాదూ? ఏ వూళ్ళోనో తలదాచుకుని—ఒకరి కొకరు తోడునీడగా—ఒకరికొకరు ప్రాణంగా—కమ్మగా కాపురం చేసుకుంటూ — బ్రతుకును సాగుచేసి బంగారు కలలు పండించుకుంటూ—ఒకరి గుండెల్లో ఒకరు ఒళ్ళు మరచి నిద్రపోతూ—పసిడి మూటల్లాంటి పిల్లల్ని కని పాలబుగ్గలు ముద్దెట్టుకుంటూ—సుఖంగా—సంతోషంగా...

ఊహలే బరువైనాయి ఆశాప్రియకు.

అడుగులో అడుగువేస్తూ యింటివైపు నడిచింది.

తన కోరికలకు కీళ్ళూడగొట్టి, కళ్ళుపొడిచేసి, నాలిక తెగ్గోసి, చీకటికొట్లో పారేసి, చాపమీద బోరగిల పడుకుని నిశ్శబ్దంగా ఏడ్చింది.

*(ఇంకా ఉంది)*

# వైకృత చంద్రిక

ఇది సంస్కృత భాషలో వ్రాయబడిన తెలుగు వ్యాకరణ గ్రంథము ఆంధ్రప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము పరిశోధన సంస్థవారు ప్రకటించినది.[1]

ప్రధాన సంపాదకులు –

కళాప్రపూర్ణ వడ్లమూడి గోపాలకృష్ణయ్య.

సంపాదకులు–తెలుగు వ్యాఖ్యాకర్తలు :

1. యన్. సి. యన్. వెంకటాచార్యులు (విశారద)
2. డాక్టరు అమరేశం రాజేశ్వరశర్మ, ఎమ్.ఏ., పి.హెచ్.డి. (భాషా ప్రవీణ)

ఇందు 1) సంజ్ఞ 2) సంధి 3) స్వాది అజంత 4) స్వాది హలంత 5) అవ్యయ 6) స్త్రీ ప్రత్యయ 7) విభక్త్యర్థ 8) సమాస 9) తద్ధితాదేశ 10) తద్భవ సంస్కృత భవ 11) ప్రాకృత భవ 12) శౌరసేనీ భవ 13) మాగధీభవ 14) పైశాచీభవ 15) చూళికాపైశాచీభవ 16) అపభ్రంశభవ 17) వైకృత విశేష 18) తిజన్త 19) కృదంత–ప్రకరణములు అను 19 ప్రకరణములు గలవు. ఇందలి సూత్రములు 825.

ఈ గ్రంథమునకు ముందు 'ఆముఖం' 14 పుటలలో అమరేశం రాజేశ్వరశర్మగారిది గలదు. ఆ వెనుక 39 పుటలలో ప్రధాన సంపాదకులు గోపాలకృష్ణయ్యగారి "స్వరూప–స్వభావ మహాగవేషణ" గలదు మూల గ్రంథమున 207 పుటలు గలవు.

ఇక గ్రంథమున గ్రాంథిక భాషయు, ఆముఖగవేషణలలో వ్యావహారిక భాషయు వాడబడినది.

## ఇది గ్రంథ స్వరూపము - గ్రంథ ప్రచురణ ప్రయోజనము

ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమువారు ప్రచురించు గ్రంథములన్నియు గ్రంథకర్త విషయమున, అతని కాల విషయమున, గ్రంథస్థ విషయమున నిర్వివాదములై యుండవలెను. గాని ప్రస్తుత గ్రంథము మాత్రమట్టిదిగాదు. 1) గ్రంథకర్త 2) గ్రంథకర్త కాలము రెండును సందిగ్ధములుగానే యుండిపోయినవి. ప్రధాన సంపాదకుల మహాగవేషణలో నైతము పై రెండును నిశ్చితములుకాక నిలిచిపోయినవి. చూడుడు.

### (i) గ్రంథకర్త మంచెళ్ల - వాసుదేవకవి

వైకృత చంద్రికకర్త మంచెళ్ల వాసుదేవకవియని "మంచెళ్ల వంశాంబుధి పూర్ణచంద్రేణ వాసుదేవకవి నా విరచితాయాం వైకృత చంద్రికాయాం సమాప్తం" అని గ్రంథాంత మందుండుట చేత–నీకృతి మంచెళ్ల వాసుదేవకవిది యనుట నిస్సందేహము. కాని మహాగవేషణలో నీతని గూర్చి యిట్లు సందిగ్ధముగా గలదు:

1) గంధవహము అను నలంకార శాస్త్రము తెలుగున రచించిన కవి మంచెళ్ల వాసుదేవకవి యొకడు గండు. కాని అతడు వైకృత చంద్రికా కర్త కాడు.

2) "వాసుదేవకవి ఒక్కడేనా" అను శీర్షికలో, (పుట 77) తంజావూరి మహారాష్ట్రరాజు శరభోజీ కాలము (1684–1712) లో నున్న వాసుదేవకవి వైకృత చంద్రికాకర్త కాడు.

అట్లయిన–వైకృతచంద్రికా గ్రంథకర్త ఎవరు? గవేషణలో నిదమిత్థమని తేల్చకుండగనే యున్నది. ఇది సరియైన పద్ధతి కాదు.

### (ii) వాసుదేవకవి కాలము

మొదటి వాసుదేవకవి గంధవహకర్త క్రీ. శ. 1750 ప్రాంతము వాడగుటచేత–వైకృత చంద్రికాకర్త నూతడు కాడు. రెండవ వాసుదేవకవి యున్న శహాజీ.

తంజావూరి మహారాష్ట్ర రాజగు శహాజీ క్రీ.శ. 1684–1712 ప్రాంతమున పాలించిన శహాజీ కాడు. ఈ సందర్భమున ప్రధాన సంపాదకుల వాక్యము లివి: " తంజావూరి రాజధానిగా పాలించిన మహారాష్ట్ర వంశీకులలో శహాజీలు యిద్దరున్నారు. మాలోజీ పుత్రుడైన శహాజీ క్రీ. శ. 1640 ప్రాంతంలోను, ఈ శహాజీ మనుమడైన శహాజీ క్రీ. శ. 1684 ప్రాంతంలోనూ తంజావూరిని పాలించారు". (పుట LXXIX)

## తంజావూరి మహారాష్ట్రరాజులు - ఇద్దరు శహాజీలు -

తంజావూరిని పాలించిన మహారాష్ట్ర రాజులలో యిద్దరు శహాజీలున్నారనునది నిరాధారము, నిష్ప్రమాణము. అసలు తంజావూరి నాయక, మహారాష్ట్ర రాజుల చరిత్ర కత్యంతము విరుద్ధము. క్రీ. శ. 1640 లో మాలోజీ పుత్రుడు శహాజీ తంజావూరిని పాలించుచుండెను అనిగదా పై వాక్యము. కాని క్రీ. శ. 1640 లో తంజావూరిని పాలించుచున్నవాడు నాయక రాజగు విజయరాఘవుడు గాని, మహారాష్ట్ర రాజు శహాజీ కాడని, 'దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయ చరిత్ర' అను గ్రంథము తెలుపుచున్నది.[2] అందు 25 వ పుటలో–తంజావూరు నాయక రాజుల వంశ వృక్షమున–

విజయరాఘవ నాయకుడు (1633 - 1673) అని లేదు. ఇందువలన క్రీ. శ. 1640 లో మహారాష్ట్ర రాజు తంజావూరిలో పాలించుటలేదని నిశ్చితము.

అసలు తంజావూరు క్రీ. శ. 1673 తరువాతగాని మహారాష్ట్రుల వశము కాలేదని యీ క్రింది గ్రంథములు నిర్వివాదముగా చాటుచున్నవి.

1) **The Marata Rajas of Tanjore1929.**

2) **Marata rule in Carnatic 1941.**

3) **The Nayaks of Tanjore 1953.**

పై మూడు గ్రంథములు నాంగ్ల భాషలో నుండుటచేత ప్రధాన సంపాదకులకు పరిచితము కాకపోవచ్చునుగాని, తెలుగు సాహిత్య పరిశోధకుల కందఱకు సుపరిచితములే. ఆంగ్ల గ్రంథముల మాట యట్లుండనిండు. గ్రంథమంతయు తెలుగుభాషలోనే యున్న దక్షిణదేశీయాంధ్ర వాఙ్మయమునుగూడ వీరెఱుగరని పై వాక్యములు ఋజువుచేయుచున్నవి.

క్రీ. శ. 1640 లో శహాజీ తంజావూరును పాలించుట గగనకుసుమమైనపుడు—''శృంగార పదములు'' అన్న గ్రంథమునకు నీ ప్రధాన సంపాదకులు వ్రాసిన మహారాష్ట్ర రాజులనుగూర్చి వ్రాసిన పుటలన్నియు వ్యర్థమైనవని నిరాఘాటముగా చాటవచ్చును.

క్రీ. శ. 1640 లో శహాజీ లేడన్నప్పుడు — తంజావూరి పాలకుడు శహాజీ 1684-1712 లో పాలించిన శహాజీ యొక్కడే అని నిశ్చయమైనపుడు వాసుదేవ కవి ఆ కాలమువాడే యగును.

పై శహాజీద్వయ ప్రతిపాదనమువలన గ్రంథకర్త కాలము నిర్ధారణ కాలేదని సారాంశము.

## గ్రంథ ప్రయోజనము

ఆంధ్ర వైయాకరణ సంప్రదాయమునుబట్టి చూచిన — వైకృత చంద్రిక ప్రమరణ ప్రయోజన శూన్యమని నిర్ణయింపవచ్చును. ఇందలి యంశములు — ఆంధ్ర వైయాకరణ సంప్రదాయమునకు పూర్తిగా విరుద్ధములు వాని వివరణ —

## గ్రంథ విశిష్టత

ఈ గ్రంథ విశిష్టతనుగూర్చి ప్రధాన సంపాదకులిట్లు వ్రాసినారు :

''ఏదియైనా ఆంధ్ర వ్యాకరణ చరిత్రలోనే కాదు ఆంధ్ర వాఙ్మయ చరిత్రలోనే, భాషా చరిత్రలోనే అపూర్వమైన ఒకానొక విశిష్టమై అసాధారణమైన ప్రత్యేక స్థానాన్ని యీ వైకృత చంద్రిక పెందగలదనడంలో సందేహము లేదు''. (పుట 84)

తెలుగు భాషకు, సంస్కృత భాషలో వ్రాయబడిన వ్యాకరణములే ప్రాచీనములని, ప్రామాణికములని యభిప్రాయయ గలవారగుటచే ప్రధాన సంపాదకులు సంస్కృత భాషలోనున్న వైకృత చంద్రిక విశిష్టతనుగూర్చి పై రీతిగా వ్రాసియున్నారు. కాని తెలుగు భాషకు సంస్కృత భాషలోనే కాక, తెలుగుభాషలోనే వ్రాయబడిన వ్యాకరణములున్నవన్న సంగతి వారి కెఱుకలేనట్లున్నది. తెలివిడికై వాని నుదాహరించుచున్నాను —

1) ఆంధ్రభాషా భూషణము — కేతన (క్రీ. శ. 1250)

2) కావ్యాలంకార చూడామణి—విన్నకోట పెద్దన (క్రీ.శ.1400)

3) ఛందోదర్పణము — అనంతుడు (క్రీ. శ. 1435)

4) కవి చింతామణి — తాతం భట్టు (అముద్రితము) (క్రీ. శ. 1500)

5) ఆంధ్ర కౌముది—గణపవరపు వేంకట కవి (క్రీ.శ. 1650) (వేయి చరణముల సీసమాలికాకృతి)

పై తెలుగు వ్యాకరణములన్నియు కాలనిర్ణయము విషయమైన వివాదములు లేక నిశ్చితములైనవి. పూర్వలాక్షిణికులచేతను, పూర్వ వ్యాఖ్యాతలచేతను నుదాహృతములై, ప్రామాణికములై యున్నవి.

వైయాకరణ సార్వభౌములని వాసిగన్న వజ్ఝలవారు పై తెలుగు వ్యాకరణము ప్రామాణి కత్వము నంగీకరించిరి.

తెలుగునకు సంస్కృత భాషలో వ్యాకరణము లన్నియు గ్రంథకర్తృత్వమున నిశ్చితములుగావు. ఆంధ్ర శబ్ద చింతామణి నన్నయ కర్తృకము కాదని యంగీకృతమైనది. అథర్వణకారికావళి యట్టిదియే. ఇక—వీనిని, పై తెలుగు వ్యాకరణ కారులు గాని, అప్పకవికి పూర్వమున్న (క్రీ. శ. 1656) లక్షణ గ్రంథ కర్తలుగాని, వ్యాఖ్యాతలుగాని పేర్కొనలేదు. తెలుగున గూర్చిన సంస్కృత వ్యాకరణములలో నిర్వివాదముగా, నీ కాలమున నీ కవిచే రచితమైనదని గ్రుద్దిచెప్పుట కొక్క తెలుగు భాషా సంస్కృత వ్యాకరణము లభ్యము కాలేదు. అన్ని వివాదగ్రస్తములే.

క్రీ. శ. 1656 కు పూర్వము తెలుగును సంస్కృత వ్యాకరణములున్నవని చూపుటకే యాధారములు నింతవఱకు లభ్యముకాలేదు.

సంస్కృత భాషలో వ్రాయబడిన తెలుగు వ్యాకరణము లన్నియు, తెలుగు వైయాకరణ సంప్రదాయమునకు విరుద్ధము లగుటచేతను, వానినీతరువాత పండితులు పెద్దగా జేయుట చేతను—ఆంధ్ర వైయాకరణ సంప్రదాయమున నిట్టి యవ్యవస్థ యేర్పడినది.

ఇట్టిపరిస్థితులలో వైకృత చంద్రికా ముద్రణము ఆంధ్ర వ్యాకరణ చరిత్రకెట్లుపయుక్తమగునో పాఠకలోక మూహింపవచ్చును.

మహాగవేషణలో తెలుగున సంస్కృత వ్యాకరణ విషయమే గాని, తెలుగు వ్యాకరణ విషయము లేకుండుటచే నింతగా విమర్శింపవలసి వచ్చినది. కేవలము సంస్కృత భాషలో నున్న వానినే తెలుపుటచేత నీ విమర్శనయంతయు పాక్షికమై ఆంధ్ర వైయాకరణ సంప్రదాయ పద్ధతికి విరుద్ధమైనది.

## వికృతి పదము

వాసుదేవ కవి తన గ్రంథమునకు 'వైకృత చంద్రిక' అని పేరు పెట్టుటయే — అది ఆంధ్ర శబ్ద చింతామణి ననుసరించి పెట్టబడినదని స్పష్టమగుచున్నది. అహోబలుడు వికృతి పదము తెలుగు వ్యాకరణములో వాడుకయున్నట్లు అథర్వణుని "వికృతి వివేకము" అను గ్రంథము నుండి సూత్రముల నుదాహరించినాడు. ఈ సందర్భమున 'వికృతి' పదమునుగూర్చి చర్చించుట యావశ్యకము. ఈ పదము అప్పకవికి పూర్వము (క్రీ. శ. 1656) ఏ తెలుగు వ్యాకరణ గ్రంథముల యందును గానరాదు. అప్పకవి—

వేఱయు నీ రెంటికిని దెల్గు వికృతి యనఁగ — 1–84.

వికృతి చ జ లు — (2–117)

వైకృతములుగావు — (2–139)

అని యీ వికృత వైకృతి పదములను తొలుత ప్రవేశపెట్టినాడు. ఈ వికృతి పదము ఆంధ్రశబ్దచింతామణి బాలసరస్వతీయ వ్యాఖ్యయందు గలదు. బాల సరస్వతి, అప్పకవి, అహోబలపతి ముఖ్వురు సమకాలికులని ప్రామాణికముగా నిరూపితమైనది.

'వికృతి'

ఈ శబ్దమునకు భాషాపరముగా కవి ప్రయోగము లేదు. కావుననే చిన్నయసూరి బాల వ్యాకరణమున, సంజ్ఞా పరిచ్ఛేదమున దీనిని చెప్పక—తత్సమ పరిచ్ఛేదమున 46 సూత్రమున — "వికృతి యందికారముల యుపోత్త మేత్వంబునకు బహువచనము పరంబగునపుడుత్వంబగు" అని దీని నుపయోగించినాడు. సంజ్ఞా పరిచ్ఛేదమున తానీయనిల్ తన — యిచ్చట వికృతి శబ్దముచే సంస్కృత సమేతరంబు గ్రహింపవలయునని వివరణ చెప్పవలసి వచ్చినది. వికృతి పదము క్రీ. శ. 1656 కు పూర్వము లేదని నిశ్చితముగా గ్రహింపవలెను.

వైకృత చంద్రికాకర్త అహోబలుని ననుసరించియే తన గ్రంథమును వ్రాసినాడు. చూడుడీ క్రింది సంవాదములు—

| అహోబల పండితీయము[3] | వైకృత చంద్రిక |
|---|---|
| 1) కలువ కంటి కటాక్షంపు గుంపులు — (పుట 156) | కటాక్షంపు గుంపు సమా. 5 సూ |
| 2) క్రాపిది. బాపనది (పుట 289) | బ్రాపత క్రాపత — స్త్రీ ప్రత్యయ. 7 సూ |
| 3) చిగురాకు చిగురుటాకు (పుట 321) | చిగురుటాకు చిగురాకు సంధి — 19 సూ |
| 4) ధర్మువు, కర్మువు, వర్మువు (పుట 415) | ధర్మువు ధర్మువులు—అజంత 31. సూ |
| 5) పాఱు శబ్దము తద్భవమన్నచో దానియందు శకటరేఫ యుండుట ఎట్లుపొసగును — అన్నచో సది దోషముగా దీని యెన్నవలెను. (పుట 432) | బాడబ—పాఱఁడు. చూళికా పైశాచి — 83 సూ |
| 6) కన్నెరికము — (రికము) (పుట 465) | రికన్ కన్యాది భ్యః తద్ధిత 33 సూ. |
| 7) మంట వంట ఇత్యాదులు జాపవిభక్తికము (పుట 484) | పండ, వండ మండా నామంత్యస్య—కృదంత 5 సూ. |

పై వానిలో 'ఱకారము' తెలుగున దేశ్యమునకు స్వతస్సిద్ధమైన ధ్వని కాగా, వైకృత చంద్రికా కర్త ప్రాకృత భాషాభేదమగు చూళికా పైశాచిలో నిది యున్నదని చెప్పుట — ప్రాకృత భాషా సంప్రదాయమునకు విరుద్ధము.

వైకృత చంద్రికా కర్త అహోబలునేకాక, ఆంధ్రకౌముదీ కర్తయగు గణపవరపు వెంకట కవిని అనుసరించినాడు. ఈవేంకట కవి క్రీ. శ. 1674 ప్రాంతమువాడు.

| ఆంధ్ర కౌముది | వైకృత చంద్రిక |
|---|---|
| 1) సీ. పా. పరగునింకఁగ్రు దంత భావార్థ రీతులు తెలుఁగునఁ గొన్నింటిఁదెల్పుదుదగి...... [దున్ని కి ప్రత్యయమగు దుక్కియనఁగ నొక్కట— పుట 28 | కృదంత భాగము. 20సూ. దున్నః కిర్— వృత్తి దున్న ఇత్యస్య పరతః కిరస్యాత్ దుక్కి. తె. వృ. దున్న ధాతువునకు 'కిర్' ఆదేశమగును. |
| 2) సీ. పా. ఊహింపఁగి కిన్ములు యొక్కకుకునులషష్ఠియై చెన్నారు. (పుట 5) | సమాస ప్రకరణమ్ 3. సూ. ఒక్క శేషే వృ.షష్ఠీశేషే ఇతి విహితాయా షష్ఠాః స్థానే 'ఒక్క'ఇతిస్యాత్. దొరయొక్క మానిసి. |

ఇక నీ గ్రంథ మాంధ్ర వైయాకరణ సంప్రదాయమున కెట్లు విరుద్ధముగా నున్నదో నిరూపించుచున్నాను.

పై సంవాదముల వలన — వైకృత చంద్రికా కర్త మంచెళ్ళ వాసుదేవ కవి — క్రీ. శ. 1674 కు తరువాతి వాడని

దీనికొక హేతువు కనబడుచున్నది.

మొదటి మూడు సూత్రములలోను ఉదాహరణము ప్రథమా విభక్తి 'డు' ప్రత్యయమంతమందు గలవి. అది బిందుపూర్వకము (జ్ఞాతృ బిందుపూర్వకము) కావున అర్ధాను స్వారముతో చూప బడినవి.

ఇచట మూలమందు బిందువున్నట్లు లేదు కావున ఉదాహరణములలో చూపలేదు. నిఘంటువులలో 'ఇఁడి'యని యరసున్న సహితముగానే గలదు.

'ఇఁడి. ప్ర. (త. క. ఇడి) లేనిది, లేనివాఁడు, అను అర్థముల నిచ్చును. (ఉదా. ముక్కిఁడి, వాలిఁడి, సిగ్గిఁడి మొ.)

7 (సూ.ని. సం.1 పుట 505)

''ఆముఖం''లో గాని ''గవేషణ''లో గాని పై యర్ధాను స్వార విషయము ప్రస్తావింపబడలేదు.

## ప్రయోగములు

వెరవిండికి ప్రాసలో ముందు చూపితిని.
వెరవిఁడియై మీనుకుగట్టి. విజ్ఞానేశ్వరము ఆ. చా.101ప.

'ముక్కిండి' ప్రాసలో ముందు చూపితిని.
ముక్కిఁడి జంతకు ముత్తెంపు నత్తేల రామలి. 33.

సూ. ని. లో రెండింటికి, పూర్ణబిందు స్వరూపము ప్రాసలోమున్న పై ఆంధ్రభాషా భూషణ ప్రయోగములు చూప బడలేదు.

ఇట్లే—వీతిండి—వీతిఁడి—అవివేకి, బుద్ధిలేనివాడు.
వీతిండి తనంబుచేత నిసితింతలు పాతెడు
ఉ. హరి 4–149.

వీతిఁడియైన మానిసికి—భార. ఉద్యో(3.107)

మూలమాత్రమున—

నామ్నుస్తోన ''ఇండిచ్'' అని యుండవలెను.

కాని యట్లు లేదు.

చిన్నయసూరి బాలవ్యాకరణము తద్ధిత పరిచ్ఛేదమున 'ఇఁడి' అని అర్ధానుస్వార సహితమే చూపియున్నాడు.

ముక్కులోనగు వానికిందర భావద్యోతకంబయి మతు బర్థంబునం దిఁడి వర్ణకంబగు—24 సూ.

ముక్కిఁడి = ముక్కులేని వాఁడని యర్థము.

ముక్కువాలు, వెరవు, సిగ్గు—ఇత్యాదులు. ప్రయోగంబు లందెఱుంగునది.


# ఆంధ్రగ్రంథమాల ప్రచురణలు

## పండితారాధ్య చరిత్ర

డాక్టరు తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు వ్రాసిన పీఠికతో అమ్మకానికి సిద్ధంగావుంది. వెల రు 15-00 (పోస్టేజి అదనం)

## బసవ పురాణము

బైండుచేసిన రంగుల అట్టతో కీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావుగారి 'ప్రస్తావన'తో కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావుగారి విపుల పీఠికలో అమ్మకానికి సిద్ధంగా ఉంది. వెల రు. 7-50 (పోస్టేజి అదనం)

## భగవద్గీత

కీ. శే. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు వ్రాసిన వ్యాఖ్యానముతో బైండుచేసి అమ్మకమునకు సిద్ధముగా నున్నది. వెల రు. 7-50 (పోస్టేజి అదనం)

ఆంధ్రపత్రిక ఏజెంట్లద్వారా కూడా తెప్పించుకోవచ్చు.

ప్రతులకు

**మేనేజరు**

ఆంధ్రపత్రిక, గాంధీనగర్, విజయవాడ-3

# ఎడు ప్రత్యయము

## (ii) 5వ సూత్రము ఎడుమ్ పరిమాణే

వృ. పరిమాణ వాచకాదెడుమ్‌స్యాత్
తూమెడు, మూరెడు, బారెడు

పరిమాణ వాచకముల కంటె "ఎడుమ్" అను ప్రత్యయము వచ్చును. తూమెడు మూరెడు బారెడు ఉదాహరణములు.

పరిమాణార్థకమైన ఎడు ప్రత్యయము —
అర్ధానుస్వార సహితము. ఎఁడు.

బాలవ్యాకరణమున —

"మానార్థంబున కేకత్వంబున కెఁడు వర్ణకంబగు"
తద్ధిత. 25 సూ.

అని ఎఁడు ప్రత్యయమర్ధానుస్వార సహితముగానే చూపి యున్నాడు.

సూరి అంతకుముందు సంధి పరిచ్ఛేదమున — 'ఎఁడు' అర్ధానుస్వార సహితముగా చూపియున్నాడు.

అంద్వవగాగమంబులం దప్పన పదాది స్వరంబు పరంబగు నప్పు డచ్చునకు సంధియగు. 11 సూ.

మూర + ఎఁడు = మూరెఁడు.

వీసె + ఎఁడు=వీసెఁడు... దీనినిగూర్చి తరువాత పూర్తిగా తెలిపెదను.

**ఏడు —**

వైకృత చంద్రికలో మూలమున — నిరనుస్వారముగనే యున్నది. దీనికి హేతువిది :

'ఎడు' ప్రత్యయము పరిమాణ వాచకముగా ఆంధ్రశబ్ద చింతామణి యందిట్లు తెలుపబడినది:

**పరిమాణ సంధి**

మూ. సూ. పరిమితౌ సమస్తానామ్. సంధి 5. సూ.

టీ — సమస్తానామ్ (అచామ్) సమస్తమైన యచ్చులకు

పరిమితౌ = పరిమాణార్థకము పరమైన నిత్యముగా సంధి కలదు. ఉదా. బారెఁడు, పుట్టెఁడు, మానెఁడు, తూమెఁడు, గంపెఁడేసి.

బాలసరస్వతీయము. పుట 166. 1963 ముద్రణ.

ఇట బాల సరస్వతీయమున 'ఎఁడు' అరసున్నతో చూపబడినది. ఇది గ్రంథ సంపాదకులగు శ్రీవజ్ఝలవారు నిలిపినదే. కాని వ్రాత ప్రతులందున్నట్లులేదు. చూడుడు—

# - అప్పకవీయము -

## పరిమాణ సంధి

మూ. సూ. పరిమితౌ సమస్తానామ్.

సీ. కనిపెడు వ్రేలెడు కమికెడు జేనెడు
మూరెడు చేతెడు బారెడనఁగ
జెబెడు పుడిసెడు చేరెడు దోసెడు
గంపెడు పుటికెడు గాదె డనఁగ
జెంబెడు దుత్తెడు చెరగెడు బిందెడు
పలఁ కెడు కుండెడు బానె డనఁగ
బారెడు చిట్టెడు పడెడు సోలెడు తవ్వె
డామాన కుంచెడు తూమెడనఁగఁ

గీ. దక్కెడన వీసెడన నొక్క చిక్కె డనఁగ
వాటెడన మోసెడన పెద్ద వామెడనఁగ
పరిమితార్థంబు తుదినిల్చు పట్లనిట్లు
ప్రాణములనెల్ల దళిమి వక్రములు వెలయు 5–72

పై పద్యమునసేగాక అప్పకవీయము 3–219. విభాగ వళులు—

"తీవితోడ దోసిడేసి మాడలు
గం పెడేసి సొమ్ము"అని ఎడు ప్రత్యయము నిరనుస్వారముగానే గలదు. వావిళ్ల 1910 నుండి తరువాతి ముద్రణముల— ఎడు నిరనుస్వారముగానే యున్నది.

అహోబల పండితీయము—
పరిమితౌసమస్తానామ్.

పరిమాణార్థకే వర్ణకేపరే తత్సంబంధి ప్రాచీన సహ సర్వ ప్రాణానాం నిత్యం సంధిస్యాత్—బారెడు, మూరెడు, పట్టెడు, తూమెడు, గంపెడు ఇత్యాది. "మానార్థాన్నిత్యమేకత్వే ఎడుస్స్యాత్పరి మాణకే" (వి. వి. సంధి. 7) ఇత్యధర్వణీ నోక్తం

ఇందు 'ఎడు'లో అరసున్నలులేవు. (పుట 282)

అహోబల పండితీయము
కవిశిరోభూషణ వివృతి

49. సూ. పరిమితౌ సమస్తానామ్.

బారెఁడు, మూరెఁడు, పట్టెఁడు, తూమెఁడు, గంపెడు ఇత్యాది. "మానార్థాన్నిత్యమేకత్వే ఎఁడు" స్యాత్పరిమాణకే. ఇత్యధర్వణోక్తమ్. పుట 198 (1972)

విద్వాన్ ఆకెళ్ల అరుణాచలశాస్త్రిగారిది.

హైదరాబాదు అహోబల పండితీయమున ఎడులో లేని యరసున్న — అరుణాచల శాస్త్రులవారి గ్రంథములో నుండుటకు కారణమున్నది. వారు వఝ్ఝలవారి శిష్యులు. వఝ్ఝలవారే

బాలసరస్వతీయమున — తప్పక అహోబల పండితీయాదుల లేక పోయినను బాల వ్యాకరణము చూచిన హేతువుచేత — అందు ఎడు ప్రత్యయమున నరసున్న యుంచిరి. గురువుల ననుసరించి, శిష్యులును రసున్న యుంచిరి. అంతే!

సూర్యరాయాంధ్ర నిఘంటువున — పరిమాణార్థకమైన ఎడు' ప్రత్యయము చూపబడలేదు. (పుట 503)

శబ్దరత్నాకరమున — ఎఁడు చూపబడినది. ఎఁడు. దే. అప. రిమాణార్థకము.

క. నీనుడువులకే నడగెం
డైనను దాఁటనని సత్యమాడెను రుక్మాం. ౫ ఆ.
(పుట 103)

ఎఁడు సార్థ బిందుకము.

నీ నుడువులకే నడుగెం
డైనను దాఁటన నసత్యమాడెడు. రుక్మ. 5–2

''తెలిసి కుచేలుఁడొక్క కొనిదెండటుకుల్ తన కిచ్చినన్
భాస్కర శతకము. 8 ప.

చెడగొలుకింతె గాక పుడిసెండు జలంబది పెంపనేర్చునే.
భా. శ. 20 ప.

ఎఁడు శబ్దమున కౌప విభక్తికమున—
ఎఁడు ంట్టి—ంట అను రూపములు వచ్చును

''గొలుగరేతల యొకకొంణి దెంటికైన''
పండితారాధ్య చరిత్ర—దీక్ష 280 పుట.

ఎడు—ఎంట—అనువానికి ప్రయోగములు చూపుచున్నాను.

ై గ్రంథమున పర్వత ప్రకరణము పుట. 480

ప్రేలెంట నొక్కొక్క వృక్షంబు
నల్లెంట నొక్కొక్క నవలత
జుట్టెంట నొక్కొక్క చోద్యంబు
జేనెండు నొక్కొక్క శివమూర్తి
మూరెంట నొక్కొక మునిపల్లె
చేతెంట నొక్కక సెలయేలు
బారెంట నొక్కొక్క పర్వతము
కూగెంట నొక్కొక్క కూటంబు.

కెరలక క్రమ్మరింప నడుగెంటనే నిల్చు—
పాండు. 1–114

ఇందువలన పరిమాణార్థకమైన ఎఁడు ప్రత్యయమర్ధాను స్వర సహితము.

వైకృత చంద్రికాకారుడు చింతామణికి వృత్తి వ్రాసిన డు. కావున విడిచిపెట్టినాడు.

## (iii) తద్ధితాదేశములు

సూ. 33. రికన్ కన్యాదిభ్యః

వృ కన్యాది భ్యోరికస్యాత్. కన్నెరికము రెడ్డరికము.

తె. వృ. కన్యాది శబ్దములకంటె 'రికన్' ప్రత్యయము వచ్చును. కన్నెరికము. రెడ్డరికము.

ఇక 'రిక' ప్రత్యయము సాధు రేఫ కాదు. అది శకట రేఫ. ఱిక—

సీ. పా. కన్నెఱికము రాయమన్నెఱికము కడు
పెద్దఱికము నిఱుపేదఱికము
పెఱర్చాచఱికము కమ్మఱికము నను పేరు
లివి ఱిక ప్రత్యయ మవుచుఁదనరు.
ఆంధ్రకౌముది. పుట 27

గణపవరపు వేంకటకవి.

విన్నాదులకు ఱికవర్ణకంబగు.

విన్నఱికము—కన్నెఱికము చిన్న. కన్నె చుట్టము

వొంగ—పేద—మిండ — లంజె ఇత్యాదులు చిన్నాదులు
బా. వ్యా. తద్ధిత. 3 సూ.

ఇట్లే పెద్దఱికము.

ఎఱుఁగమి చీకటినీ పె
ద్దఱికము''. భార. విరా 5–357.

దీనిని బట్టి – 'ఱిక' ప్రత్యయము — కాని 'రిక' కాదు. నిఘంటువులన్నియు 'ఱిక' గానే చూపినవి.

కన్నెఱికము—అన్నింటియందు శకట రేఫ రూపమేయున్నది. రెడ్డఱికము. ఇది నిఘంటువులలో లేదు.

ఱిక ప్రత్యయము–సాధు రేఫగా నిచ్చుటయే యీ వ్యాకరణ సూత్ర పద్ధతి సరికాదని తెలుపుచున్నది.

## (iv) 6 సూ. పౌరుషే బంటిమ్

వృ. పురుష సంబంధి పరిమాణ విహితాద్బంటిమ్ స్యాత్ మొలబంటి కుత్తుక బంటి

తె. వృ. ఆ పరిమాణము పురుష సంబంధి యయ్యెనచో తద్వాచకము కంటె బంటిమ్ అను ప్రత్యయము వచ్చును. మొల బంటి కుత్తుక బంటి — పురుష సంబంధ వ్యతిరిక్త వాచకములకు బంటి వచ్చును.

కుత్తుక బంటి తామరలకునే. విజయవిలాసము (2–76)

క. బాల శశి హర భూషలకును
పొలుపుగ మితిలేని మాడి మొలబంటై యో
మ్ముల బంటై మెడ బంటై''
— నరస — 5–85

7. సూ. స్వార్థేకమ్.

వృ. కచితే స్వార్థేకమ్ స్యాత్ విప్పక

తె. వృ. కొన్నిచోట్ల స్వార్థమునందు కప్ అను ప్రత్యయము వచ్చును. నిప్పక

8 సూ. ఉత్కమి.

కమి ప్రత్యయే పరే అత ఉత్స్యాత్ నెలఁతుక. ఇకారస్యాపీతి కేచిత్ వెలఁదుక.

తె. వృ. కమీ ప్రత్యయము పరమయినప్పుడు అకారమునకు ఉత్తు వచ్చును. నెలతుక. ఇకారమునకు గూడ వచ్చునని కొంద అందురు. వెలఁదుక —

ఇది అహోబల పండితీయము నుండి గ్రహించినది.
''భవేత్కః స్త్రీ సమానామ్న | ఉత్వం తస్మిన్ పరే భవేత్
(వికృ. క్రియా౨౧. అహో ౫౦౨ పుట) అన్యేచ బహవో
దేశ్య | వర్ణకా అర్థ భేదకాః | క్వచి దన్త్యస్య లోపః
స్యాత్ | క్వచి ద్వర్ణాగమో మతః
(వికృ అజం ౫౨—౫౩ కారి. అహో ౩౨౬ పుట)

నామ్నః = ప్రాతిపదికమునకు, స్వార్థే = స్వార్థమందు కవర్ణకః = క ప్రత్యయము స్యాత్ అగును. పూర్వసూత్రము నుండి చ శబ్దాను వృత్తిచే నిది వైకల్పికమననగును. తస్మిన్పరే= ఆ కప్రత్యయము పరమగుచుండగా — ఉత్వమపి = ముంచటి అకారమునకు ఉకారము సయితము స్యాత్—అగును. కొన్ని యెడల ఇకారమునకును ఉత్వమగును.

ఉదా. వెలఁదుక నాతుక. మొ.
ఆంధ్రవ్యాకరణ సంహితా సర్వస్వము. పుట 1276
పై అహోబల పండితీయము ననుసరించి యే—సూరి
''ఉక వర్ణంబు చిఱుతాదులకు స్వార్థంబునం గగు''
చిఱుతుక — నాతుక — చిఱుత — నాతి
నెలఁత — మెలఁతఁ — పడఁతి — మడఁతి — పొలఁతి
వెలది — నివ్వ — ఎమ్మ ఇత్యాదులు చిఱుతాదులు.
బా. వ్యా. త. 10 సూ.

అని 'ఉక' ప్రత్యయము విధించినాడు. అంతటను బా. వ్యా. సంధి 11 వ సూత్రము ననుసరించి అపదాదిస్వరసంధి నిత్యము గానగును.

''అంద్వవగాగమంబులు దప్ప న పదాది స్వరంబు పరంబగు నపుడచ్చునకు సంధియగు. 11 సూ.

కాబట్టి పైని రెండు విధములుగా దీనిని సూత్రింప నావశ్యకత లేదు.

పుట 101. 31 సూ. బలహోలాభ్యామిమిః
తాభ్యాంపరత ఇమిస్యాత్. బలిమి ఎలిమి.

'బలిమి' అను రూపము కానవచ్చుచున్నది గాని 'ఎలిమి' అను రూపము కానరాలేదు. ఎలమి అను రూపమున్నది. అప్పుడది యీ సూత్రమునకు లక్ష్యముకాదు. అప్పుడు ఎల + అమి — కాని ప్రస్తుత సూత్రము — ఇని స్పష్టముగా విధించుచున్నది —

సూ. అరి మీ మ్కా మో మతుపః
వృ. మతు ప్రత్యయస్య అరిప్ ఈప్ కాప్ ఇత్యేతే ఆదేశాస్యుః

సుంకరి, నేతరి, తొంటరీఁడు వన్నెకాఁడు.

కాడు శబ్దము తెలుగు పదములపైనే కాదు సంస్కృత పదములపైని వచ్చును.

కోపగాఁడు

అన్న మీతండ్రి కోపగాఁ డౌనొ కాదొ ? (కాశీ. 4–90)

విటకాఁడు —

''విటకాని పొందుకేకారి పగలు'' (ఉ హరిశ్చ 4–18)

బలిమి శబ్దముతోపాటు — భాషలో నెక్కడను గానరాని ఎలిమి శబ్దము నిచ్చుటయే యీ గ్రంథము అప్రామాణికత కుదాహరణము.

పైని యిచ్చిన వివరములనుబట్టి యీ గ్రంథ ప్రచురణ సర్వాత్మనా ప్రయోజన శూన్యమని బాహాటముగా ప్రకటింప వచ్చును.

## అధోజ్ఞాపికలు

1. గ్రంథమున ముఖపత్రమున ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ లైబ్రరీ అండ్ రిసెర్చి ఇన్స్టిట్యూటు అని ఆంగ్ల భాషలో నుండుట సరికాదు. తెలుగులోనే యుండవలెను.
2. గ్రంథము—1960 లో మదరాసు విశ్వ విద్యాలయము వారిచే ప్రకటితమైనది.
3. అహోబల పండితీయము—ఆచార్యఖండవల్లి లక్ష్మీరంజనము సంపాదకత్వము—1965 :
4. ఆంధ్రకౌముది— ఆంధ్ర సాహిత్య పరిషత్తు కాకినాడ ప్రచురణము—1935.
5. ఆంధ్ర వైయాకరణ పారిజాతము — వఝ్ఝల చినసీతా రామస్వామిశాస్త్రి—1960.
6. మదరాసు విశ్వ విద్యాలయము వారు—1962లో ద్రావిడ భాషా సామ్యపద కోశము (Comparative Dravidian Vocobulary) అను గ్రంథము ఆంగ్లభాషలో ప్రకటించిరి. ఇందు 2000 తెలుగు దేశ్య పదములకు ద్రావిడ సాజాత్య పదములు గలవు.
7. సూ. ని. సూర్యారాయాంధ్ర నిఘంటువు. తొలి సంపుటము.

— కళాప్రపూర్ణ నిడుదవోలు వెంకటరావు

శ్రీ జి. కమలాకర్

# వెలూరకా మహా విహారం

దేశ(ద్రిమ్మరితనంలో శిష్యులు వర్షాలకు తడసి, రోగులు కావడం విని చూచి తథాగతుడు వ్యథితుడైనాడట. వానాకాలం మూడు నెలలు సంచారం మాని తలదాచుకోడానికి (వస్సవాస) అనువైనవిగా నిర్ణయించిన వాటిలో ఒకటి - గుహ, గుంఫా, గొంఫ, లేణ.

గుహావాసం తాత్కాలికం. కానిఅనుభవం భిక్కుల మేధో వికాసానికి మెఱుగు పెట్టింది. కొండలు దొలచి భిక్కుగుహ (మాళిగ) లేర్పర్చారు. ఆ మాళిగల్లో ధ్యానం (విపస్సా) చేసేవారు. రానురాను అదే పద్ధతి కొండలు దొలచి మండపాలు, చైత్యా (ప్రార్థనా) లయాలు నిర్మించారు. తోట (ఆరామ)లు పెంచారు. ఆరామాన్నే విహారమన్నారు. భిక్కుల సామూహికావాసం సంఘారామమైనది.

చైత్యాలయాలన్నీ అశోకుడూ, పౌత్రుడు దశరథుడూ నిర్మింపజేసారంటూరు. కాని దక్షిణాపథాన, కోస్తాల్లో బౌద్ధ క్షేత్రాలనేకం ఆంధ్ర చక్రవర్తుల నాటివి. వారు అంతఃపురజనం, సామంతులు, సార్థవాహులు (వర్తకులు) వైవాహిక బాంధవ్యాలున్నవారు, విజయపురి శ్రీ పర్వతేయులు, వైజయంతీపుర చూటుహుల నాగసాతకర్ణులు, క్షాత్రపులూ — అందరూ స్వతంత్రులైనా ఆంధ్రరాజులనాటి ఆచారం పాటించారు. బౌద్ధ బ్రాహ్మణ్యాల పోషించారు. క్షేత్రాల మరమ్మతులూ చేయించారు.

బౌద్ధంలో గొప్ప మార్పు—సాతవాహనులనాటి గుహావాసం అంటారు. భిక్కులు సర్వసంగ పరిత్యాగులు. వారిలో నిద్రాణంగ ఉన్న నిర్మాణ కౌశల్యాన్ని మేల్కొల్పినది గుహావాసము. నిర్మాణంలో వారికి వారే సాటి అయినారు. పల్లపు ప్రాంతాల్లోనూ, తదితరంగానూ ఇటికె, మట్టి, రాయి, కంప, కలపతో కట్టినవి కాలగర్భాన కలసిపోయాయి. కొండలు దొలచి నిర్మించిన వనేకం కనుమరుగైనా పురావస్తుశాఖ పుణ్యమా కనిపిస్తున్నాయి.

వస్సవాస—తాత్కాలికావాసాలు స్థిరావాసాలైనాయి. సంఘారామాలు సంపన్నమైనా సన్యాసులకు వ్యక్తిగతంగా ఆస్తికాదు. ఈ స్థిరావాస దశలో భిక్కుల విద్యా విజ్ఞాన తృష్ణ పరాకాష్టకు చేరింది. చతుర్వేదాలు, షడంగాలు, చతుర్దశ విద్యలు, అష్టాదశ శిల్పం, చేషష్టి కళలూ అధ్యయనం చేశారు. విహారాలు విశ్వవిద్యాలయాలై, దేశ విదేశీ విజ్ఞానుల గోష్టి కేంద్రాలై, మహా గ్రంథ భాండారాలైనాయి. ఈ ప్రగతి ఆంధ్ర చక్రవర్తులనాడూ, కుశాను కనిష్కునినాడూ అనేక దేశాలవారిని ప్రభావితుల చేసింది.

చైత్యా (ప్రార్థనా) లయ, విహార (వసతి) నిర్మాణాలకు బౌద్ధులు నీరు, గాలి, సూర్యరశ్మి సౌకర్యాలతోపాటు భిక్షాటనకు అనువుగా బస్తీలకు సుదూరం, అతి సామీప్యంగాని స్థలాలు, ధ్యానిష్ట భంగంగాని తావులు ఎన్నుకున్నారు.

వనవాసి (వైజయంతీపుర) నాగసాతకర్ణులబట్టి నాగఖండ—అపరాంత, కుంతల ప్రాంతం నేటి కర్నాటక, మహారాష్ట్ర పడమటి కోస్తా ప్రాంతాలు. అశోకుని నాడు ధర్మ రక్షితుడ అపరాంతలో అనేకుల బౌద్ధుల జేసిన వైనమున్నది. ప్రకృతి సహజమైన పర్వతపంక్తి, సహ్యాద్రి పడమటి కనుమలు, ఆ ప్రాంతాల్లో వెలసిన పురాతన బౌద్ధ క్షేత్రాలు. భాజా చైత్యాగారం క్రీ. పూ. రెండవ శతాబ్దానిదట. వాస్తు నిర్మాణాల్లో భాజ పోలిక ఇతర క్షేత్రాల్లో ఉన్నవి. భాజా నిర్మాణ కాలానికి సమీప కాలానిది. హీనయాను లారంభించి మహాయానులు తీర్చిదిద్ది పూర్తిచేసినది 'వేలూరకా మహాచైత్య' జంబూద్వీపంలో సర్వోత్తమ మహా విహారంగా ప్రసిద్ధియైన బౌద్ధక్షేత్రం—కార్లా గుహాలయము జంబూద్వీపం ఆసియా అనీ, భారతదేశం అనీ విభిన్నాభిప్రాయలున్నవి.

హీనయానుల వస్సవాస కుపకరించిన గుహాలయం మహాయానులు తీర్చి దిద్దడంలో శిల్పసంపన్నం జేశారు. వెలూరకా విహారనిర్మాణ ప్రోత్సాహకుదు వైజయంతీపుర వణిబుడు భూతపాలసెట్టి అనే వైనమున్నది.

* * *

నేడు కార్లా పరిసరాల్లో బునావాసాల్లేవు. ఒకప్పుడు దేశీ విదేశీ భిక్కులు, విద్యార్థులు, యాత్రికులు, పండితులు కిటకిటలాడిన తావు. పూనా (పున్యా)—బొంబయి (ముంబాయి) రహదారిలో ఉన్న కార్లా క్షేత్రం పురావస్తుశాఖవారి రక్షిత కేంద్రము. దగ్గర 10, 11 మైళ్లలో భాజా, కొండాన క్షేత్రాలున్నాయి. సరాసరి ప్రయాణ సౌకర్యం, భోజన వసతి సౌకర్యాలేర్పరిస్తే 'టూరిస్ట్ సెంటర్'గా అభివృద్ధికాగలదు.

కార్లా కొండవిగాదకున్న ఒకే దారి ఎకాయెకిని ఎక్కలేనంత నిటారుగా ఉన్నది. దార్లో అక్కడక్కడ తినుబండారాలూ, తేనీరు దుకాణాలు దప్ప వేరు సౌకర్యం లేదు. కొండవిాదినుండి చూస్తే దిగువ లోయ, పర్వతాలూ ప్రకృతి మనోహర దృశ్యాలు.



చైత్యాగారం మహాస్తూపం

కార్లా శిల్పులు వివిధ దేశ, ప్రాంతాలవారట. శిలాశిల్పంతు పనితూగే వ్రడంగి చేతిపని నిర్మాణమూ ఉన్నది. చైత్యాలయానికి ఆనాడు అమర్చిన టేకు దూలాలు చెక్కుచెదరకుండా ఉన్నాయి. క్షేత్ర శాసనాల్లో ఒక మహిళా, ఒకవ్రడంగి పేర్కొనబడినారు. ముఖద్వారంపైగల కిటికీ చేసిన వ్రడంగి వివరణ ఉన్నది.

రాతివంక పన్నని గోడ ప్రార్థనాలయం వసారాల మధ్య వేరువేసేదిగా ఉన్నది. వసారా తలవాకిట ఒకవైపు నాటి శిల్పకారుల నైపుణ్యాన్ని చూపే సుందర మిథునమున్నది.

మహాస్తూపం రెండు వరుసల అలంకరణ, దిగువ దాని క్రింద రంధ్రాల వరుస ఉన్నది. ఈ క్షేత్రంలో మరో ప్రత్యేకత కిటికీల నుండి సూర్యరశ్మి నేరుగా స్తూపంపై ప్రసరించే ఏర్పాటు. ఈ పద్ధతి పిమ్మటి హిందూ క్షేత్రాల్లో ఉదయభాను కిరణాలు గుడిలో దేవునిపై ప్రసరించే ఏర్పాటు. ఇది చోళుల నాటి ప్రత్యేకతలనే. పరిశోధకులు కార్లా ఏర్పాటు గమనించదగినది.

వెలూరకా క్షేత్ర శాసనాల్లో వాసిష్ఠీపుత్ర పులుమాయి శతక్షత్రప నహపాణుని అల్లుడు ఉశవాదత (ఋషభదత్త), ఇతని కొడుకూ ఉన్నారు.

కార్లా క్షేత్రం అశోకునికన్న పురాతనం, క్రీ. పూ. 280 నాటిదనే పరిశోధకాభిప్రాయం లేకపోలేదు. క్షాత్రపులు పేర్కొన్న ధేనుకటక కార్లా సమీపాన జనపదం గ్రీకులు ధ్వంసం చేశారనే వైరమూ ఉన్నది.

కార్లా 'మహాసాంఘిక' అనబడేసంఘమున ఆయా సంఘాల బౌద్ధులందరికీ ప్రవేశముండేదనాల. నానా– దేశీ, మెట్టుదారి వాణిజ్యం, సార్థవాహులకీ క్షేత్ర సంబంధం బాగా ఉన్నట్లుంది. సార్థవాహుల సరుకు కొనుగోలు, సుసంపన్నమైన ఈ సంఘారామం నిధులు వర్తకులకు అప్పులీయడం, సార్థవాహుల (సెట్టి) కీ క్షేత్ర నిర్మాణాభివృద్ధికి దానధర్మాలు, ఆర్థిక విషయాలు. భాగ్యవంతుల ధనసహాయమే చైత్యాలయంలో మిథున, శృంగార శిల్ప కారణాలనే పరిశోధకాభిప్రాయం లేకపోలేదు.

మౌర్యులు, శాతవాహనులు – విదేశీయులైన శకాసులవలె వీరుకూడా బౌద్ధ బ్రాహ్మణ్యాలకు దానాలిచ్చారు, పోషించారు.

* * *

బౌద్ధమతానికి సంబంధం లేని ఏకవీర (గుడి) బౌద్ధ క్షేత్రాన ఉండుట వింతగానిపిస్తుంది. బహు పురాతనమైన మహామాతలు, సప్త మాతృకలు బౌద్ధంలో చేరిపోయిన చరిత్ర ఉన్నది. బౌద్ధుల హారీతి ఆదిలో శిశుహంతకి అనబడిన దేవత అసలు ఒక మాతాదేవి యనే వాదమున్నది. తెలంగాణా నాగరం, తదితర స్థలాల్లో బౌద్ధ శిథిలాలపై రేణుకా (ఏకవీర) పూజ యున్నాయి.

బహు పురాతన కాలాన జనజీవన విధానం - కేంద్రాల్లో మహామాతలు పూజింపబడ్డారు. వారికున్న హింసాత్మకారాధనలు బౌద్ధులూ, బ్రాహ్మణులూ మాన్పించారు. బౌద్ధక్షేత్రాలు శిథిలం కాగా ఆ జానపద మహామాతల పూజలు పునరారంభమైనట్లు పరిశోధకాభిప్రాయము.

కార్లా ఏకవీరమూర్తి (చూ. ''గుడిమల్లం'' – జి. ఆర్. వర్మ)సవదత్తి, గోలకొండ, అలంపూరు తదితర రేణుకా క్షేత్రాలకు విభిన్నంగా ఉన్నది. సుందరి, రక్తవర్ణ. కొరుకు బెద్మా విహారాన ఏకవీరనే యమాయి అంటున్నారు-యమాంశగలది.

కళింగలో వారాహినేయమి అంటారు. పెద్దయమ్మా దివారాహినే యమ్మా, జగజ్జననీ, (యెల్లమ్మ) వగైరా అన్నారు. కాని, కార్లా, బెద్మా క్షేత్రాల్లో యమాయికి యమి, వారాహీ లక్షణాలేవీలేవు. ''కళింగదేవ'' లో వివరణ చూడగలరు.

బెద్మాయమాయి గుడి కట్టించినది కోలీలు. (జలాధారాలపై జీవించేవారు) వీరికి సాగర సంబంధ మెక్కువ. యమి, వారాహీ, రేణుకా, రేవతీ జలదేవ సప్త సంబంధమున్నవారే.

యమాయి ధ్వజస్తంభం నిల్పినది 'మహారథి గోతిపుత్ర అగిమిత్రక'. ఈ గోతమీపుత్ర అగ్నిమిత్ర చరిత్ర వల్లభి మైత్రకుల్లో ఉండవచ్చును.

కుమారి చలిచం సీత

# పలనాటి వీరగాథలు: బ్రౌన్ అవగాహన

పలనాటి వీర చరిత్రపై కొన్నిఅంశాలను చర్చించువేళ పూజ్యులు, పితృపాదులు శ్రీయుత నేలనూతల శ్రీకృష్ణమూర్తిగారన్నారు.

"నీవు మదరాసు వెళ్ళి ప్రభుత్వ ప్రాచ్య భాండాగారంలోని ప్రతులను, అందు బ్రౌన్ వ్రాసుకున్న పార్శ్వటీక (marginal notes) ను చూడనిదే సమగ్రంగా ఏ అంశమును పరిశీలించుట యోగం కాదు" అని.

తదాదేశాన్ని పురస్కరించుకొని ఆ ప్రతులలో బ్రౌన్ వ్రాత కొరకు వెదకటం ప్రారంభించాను. కాగితపు ప్రతులలో D 1112 నుండి D 1120 వరకు నాకు కావలసినది లభించలేదు. D 1121 పీఠికలో–

"Palanautee Vera charitra"

War of seven Heroes some of whom were cowherds against the cited Goorjala Macharla in the Palanaud country which lasted for seven years & originated in some disputes about cock fighting.

This volume is spoken of in wilsons "Mackenzie manuscripts" vol 1. p. 305...

అని ఉన్నది.

తరువాత D 1130 తిరుగవేస్తే నిండుగా బ్రౌన్ వ్రాత కనిపించింది. పీఠికలో పల్నాటి యుద్ధము తేదీ నిర్ణయించునపుడు ఆ కాలంలో జంగములు ఒక ప్రబలమైన శాఖ అను అంశమును విస్మరింపరాదను సూచన ఉంది. దీని నెంతమంది పండితులు స్వీకరించారా అనే ఆలోచన వచ్చింది. కాని నేను వచ్చినపని పల్నాటి వీరగాథపై రాజనీతి సంబంధంగా బ్రౌన్ పరిశీలనలో ఏమైనా ప్రత్యేకాంశములున్నవా? అనేది. అది త్వరితంగా పీఠిక దాటి ద్విపద భాగంలోకి నా దృష్టిని మరలించింది. రెండవ పేజీ త్రిప్పగానే మొదటగా దొరగారు, వ్రాసిన వాక్యం బ్రహ్మనాయుడుకు

'the lady Bramhi' తరువాత

'భామినేనికి విన్నపముచేసి మ్రొక్కి' అనేచోట

'Bhami nedu is the Lady' అన్న వాక్యం

ఊపిరాడకుండా చేశాయి. బ్రహ్మ అనే స్త్రీ, భామి నీడు అనే స్త్రీ ఈ వీరగాథలో ఎక్కడాలేరు. మరి బ్రౌన్ ఇలా ఎందు కనుకున్నాడు?–అన్న సందేహమే ఈ వ్యాసరచనకు దోహదం చేసింది.

బ్రహ్మ, భామి శబ్దాంతమునను న్న 'ఇ' అవి స్త్రీ వాచకము అని తలపింప జేసినదేమో అని చదువుకుంటూపోతే మరికొన్నిచోట్ల అదే ప్రయోగము, మరికొన్ని అపార్థాలు స్పష్టంగా తెలిశాయి.

తెలుగులో వున్నవి గ్రంథస్థ పాదాలు
ఇంగ్లీషులో వున్నవి బ్రౌన్ వాక్యాలు

అందులో మొదటిది : పేర్లకు సంబంధించినది.
గ్రంథస్థ పాదాలు 1
బ్రౌన్ వాక్యాలు .

1 నాయకులను బ్రహ్మనాయడు ప్రీతి ఉచిత సంభాషణల మనిచి వేవేగ[3]

Lady Bramhi Naid paid her compliments and desired them to stop[4]

2 గురజాలలో నుండు కోడి పోరునకు పొమ్మని యనిపిన పురిలోన నేడు నాయుడు పయనమై నలిపోవుచుండు[5]

And Bramhi (the lady) is now going to the Cock fight at Guruzada[6]

3 బ్రహ్మనాయడు కంబముపాడు దాటె గోవు! నాయుని నింక గూడంగలేవు[7]

Lady Bramhi has already passed cambhampad you cannot now come up with her[8]

4 కాని దుశ్శకునముల్ కనుగొనుము బ్రహ్మనాయుడు కన్నమ నాయుని జూచి "మన మెవ్వరినైన మగుడించ మరచి రాముగదా చూడరా త్రోవవంక"[9]

B. N. (Lady) saw evil omen and spoke to her minister Kannama Naid She said. Have we omitted any one of our party[10]

5 ఊరక మగుడుట యుచితమా చెపుమ? సేవ నా ధర్మంబు చింతించి చూడ బ్రహ్మగారికి మ్రొక్కి పనివినియెదను [11]

**Is it proper for me to return without speaking to the Lady?**[12]

6 నాయురాలికి ప్రీతి నడుపంగలేము స్త్రీ నాయకంబైన చెడు నంద్రు భూమి[13]

**"Female govt. is in anspicious" This alludes to the Baroness Bramhi** [14]

7 — బ్రహ్మి నాయడు—

**Baroness Bramhi Naidu** [15]

8 — —చీలమ బ్రహ్మినాయడు

**Lady Chilama Bramhi Naid** [16]

9 కోడి మేడమునకు బ్రహ్మన్న అలంకరించుకొని వెళ్ళు వర్ణన ఉన్నచోట [17]

ఇట చీర, వడ్డాణము, జడ, బంతిపూలు మొదలైనవి బ్రహ్మన్న అలంకార వర్ణనలో కలవు. వీనినిబట్టి బ్రౌన్ బ్రహ్మిని స్త్రీ యనుకొన్నాడా? అను సందేహమునకు తావు లేదు. ఏలనన మొట్టమొదటనే బ్రహ్మినాయడని చదువగనే **'the lady Brahmi'** అని వ్రాసికొన్నాడు.

**Description of the lady appearance**[18]

10 బ్రహ్మినాయని పుంజు పోరపొమ్మంచు పంపిన [19]

**The lady ordered them to slip the birds** [20]

11 కోడిపుంజులు రెండుకూడ తెప్పించి ఈ పుంజు నాయుని పుంజు ప్రాణంబు విడువ కట్టుడా మీ నేర్పు కానంగవచ్చు అని రెండు పుంజుల నచట పోరింప [21]

**She produced a couple of birds & said this one is mine, the other is the Lady Bramhi's. Let me see if you can kill it by spells** [22]

12 దొడ్డనాయనివుత్ర...... శిష్టచారిత్ర...... నీవును నెట్ల యిన నిజమాడవలయు మాచర్లకడకు మా మానిసియేరాడు కావున మీరలే కదలిపోవలయు [23]

**Oh! you fine fellow But contess the truth then to the Lady Bramha Let the loosers depart from Macherla** [24]

13 శీలమ బ్రహ్మన శ్రీపాదయుగము కనుగొను వేడ్కతాకను మూయుకుండె[25]

**Dying he cast a glance towards his Lady** (ఇది వ్రాసి అలాగే కొట్టివేయబడింది)

**Silam Bramhaya** [26]

ఆ ప్రతిలో 146వ పేజీ తరువాత అంటే ఈ పై ఉదాహరణలో చూపించినట్లు కొట్టివేశాక బ్రహ్మనాయుడును పురుషుడు అనియే బ్రౌన్ అర్థం చేసికొన్నట్లు తరువాతి ప్రయోగాల్లో తెలుస్తుంది.

## రెండవది :

## కథలోని ఆయా పాత్రల బాంధవ్యము

1 రమణీయమైన పేరాదేవితోడ అనుచోట పేరాదేవిగూర్చి ఇట్లు వ్రాసికొన్నాడు: [27]

ఇది సరికాదు. ఏలనన పేరాంబ నలగాముని పుత్రిక.

**Then he exclaimed Lady Peramma daughter of Nayuralu & wife of Allu mallana**[28]

అటు సంధి కొరకునై అలరాజు రాగ నలగామరాజును నాయకురాలు అనుచోట [29]

**Listen Lord Nalagama Narasinga raz who was minister to Nayuralu**[30]

నరసింగరాజు నలగాము మండలేశుని తమ్ముడు. అంతేకాని నాయురాలికి మంత్రికాదు.

3 బిరుదులు తగజూచి పృథువీశ్వరుండు బాలుని బిలిపించె బాలమలిదేవువంకి దేవివారికి వరుసతో నిన్ను యిల్లడ యిస్తిని యిల్ల నెరుగ [31]

**Then Cannama bestowed on the boy all his father's trappings**[32]

అలరాజు రాయబారానికి గురజాల వెళ్ళుటకు అతని తల్లిదండ్రులు సమ్మతింపలేదు. అప్పుడు బ్రహ్మనాయుడు అలరాజుకేదైన ప్రమాదము వాటిల్లిన తన కొడుకైన బాలచంద్రుని ఇచ్చి వేస్తానని చెప్తాడు. రాయబారానికి వెళ్ళిన అలరాజు విషప్రయోగమువలన మరణిస్తాడు.

> "ఈ బిరుదులన్నియు నిలమీద నేడు
> నాకు చెలికాడును నమ్మినవాడు
> నాతోడు నీడతడు నాయుని సుతుడు
> బలువైన బిరుదులు బాలునికిమ్మ"[33]

అను నతని కోరికపై బాలచంద్రుని కిచ్చు సందర్భమది. కన్నమ బాలునికి అతని తండ్రి బిరుదులన్నియు నిచ్చినట్లు బ్రౌన్ అర్థం చేసికొన్నాడు.

ఇదే పొరబాటు మరొకచోట కూడ—

4 అలరాజుపగదీర్ప అది నాకు బార [34] (బాలచంద్రుడుబిరుదులను స్వీకరించి అలరాజు మరణమునకు ప్రతీకారముగ, అతని మరణానికి కారకులైన వారిపై పగతీర్చుదునని చెప్పు సందర్భమున)

**The young prince there said I will avenge my father's death on Camaraz and Naikralu 35**

ఇదే సందర్భంలో బాలచంద్రునికే బాలమలిదేవుడని పేరు పెట్టి మలిదేవుని సభలో మంత్రిగ పట్టాభిషేకము చేసిరనియు, అతని తల్లి వంకిదేవిని (బాలుడు కనుక) రక్షకురాలిగ నియమించి రనియు తలంచాడు.

(i) సింహాసనస్థునిగ సాధారణముగ రాజునే చేస్తారు కాని మంత్రినికాదు.

(ii) బాలమలిదేవుడన మాచర్లరాజైన పెదమలిదేవుని కనిష్ఠ సోదరుడు కాని బ్రహ్మనాయని పుత్రుడు, వంకిదేవరాజులకు ఇల్లడమీయబడ్డ బాలచంద్రుడు కాదు.

(iii) రాజమాత వీరవిజ్జలదేవి జీవించియుండగా సింహాస నమునకు రక్షకురాలిగ వంకిదేవిని నియమించు అవ సరములేదు.

(iv) రక్షకత్వము రాజు బాలుడైనపుడు ఆవశ్యకముకాని మంత్రి కూడ బాలుడైనపుడు—అవసరమా?

కానీ బ్రౌన్ వాక్యము చూడుడు—

**The boy was named Bala Malideva and throned in the court of Malideva as Minister. His mother was Vankidevi was appointed his guardian 36**

బాలచంద్రుని పేరులోను, బాలమలిదేవుని పేరులోను ముందున్న 'బాల' శబ్ద సామ్యముచే ఈ పొరపాటు దొర గారికి దొర్లి యుండవచ్చు.

5 — —

**Bramhi Naid who was the son of Anuguraz & Silamma (his mother) 37**

కొన్నిచోట్ల ఆ యా పాత్రల సంబంధాలను ఈ విధంగా నిర్ణయించాడు బ్రౌన్. బ్రహ్మనాయడు అనుగురాజు శీలమ్మల పుత్రుడని తెల్పాడు. కానీ బ్రహ్మనాయడు శీలమ్మ, దొడ్డనాయుల ద్వితీయ పుత్రుడు. దొడ్డనాయుడు అనుగురాజుకు మంత్రి.

6 — —

**Camaraz said to his minister Narasingaraj 38**

అనుగు రాజుకు మైలమదేవి వలన నలగామరాజును, భూరమాదేవి వలన కామరాజు, నరసింగరాజు, పెరుమాళ్ళ రాజు, ఋట్టిరాజు అను నల్వురు పుత్రులును, వీర విజ్జల దేవి వలన పెద మలిదేవుడు, పిన మలిదేవుడు, బాల మలి దేవుడు అను ముచ్చురు పుత్రులును కలరు. 39 ఇందు నలగామరాజు గురజాలను మలిదేవాదులు మాచర్లను పాలిం చిరి. భూరమాదేవి పుత్రులు నలగామునిని పక్షము నందే యుండిరి. కనుక నలగామునకు నరసింగుడు తమ్ముడు కాని మంత్రి కాదు. ఇది బ్రౌన్ పడిన తికమకకు నిదర్శనము.

7 — —

**The Nayuralu or lady was Nagamma, the fellow widow of Silama sani - Camaraz & Narasingaraz are her servants. 40**

ఇట నాయురాలు నాగమ్మ శీలమ సాని 'తోడి విధవ' (**fellow widow**) అనియు (నల) కామరాజును నరసింగ రాజును ఆమె భృత్యులనియు తలంచాడు బ్రౌన్. ఈ'తోడి విధవ' అననేమో దురూహ్యము. నాగమ్మ నిజముగ సర్వాధి కారి (**defacto sovereign**)అయినను, నలగాముడు నామ మాత్రపు సార్వభౌముడగును (**titular sovereign**) గాని తన మంత్రిణికి తాను భృత్యుడగుటెట్లు ?

## మూడవది :- అపార్థం చేసికొన్న అంశాలు

1 బ్రహ్మనాయని నన్ని వడివడి నడచి మ్యానుసుల్ మూకలై మగిడి వచ్చుచును ఎదుర గోపన గాంచి యెందు బోయెదవు బ్రహ్మనాయడు కంబముపాడు దాటె 41

**The messengers sent by Brahmi Naid met him & said Lady Bramhi has already passed Cambhampad 42**

ఇట 'మగిడి వచ్చు' వారు బ్రహ్మిచే పంపబడ్డ వార్తా హరులు కారు. బ్రహ్మి వెంట కొంతదూరము సాగనంప వెళ్ళి వెనుకకు తిరిగివచ్చు జనులు. పెద్దలు, అతిథులు గృహమునకు వచ్చి వెళ్ళునపుడు వారివెంట కొంతదూరము వెళ్ళి సాగనంపి వచ్చుట దేశీయమైన మర్యాద.
కాని బ్రౌన్ అవగాహనలో ఈ ఆచారము గుర్తించినట్లు వెల్లడి యగుట లేదు.

2 ధర్మమార్గము తప్పి ధరణి పాలించు పట్టభద్రునినైన పలుచ చేయుదురు న్యాయమార్గంబున నవని పాలింప పడుచు నైనను పట్టభద్రు జేయుదురు 43

**If a realm is well conducted a child can rule it. Otherwise an emperor cannot. 44**

బ్రౌన్యమున 'పడుచు' అను పదమునకు నామవాచక ప్రయోగమున **'A girl, a damsel, maiden** ఆడుపడుచు **a girl, a lone helpless woman,'** అనిపడుచు విశేషణ ప్రయోగమున **young, youth ful,** పడుచు బుద్ధి **a childish whim ...** పడుచువాడు **a boy'** అని ఉన్నది. ఇట 'పడుచు' నామవాచకమే కాని విశేషణము కాదు. కనుక 'పడుచు' అను పదమునకు 'స్త్రీ' అని బ్రౌన్ నిఘంటువు ప్రకారము స్వీకరింపవలెను. కానీ బ్రౌన్ పై

సందర్భమున ఆ అర్థము స్వీకరించక 'పసిబిడ్డ' పొందగ భావించినాడు.

3 నలగాము రాజ్యము నమ్మితిమైన నాతి గుణములె లెస్స నడవది కింక బ్రహ్మనాయని యూళ్ళ ప్రజలను మనల బవరంబు చేయించు భంగ పెట్టించు 45

**Faults & vices of Bramhi Naid 46**

బ్రహ్మనాయని దోషములు, వ్యసనములని వ్రాసికొన్నాడు బ్రౌన్. బ్రహ్మనాయుడు కోడి పందెము **నోడి** రాజ్యమును విడిచి వెళ్ళునపుడు అతని ప్రజలు అనుకొన్న మాటలివి: నలగాము పాలన క్రిందికి తేబడిన మాచర్ల ప్రజలను నాయురాలు అవమాన పరచునని తాత్పర్యము. అంటే ప్రజలన్న మాటలలో నలగాము రాజ్యమునందలి దోషములు వ్యక్తమగుచున్నవి కాని బ్రహ్మనాయని దోషములు కాదు.

4 నాయురాలికి ప్రీతి నడుపంగలేము స్త్రీ నాయకంబైన చెడు నంద్రదు భూమి 47

**"Female govt. is inanspicious" This alludes to the Baroness Bramhi 48**

నాయకురాలు నాగమ్మ పొంన నుద్దేశించి చెప్పిన మాటలివి. కానీ బ్రౌన్ తలంచినట్లు బ్రహ్మ పాలనకు సంబంధించినవి కావు. బ్రహ్మనాయనిని స్త్రీగా స్వీకరించుటవలన దొరవారికి దొరలిన ప్రమాదమై యుండవచ్చు.

5 మనకును, నలగామ మండలేశునకును విడువక రోషంబు వెలయుచు నుండు రెండిండ్లవారును రేగునుండుదురు 49

**There is an old quarrel between Bramhi Naik and (Kama Naid) Kamaraz but there is friend -ship between kamaraz and the Reddee 50**

ఇట బ్రౌన్ వ్రాసుకున్న రెండవ వాక్యమున 'రెండిండ్ల' లను పద స్వరూపము ఆ ప్రతిలో సరిగ నుండక పోవుటచే 'రెడ్ల' గా చదువుకొని యుండవచ్చును. అందువలననే 'రెడ్డి' అని భావించి పూర్వ కథలోని ఏదో అంశమును రెడ్డికి నలగామునికి స్నేహమున్నదని వ్యాఖ్యానించాడు. కానీ ఈ సందర్భమున ఆ అవగాహన పొసగదు.

6 పట్టణం బొక్కటి పాలింప రాజు లిద్దరు కలిగిన నిలయేల బ్రతుకు 51

**A servant of two masters is always unsuccess-ful 52**

ఇరువురు యజమానులను సేవించు భృతుడు కృతార్థుడు కాలేదు అని బ్రౌన్ వ్యాఖ్యానము. ఇతడు సేవక వృత్తి దృష్ట్యా పరిశీలించినాడే కాని రాష్ట్రము/ప్రజల దృష్ట్యా ఒక పట్టణమున కిరువురి ప్రభువుల పాలన అనిష్ట కారకమని వెల్లడింపలేదు.

7 అనిన శీలమ నాయుడల్లన నవ్వి తరువాత శకునంబు తగ జెప్పు మనిన 53

**At these words Silam Naid smiled & said to Silam Brahmanna tell me more omens. 54**

ఇట శీలమనాయడు శీలమ బ్రహ్మన్నతో ఇంకా కొన్ని శకునములను తెలుపుమని అడిగినాడట – అని బ్రౌన్ - బాలగోపన్న కొన్ని శకునములను వివరించిన తర్వాత, తరువాతి (next) శకునములను చెప్పుమన్నాడు బాలగోపన్నతో బ్రహ్మన్న.

కానీ శీలమనాయడు శీలమ బ్రహ్మలను వేర్వేరు వ్యక్తులుగా భావించుట పరిశీలకులకు బ్రౌన్ తికమకకు పరాకాష్ఠ అనిపింపదా ? ? ?

8 చెన్నటియైన పచ్చిక కుంట మీద భాగీరథీ నది పారిన భంగి 55

**I rejoice as a Cripple would were ganga to descend on him 56**

ప్రతిలో 'కుంట' కుంటిగా నుండుట వలన బ్రౌన్ కుంటివాడు భాగీరథి తన సన్నిధికి వచ్చినట్లుగా వ్యాఖ్యానించి యుండవచ్చు. కానీ కొన్నిచోట్ల ప్రతిలోని పాఠము సరిగ లేదని సవరించి పండితుల మెప్పు పొందిన బ్రౌన్ ఇట సవరింపలేదు. నిర్జలమైన జలాశయమునకు పుష్కలముగ గంగ లభించు పింగళి వారి (విశాలాంధ్ర ప్రతి) పై సవరణయే బాగున్నది.

9 కడి యెత్తవో గోపు కారణం బేమి ....................
కన్నమ కేదాసి గార్ల లోపలను ఒకనిగా భావించి యొప్పార నీవు నాకు ప్రసాదంబు నాయుండ పెట్టు 57

**All assembled to dine at the house of the Reddee of Palnad. But Gopu would eat noth-ing Bramhi N asked the reason He said I will eat it you will permit me to come to the cock fight 58**

భోజనమునకు పూర్వమే గోపన్న ''కోడి పందెము' నకు వచ్చుటకై బ్రహ్మన్న అనుమతించి విడియ మిచ్చినాడు. [ఈ విషయము బ్రౌన్ వ్రాసి తానే కొట్టివేసిన వాక్యముల వలన విదితము] 59 కనుక ఒకసారి అనుమతి పొందిన గోపు మరల కోడి పోరుకు రానిస్తేనే తింటాను అని అనుటలో అర్థము లేదు ప్రసాదము పెట్టుమనుటలో ఉద్దేశము వైష్ణవమును తనకీయుమను ప్రార్థన.

10 కావున పందెంబు గాదు కార్యంబు మానితివేనియు మల్ల భూపతియు రాజ్యంబులోనున్న రాజులందరును ప్రజలుమ

మిక్కిలి పరిణమింపుదురు. ఏ రీతిగానైన నీ కోడి పోరు వలదన్న .............................................. 60

**The match was between Malla Bhupati & Silam Bramhanna 61**

పందెము మల్లభూపతికి శీలము బ్రహ్మన్నకు మధ్య – అని బ్రౌన్ అర్థము చేసి కొన్నాడు. ఇది తప్పక తికమకయే. పల్నాటి వీరులలో నొకడు బ్రహ్మనతో అతడు గురజాలకు వెళ్ళునపుడు పందెము మానుమని అర్థించుచు పలికిన మాటలివి. బ్రహ్మన్న పందెము మానినచో మలిదేవుడు, అతని సామంతులు, ప్రజలు సుఖముగా నుందురని, లేకున్న (నలగామునికి మలిదేవునికి) రెండురాజ్యములకు వైరములు పెరిగి సుఖశాంతులుండవను భావముతో చెప్పిన మాటలు.

మరి బ్రౌన్ అవగాహన తప్పు త్రోవ పట్టుటకు కారణ మేదియో ?

11 తన వాని చంపిన తలవంపులాయెనని బ్రహ్మనాయుండు నాత్మలో గుంది తల్లికి మ్రొక్కడు తన మదిలోన తలచడు చెన్నుని తన రాజు గానదు కొడుకు బాలునిమీద కృప యింత లేక పళ్ళెమున గుడువడు పగలును రేయి పలుమారు లెంకకై పలువరింపుచును 62

**Bramhi Naidu was in great grief he vowed that he not salute his mother nor even the god Chennadu that he would disregard his prince. 63**

లంకన్న విరిగిన తరువాత తన వానిని, తానుండగా నల గాముడు చంపించినాడను అవమానభారముచే నిత్యముచేయు పనులను బ్రహ్మన్న (పరధ్యానముచే) మరచినాడని అర్థము చేసికోవలెను: కాని తల్లికి నమస్కరింపనని మనసులో చెన్నుని తలంపనని, పుత్రుడైన బాలుని గమనింపకూడదని బ్రౌన్ భావించినట్లు ప్రతిజ్ఞ చేయలేదు. బాలుడు బ్రౌన్ భావించినట్లు యువరాజున్ను కాడు.

12 ఘనగంగ తావచ్చి కలసిన మడుగు పొంతకు జని వీరపుంగవు లెల్ల తమ తను నామగోత్రము లుచ్చరించి తానముల్ తగ చేసి దరియందు నిలిచి నిలిపిరి లింగముల్ నియమంబు తోడ 64

**They all placed their images in the temple 65**

ఇట ప్రతివీరుడు యుద్ధభూమికి వెడలకపూర్వము స్నానము చేసి, భక్తి ప్రపత్తులతో తనపేర శివలింగమును ప్రతిష్ఠించుట సందర్భము. కానీ బ్రౌన్ చెప్పినట్లు తమ ప్రతిమలనే గుడిలో నిల్పలేదు.

13 గోపాలదేవునికి కోర్కెలింపైన గొల్లసముద్ర గోపాల నాయకులు 66

**Gopala Naik, the god of Golla Samudram 67**

గోపాల నాయకుడను గొల్ల సముద్రపు దేవుడని–బ్రౌన్ భావన. ఇందు సంక్షిప్తతా గుణమున్నది కాని అతని అవగాహనలో దోషము అస్పష్టముకాదు. ఏలనన గొల్లసముద్రము (ఊరు)నకు చెందిన గోపాల ముఖ్యులు గోపాలదేవుడైన కృష్ణునికి కోర్కెలు చెల్లించిరనునది సందర్భము.

14 యెనమండ్రు రాజులు యేబదేగురును 68 (యే బాపదేగురు అన్నది ప్రతిలో కొట్టివేయబడినది)

**the eight basons & 85 earls knights 69**

బ్రౌన్ యేబదేగురును, 85గా వ్రాసికొన్నాడు.

D 1121, B 440లో (క్రాస్ నంబరు) (పుట 346) మాత్రము "యెనుబదేగురూను......" అని యున్నది. కాని బ్రౌన్ 85 అని వ్రాసినచోట పై విధముగ 'యేబదేగురు' అని యున్నది.

## నాల్గవది :
## అపార్థమును సవరించుకొన్న అంశము

బ్రహ్మనాయుడు గోపును గురజాల కోడిపోరుకు వచ్చుట కనుమతించి విడియము ఇచ్చినచోట తాంబూలము మిచ్చుటలో భావము నీ విధముగ వ్రాసికొన్నాడు:

**Br. N. Offered the tambilam to G: which would be a dismissal from attending the cock fight**

**But he declared it & said he will make a point of witnesssing it 70**

వ్రాసి కొట్టివేయబడ్డాయి బ్రౌన్ చేతనే. ఏలనన అట తాంబూలమిచ్చుట అతని కోరికను సమ్మతించుటకు చిహ్నమే కాని తిరస్కృతికి కాదు. ఈ విషయము దొర గ్రహించి చక్కగా దిద్దుకున్నారు.

## ఐదవది: చదివేటప్పుడు బ్రౌన్‌కు చీకాకు కలిగిందేమో అనిపించే సందర్భాలు

1 గొల్లబంట్లను శిరాదేవివెంట అరణముగా తెచ్చిన సందర్భమును బ్రహ్మనకు బాలగోపన్న గుర్తుచేయు సందర్భమున ఎదురుగా బ్రౌన్

...............

మాయన్న బిరుదున్న మహిత శూరుండు నువ్వులు పాడిని గానుగనాడు భంగి చీరలో పోసియు చేర్చి పిండంగ కోపించి నీజెట్లు గొబ్బున లేచి నేడు మా ముందర నీ ప్రతాపంబు

చూపంగవలయునా? సోమించి మించి మా తోడ చెయ్యిచ్చి
మగటిమి మించి...................
.................... .........[71]

ఇలా సాగినచోట
ఇది ఏమి భాష?? అని బ్రౌను అనిపించింది.

**and you streamed your wondrous strength of grip**
**What language is this??[72]**

ఇట్లే

2 D. 1139 B. 434 ప్రతిలో మొదటనున్న భాగాన్ని (బ్రహ్మనాయని దైవకాంశను గూర్చినది) గూర్చి
**"The introduction is mere mythological rubbish imitated from the Uttara Ramayan—"**
అని వ్రాసికొన్నాడు.
బ్రహ్మనాయని దేవాంశ సంభూతునిగా వర్ణించు భాగము ఇతనికి పౌరాణికపు చెత్త అని అనిపించింది.

బ్రౌన్ పార్శ్వటీక **(marginal notes)**ను చదువుతుంటే అక్కడక్కడా అతడు అసమగ్ర పదాలను పరిష్కరించి పండితులతో చెప్పి వారి మోదమును పొందినట్లు తెలుస్తుంది. అంతేకాక కీ. శే. పింగళి లక్ష్మీకాంతంగారు పలనాటి వీరచరిత్రను (విశాలాంధ్ర ప్రతి) పరిష్కరింపక పూర్వము కోడిపోరుతో మొదలైన (D. 1130 ప్రతి) ప్రతిని చూచినట్లు పీఠికలో చెప్పుకొన్నారు.[73] కానీ బ్రౌన్ సంస్కరించిన పదాలు స్వీకరించినట్లు చెప్పుకొనలేదు. ఈ క్రింది ఉదాహరణలు ఆ సందేహాన్ని తీర్చగలవు. (అ) బ్రౌన్ చూచిన ప్రతిలోని పాఠము (ఆ) బ్రౌన్ సవరణ (ఇ) పింగళివారి ప్రతిలోని పాఠము

1 (అ) నయము లేకంతట నడరగ జూచు
(ఆ) నను వు లేకంతట నడరంగ ప్రజలు
**'This is my correction&greatly applanded"[74]**
(ఇ) నయము లేకంతట నడరుచు ప్రజలు

'జూచు' అన్న పదమునకు బదులుగ 'ప్రజలు' అన్న పదాన్ని బ్రౌన్ సూచించాడు. దానిని మాత్రము పింగళివారు స్వీకరించారు.

అట్లే
(అ) నబి దగ్గఱనున్న నాగంబు నిద్ర
(ఆ) నాభి బదులు నబి అని ఉన్నదని బ్రౌన్— **nabi for nabhi**
(ఇ) నాభి దగ్గరనున్న నాగంబు నిద్ర[75]

'నబి' అనే పదము 'నాభి'యై యుండునని ఊహించిన వాడు బ్రౌన్. ఇది ధారాళంగా స్వీకరించారు కీ. శే. పింగళి.

మరొకచోట
(అ) కెంబట్టు చీరలు.........
(ఆ) కంబళి చీరలు.........
**This** కంబళి **is my guess and is greatly applanded[76]**
(ఇ) కంబళి చీరలు గవిసెనకట్టి

ఇంకొకచోట
(అ) ———చెలువంపు ఒరుగులు తీర్చి
(ఆ) ——————— టొరుగులు———
**It should be** టొరుగులు **& renders Orugallu pillows — He is wrong I believe[77]**
(ఇ) ———చెలునంపు టొరుగులు తీర్చి

మరియొకచోట
(అ) నలగామ రాజు దా ఫంజాలలోన
గర్తగా జేశేటి కాళింది భూమి
(ఆ) ఫంజు అనే దానికి ఎదురుగా బ్రౌన్ **'Fouji-an army'** 'ఫౌజీ—ఒక సైన్యము' అని వ్రాసుకున్నాడు.
(ఇ) పట్టణంబున గల ఫౌజుల కెల్లను కర్తగా చేసెను కాళింది విభుని[78]

'ఫంజు' అనే పదాన్ని చదువగనే బ్రౌన్ స్మృతిలో నిలచిన ఫౌజీ అనే శబ్దాన్ని తమ పరిష్కరణలో పింగళివారుపయోగించుకున్నారనిపించును.

బ్రౌన్ ప్రథమ పఠనాన్నిపూర్తిచేసిన తేదీ29–5–1843. విశాలాంధ్ర ప్రతి ప్రచురణ మార్చి 1961.[79]

ఇందు కొన్ని బ్రౌన్. పండితుని ప్రథమ పఠనంలో కనుపించు నీలినీడలు. బహుశా రెండవసారి ఆ ప్రతినే చదివి ఉంటే ఆ దోషములను బ్రౌన్ సవరించుకొని యుండెడివాడే.

ఇంతమాత్రమే చెప్పకొనవలెను కాని ఈ వ్యాసము బ్రౌన్ దొర పాండిత్యమును శంకించుటకుద్దేశింపబడినదికాదు.
'ప్రమాదో ధీమతామ్ అపి'.

★ ★ ★

గమనిక:— 1. ఈ పరిశీలన సమగ్రమని చెప్పజాలను. ఏలనన నా ఆసక్తి రాజనీతికి చెందిన అంశములపై కనుక నా దృష్టి నధిగమించిన విషయములు విశేషములింకను ఉండవచ్చును. అది భావి పరిశోధకుల విధి.

2. విశాలాంధ్ర ప్రతికి D. 1130 ప్రతిలోని భాగమునకు భేదములున్నచోట్ల మాత్రమే కాగితపు ప్రతిలోని భాగమీయబడినది. తదితర సందర్భములలో విశాలాంధ్ర ప్రచురణలోని భాగము సూచించడమైనది.

## అథోజ్ఞాపికలు

1 పలనాటి వీర చరిత్ర, పింగళి లక్ష్మీకాంతము పరిష్కరణ, విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1961.

2 బ్రౌన్ పార్శ్వటీకలన్నీ (కొన్ని అక్కడక్కడ సూచించిన చోట తప్ప) D 1130 కాగితపు ప్రతి, పలనాటి వీర గాథలు, మదరాసు ప్రభుత్వ ప్రాచ్య భాండాగారము లోనివే.

కనుక పుట సంఖ్య మాత్రమే ఇచ్చుచున్నాను. ఇట గ్రహింప వలసినది 28 వ పుట తర్వాత ఆ ప్రతిలో క్రమముగ పుట సంఖ్యలు గుర్తింపబడలేదు. కనుక వరుసగా లెక్కించి నేనే వేసికొన్నాను.

3 ప. వీ. చ. పు. 89/పాదములు 85-86
4 పు. 5
5 ప. వీ. చ. 89–90/109-111
6 పు. 6
7 ప. వీ. చ. 90/125 127
8 పు. 7
9 ప. వీ. చ. 90/132–135
10 పు. 7
11 ప. వీ. చ. 92/168–170
12 పు. 9
13 ప. వీ. చ. 110/681–682
14 పు. 32
15 పు. 33
16 పు. 46
17 ప. వీ. చ. 140/1525–1542
18 పు. 80
19 పు. 108
20 అదే.
21 ప. వీ. చ. 147/1741-1745
22 పు. 121
23 ప. వీ. చ. 152/1874–1882
24 పు. 127
25 ప. వీ. చ. 164/2205–2206
26 పు. 146
27 ప. వీ. చ 278–541
28 పు, 178
29 ప. వీ. చ. 278/549–550
30 పు. 178
31 పు. 190
32 అదే
33 ప. వీ. చ. 281/621–624
34 పు. 191
35 అదే
36 పు. 190
37 పు. 217
38 పు. 274
39 చూడుడు : వంశక్రమ పట్టికలు, 4, 5, 6, పుటలు 36 – 38 డాక్టర్ తంగిరాల సుబ్బారావు, జానపద సాహిత్యము వీరగాథలు, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ, 1975.
40 పు. 275
41 ప. వీ. చ. 90/124–127
42 పు. 7
43 ప. వీ. చ. 94/230–233
44 పు. 11
45 ప. వీ చ. 108/641–644
46 పు. 30
47 ప. వీ. చ. 110/681–682
48 పు. 32
49 ప.వీ.చ. 110/690–692
50 పు. 32
51 ప.వీ.చ. 110/700–701
52 పు. 33
53 ప.వీ.చ. 111/704–705
54 పు. 33
55 ప.వీ.చ. 118/917-918
56 పు. 44
57 ప.వీ.చ. 124–125/1078–1098
58 పు. 56
59 పు. 42
60 ప.వీ.చ. 126/1152–1156
61 పు. 58
62 ప.వీ.చ. 220/4–10
63 పు. 194
64 ప.వీ.చ. 315–316/632–636
65 పు. 427
66 పు. 428
67 అదే
68 పు. 436
69 అదే
70 పైన 59
71 ప. వీ. చ. 101–102/439–473
72 పు 20
73 ప. వీ. చ. పీఠిక. పు **XV–XVii**
74 పు. 31; ప. వీ. చ. 109/663
75 పు. 40; ప. వీ. చ. 115/831
76 పు. 77; ప. వీ. చ. 136/1416
77 పు. 77; ప. వీ చ. 136/1421
78 పు. 71; ప. వీ. చ. 134/1375–76
79 **D.** 1130 కాగితము ప్రతిచివరిపేజీ, పద్యభాగము క్రింద.

# మూడు పువ్వు లారు కాయలు

సమ సమాజ లక్ష్యసిద్ధికి చేపట్టిన
చేపట్టనున్న అభివృద్ధి కార్యకలాపాలు శరవేగంతో
సాగుతున్నాయి
కోటి గొంతుల్లో కొత్త పల్లవి మ్రోగింది
ప్రగతి గీతికి ప్రజల అనుపల్లవ సాగింది
బలహీన వర్గాల బతుకు పొలాలు పండడానికి
బడ్జెట్ పద్దు పెంచారు
యీ యేటి ప్రణాళిక పెట్టుబడి రూ. **380.38** కోట్లు
ఇందునా నాగేటి రైతుకే పెద్దపేరు
ఎక్కువ దిగుబడి వంగడాలు ప్రాకాయి ప్రతిచోట
ఎలుకల నిర్మూలన, ఎరువుల వాడకం, తెగుళ్ల మాపకం
- ఇదంతా ప్రకృతి మీద అంతులేని పోరాటం.
మరో **55,270** హెక్టార్ల భూమి నీటిసాగు చేరుగవుతుంది
సేద్యపు నీటిపారుదల అభివృద్ధి సంస్థ ఎన్నో పథకాలు
చేపడుతోంది
యీయేటి పరిశ్రామల రంగంలో రూ.**8.03** కోట్లు వెచ్చిస్తారు
గత యేటికన్నా యిది **50** లక్షలు మిన్న
ప్రగతి చక్ర పరిభ్రమణం తెనుగునాట కొత్తవేగం పుంజు
కుంటుంది.

జారీ చేసినవారు,
సమాచార పౌరసంబంధశాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాద్.

4/77-7

# కన్నడ సాహిత్య చరిత్ర - ఒక సమీక్ష

'భాషలు భిన్నమైననూ

భారతీయ సాహిత్యము ఒక్కటే'

అన్న వాక్యం అక్షరాలా సార్థకమైనది. భారతీయ భాషా సాహిత్యాల మధ్య ఆదానప్రదానాలు అనాదిగ సాగుతూనే వున్నాయి. జాతీయ సమైక్యతను ప్రబోధించే లక్ష్యంతో కేంద్ర, రాష్ట్ర సాహిత్య అకాడమీలు విభిన్న భారతీయ సాహిత్య చరిత్రలను ప్రచురించి సాహిత్యప్రియుల మన్నన అందుకొన్నాయి.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ యిదివరకే దక్షిణభారత సాహిత్యములు, ఉత్తరభారత సాహిత్యములు, ఉర్దూ సాహిత్య చరిత్ర అను మూడు సంపుటాలను ప్రచురించి, ఆయా సాహిత్యాల స్థూల పరిచయానికి దోహదం చేసింది.

విపులమైన సాహిత్య చరిత్రలను తెలుగు పాఠకులకు లభింప జేయవలెనన్న వుద్దేశంతో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి యిటీవలనే తమిళసాహిత్యచరిత్ర సంపుటాన్ని వెలువరించింది. ప్రస్తుతం కన్నడ సాహిత్య చరిత్రను ప్రచురించినారు. ఈ గ్రంథమును రచించినవారు, డాక్టర్ ఆర్వీయస్. సుందరం. తెలుగు, కన్నడ భాషలలో చక్కని పాండిత్యమును సంపాదించుకొన్న డా. సుందరం గారు మైసూరు విశ్వవిద్యాలయములో ఆంధ్ర భాషోపన్యాసకులుగ పనిచేస్తున్నారు. వీరు తెలుగు, కన్నడ జానపద గేయాలపై సిద్ధాంత వ్యాసమును రచించి మైసూరు విశ్వవిద్యాలయమునుండి డాక్టరేట్ పట్టా పుచ్చుకొన్నారు. డా. సుందరంగారు తమ కన్నడ సాహిత్య చరిత్రలో—తెలుగు, కన్నడముల బాంధవ్యాన్ని సందర్భానుకూలంగా, సముచితంగా వివరించి తెలుగువారి కృతజ్ఞతకు అర్హులయ్యారు.

దాక్షిణాత్య భాషలలో తెలుగు కన్నడముల చుట్టరికము సన్నిహితమైనది. శాతవాహనులు, చాళుక్యులు, రాష్ట్ర కూటులు, చోళులు, కాకతీయులు, విజయనగర రాజులు మున్నగు వారి కాలము నుండి నేటి వరకు యీ బాంధవ్యం సాగుతూనే వుంది.

తెలుగు కన్నడములు భౌగోళికంగా యిరుగు పొరుగు భాషలు. ఈ రెండు భాషల లిపులు దాదాపు ఒకే రీతిగ వున్నాయి. తెలుగు సాహిత్యం వైదిక మతప్రభావంతో పెరిగింది. కన్నడ సాహిత్యం తొలిదశలో జైనమత ప్రభావంతో పెరిగింది. ఈ రెండు భాషలు సంస్కృత, ప్రాకృతములచే ప్రభావితమైనవే.

డా. సుందరంగారు కన్నడ సాహిత్య చరిత్రను ప్రాచీన యుగం, పంప యుగం, బసవ యుగం, కుమారవ్యాస యుగం, చిక్కదేవరాయయుగం, ఆధునికయుగం అని ప్రధానంగా విభజించారు. ఆధునికయుగం తర్వాత కన్నడ సాహిత్య ప్రక్రియలలో ప్రధానమైన చంపూ సాహిత్యం, వచన సాహిత్యం, షట్పది సాహిత్యం, జానపద సాహిత్యం, ఉపసంహారము అను భాగాలను చేర్చినారు.

కన్నడ భాషోత్పత్తికాలం, సాహిత్యోదయకాలం యిదమిత్థంగా యింతవరకు నిర్ణయింపబడలేదు. హాలునిచే సంకలితమైన గాథా సప్తశతిలో తెలుగు పదాలున్నాయని తెలుగు భాషాభిజ్ఞులు అంటే కన్నడ పదాలున్నాయని కన్నడ పండితులు అభిప్రాయపడుతున్నారు. బౌద్ధమతం కన్నడ దేశంలో బాగా వ్యాపించి యుండినది. అశోకుని శాసన మొకటి, యీనాటికీ బళ్ళారికి ముప్పదిమైళ్ళ దూరములో నున్న సిద్దాపురంలో సురక్షితంగా వుంది.

కన్నడ సాహిత్య చరిత్రలో 'హల్మిడి' శాసనం అతి ప్రాచీనమైనది. ఈ శాసనం క్రీ. శ. 450కి చెందినదని కన్నడభాషావేత్తల అభిమతం. ఈ శాసనములోని భాష కన్నడమైనా సంస్కృత పదాలే ఎక్కువగా వున్నాయి. ఇది వరకు లభించిన తెలుగు శాసనాలలో మొదటిదిగ భావింపబడుతున్న కలమళ్ళ శాసనం 6వ శతాబ్దికి చెందినది. క్రీ. శ. అయిదారు శతబ్దాల వరకు, తెలుగు, కన్నడములకు అప్పట్లో వాడుకలో వుండిన బ్రహ్మలిపినే కొద్ది మార్పులతో తెలుగువారు కన్నడిగులు వాడుకొనేవారని, పన్నెండో శతాబ్దం తర్వాత కన్నడ లిపి నుండి తెలుగు లిపి విడివడిందని భాషావేత్తల అభిప్రాయం.

కన్నడములో యిప్పటివరకు లభించిన గ్రంథాలలో 'కవిరాజమార్గ' అతి ప్రాచీనమైనది. మూడు పరిచ్ఛేదాల అలంకార గ్రంథమిది. 'నృపతుంగ దేవానుమతమప్ప కవిరాజ మార్గదొళ్' అను ఆశ్వాసాంత మందలి గద్యననుసరించిచూచిన రాష్ట్రకూట రాజైన నృపతుంగ అమోఘవర్షుని (క్రీ. శ. 814–877) కాలమున వెలువడిందని చెప్పవచ్చును. నృపతుంగుని ఆస్థాన కవియైన శ్రీ విజయుడు 'కవిరాజ మార్గకర్త'యని నిర్ణయింపబడింది. డా. సుందరం గారు క్రీ. శ. 850లో రచింపబడిన కడపజిల్లా దానవులపాడు శాసనంలోని, విజయదండనాథుడే శ్రీ విజయుడా అన్న సందేహాన్ని ప్రకటించినారు. ఇది పరిశీలింపదగిన విషయము.

'కవిరాజ మార్గకర్త' కన్నడనాడు, నుడి, సంస్కృతిని గురించి పెక్కు విషయాలను వర్ణించినాడు. కన్నడ నాడు కావేరి నుండి గోదావరి వరకు వ్యాపించి యుండినట్లు పేర్కొన్నాడు కన్నడం మాట్లాడే ప్రదేశాలను వివరిస్తూ :

'కావేరి యింద మా గో
దావరి వరమిర్ప నాడదా కన్నడ దొళ్
భావిసిద జనపదం' అన్నాడు.

'కవిరాజమార్గ' కాలానికి, కన్నడిగు ఆదికవియగు పంపకవి కాలానికి మధ్య, అసగకవి (క్రీ. శ 853) గుణనంది (క్రీ. శ 900) గుణవర్మ (క్రీ. శ. 900) అను కవులుండిరి.

పంపపూర్వ యుగమునకు చెందిన కవులలో శివకోట్యాచార్యుడను జైనకవి ప్రసిద్ధుడు. ఇతని రచనలలో మేటిది 'వడ్డారాధనె'. అత్యంత ప్రాచీనమైన యీ గ్రంధములో సుకుమార స్వామి మొదలు వృషభసేనుని వరకు పందొమ్మిది మంది జైన మునుల కథలున్నాయి. 'వడ్డారాధనె' కు 'ఉపసర్గకావలుల కథె' అన్న మరొక పేరున్నది. వైరాగ్యాన్ని, మనోరంజకత్వాన్ని మేళవించి రచించిన యీ గద్యకృతి సమకాలీన ప్రజాజీవితానికి అద్దం పట్టింది.

కన్నడ ఆదికవియైన పంపకవి యుగకర్తగ వెలిగినవాడు. పంపయుగం క్రీ.శ. 940 నుండి క్రీ.శ. 1150 వరకు విస్తరించింది. పంపకవి పూర్వీకులు వేంగి మండలమునుండి వలస పోయినవారు. ఈతని ముత్తాత తండ్రియైన మాధవ సోమయాజి యజ్ఞయాగాదులను చేసినవాడు. మాధవ సోమయాజి కొడుకు అభిమాన చంద్రుడు. ఇతని కొడుకు కొమరయ్య. కొమరయ్య కుమారుడగు భీమపయ్య పుత్రుడే 'కవితాగుణార్ణవ' బిరుదాంకితుడైన పంపమహాకవి. పంపకవితమ్ముడు 'జినవల్లభుడు' (క్రీ.శ.941) ఇతడు రచించిన శాసనములో కన్నడ పద్యాలతోపాటు, తెలుగు కంద పద్యాలు చోటు చేసుకున్నవి. ఆనాటి తెలుగు కన్నడ భాషా బాంధవ్యానికి యీ శాసనము నిదర్శనమని చెప్పవచ్చును. ఈ గ్రంధ కర్త, పంపకవి తండ్రి తాతలు తెలుగువారే అని చెప్పుకున్నా పరవా లేదు అంటూ, అతని తల్లి అచ్చంగా కన్నడ దేశానికి చెందిన ఆడపడుచు అన్నారు. ఆమె ధారవాడ జిల్లాకు చెందిన అణ్ణిగెరె జోయిన సింధుని మనమరాలైన 'అబ్బణబ్బె' అన్నారు.

పంపకవి చాళక్యరాజైన రెండవ అరికేసరి ఆస్థానమున వుండినవాడు. అతడు మహామంత్రిగనే కాక, మహావీరుడుగ అరికేసరితోపాటు యుద్ధములో పాల్గొన్నట్లు తెలియుచున్నది. ఈ విషయములో పంపకవి తిక్కనామాత్యునికి దీటైనవాడనవచ్చును. పంపకవి రచనలలో ప్రధానమైనవి 'ఆదిపురాణ', 'విక్రమార్జున విజయ' కావ్యాలు. ఆదిపురాణ జైన తీర్థంకరుల జీవిత గాధలతో కూడుకొన్న ధార్మిక కావ్యము. పంపకవికి ఆశ్రయమిచ్చిన అరికేసరిని అర్జునునికి పోల్చి వ్రాసిన మహత్కావ్యము 'విక్రమార్జున విజయ.' వ్యాస భారతములో కృష్ణుడు ప్రధాన పాత్రధారి అయితే, పంపభారతములో 'అర్జునుడు' నాయకుడైనాడు. పంపకవి తనకు ప్రధానంగా తోచిన పాత్రలను గురించి చెబుతూ—

'ఛలదొళ్ దుర్యోధనం, నన్ని యొళిన తనయల
గండినొళ్ భీమసేనం
బలదొళ్ మద్రేశ నత్యున్నతి యొళమర
సింధూద్భవం, చాపవిద్యా
బలదొళ్ కుంభోద్భవం సాహసద మహమె
యొళో ఫల్గుణం ధర్మదొళ్ ని
ర్మల చిత్తం ధర్మపుత్రం మిగిలె వర్గళి నీ
భారతం లోకపూజ్యం.'

(ఛలంలో దుర్యోధనుడు, స్నేహంలో కర్ణుడు, శౌర్యంలో భీమసేనుడు, బలంలో మద్రేశుడు, అత్యున్నతిలో భీష్ముడు, చాప విద్యాబలంలో ద్రోణుడు, సాహసమటామలో ఫల్గుణుడు, ధర్మంలో ధర్మరాజు గొప్పవారు. వీరివల్లనే భారతము లోకపూజ్యమైనది)

పంపకవి సృష్టించిన భారత పాత్రలు మూలమునకు భిన్నంగా కానవస్తాయి. దుర్యోధనుడిపై పంపకవికి ఎంతో అభిమానముంది.

పంపకవి సృష్టించిన కర్ణుడు త్యాగానికి, స్నేహానికి ప్రతిరూపంగా వున్నాడు. భారతాన్ని 'కర్ణరసాయనమల్తె' కర్ణరసాయన మనదగునని చాటిసమేటి కవి పంప.

పంపకవి ప్రభావం మన నన్నయపై పడినదని పరిశోధకుల అభిప్రాయము. ఈ వాదము సత్యపూర్ణమైనది. మరికొంత విపులపరిశోధనము జరుపుట అవసరము.

పంపకవితోపాటు పొన్న, రన్న అను కవులనుచేర్చి రత్నత్రయముగా గౌరవించుట జరుగుచున్నది. పొన్న కవి, సంస్కృతములోను, కన్నడములోను ప్రగాఢ పాండిత్యమును సంపాదించి 'ఉభయకవి చక్రవర్తి' బిరుదుమందుకొన్నవాడు. క్రీ. శ. 950కి చెందిన పొన్నకవి చిత్తూరుజిల్లా పుంగనూరులో జన్మించినట్లు చెప్పుకొన్నాడు.

కం. "పుట్టు దొరుపుంగ నూరొడ
పుట్టుదు దపరిమిత........."

పొన్నకవి రాష్ట్రకూట చక్రవర్తి అయిన మూడవ కృష్ణుని (క్రీ. శ 930-968) ఆస్థానమున వుండినవాడు. ఈతడు తన ఆశ్రయ దాతను కీర్తిస్తూ— 'భువనైక రామాభ్యుదయ' కావ్యాన్ని రచించాడు. ఈ కావ్య మిదివరకు లభ్యం కాలేదు. 'శాంతిపురాణ' యితని కావ్యాలలో ప్రశస్తమైనది, ఇది జైన తీర్థంకరుల గాథ. పై రెండేకాక అతని రచనలలో 'జినాక్షరమాలె' అను 39 పద్యాల లఘుకృతి యొకటి లభించినది. 'దాన చింతామణి' అను పేరు గాంచిన అత్తిమబ్బె శాంతి పురాణానికి వేయి ప్రతులు తయారుచేయించి పంచిపెట్టినదట.

రత్నత్రయములో చివరివాడైన శక్తికవిరన్న కూడ జిన మతానుయాయుడే. సంస్కృత, కన్నడములో గొప్ప పండితుడైన రన్నకవి (క్రీ.శ. 993) కూడ ఒక జైన పురాణాన్ని, ఒక లౌకిక కావ్యాన్ని రచించాడు. 'అజితపురాణ' అతని ధార్మిక కృతి. కన్నడ సాహిత్యములో ఆణిముత్యము అనిపించుకొన్న 'గదాయుద్ధ' కావ్యము యీ కవిని చిరంజీవ మొనర్చింది. రన్నకవి శబ్దానుశాసన ప్రభవ వచో విభవుడూ, అభిమత జైనేంద్ర వచో విభవుడే కాక ఉభయ వ్యాకరణ పండితుడు కూడ. కళ్యాణ చాళుక్య రాజైన ఆహవమల్ల తైలపుని ఆస్థానములోను, అతని కుమారుడైన సత్యాశ్రయుని వద్దను వుండినవాడు. 'గదాయుద్ధ'లోని సాహసభీముడు రన్నకవికి ఆశ్రయమిచ్చిన సత్యాశ్రయుడే. ఈ కావ్యానికి మరొకపేరు

'సాహసభీమవిజయ'. విక్రమార్జున విజయ నాయకుడు అర్జునుడు కాగా, సాహస భీమవిజయ నాయకుడు భీమసేనుడు. గదాయుద్ధ కావ్యములో ఆధునిక నవల లక్షణాలు, నాటక లక్షణాలు అందంగా మిళితమై వున్నాయి. రసవత్తరమైన సన్నివేశాలెన్నో యీ కావ్యమున మనల నాకర్షిస్తాయి. వైశంపాయన సరోవరములో దుర్యోధనుడు దాగివున్నపుడు అర్జునాదులు పలుమార్లు పిలచినా, ఎగతాళి చేసినా వెలుపలికి రాలేదు. అప్పుడు భీముడు 'నీళ్లలో చేపవలె యీ కొలనులో మునిగి వున్నావుకదా, అక్కటా ! దుర్యోధనుడన్న నీ పేరుకే యిది అవమానం. నీ బలమెంతటిదని నిరూపించావు. ఛీ, ఛీ, నీవు చస్తే ఎంత, బ్రతికితే ఎంత. ఇదిగో కురుకుల మథనోద్భీకరుడైన భీముడు వచ్చినాడు అంటాడు. భీముని కంఠీరవ రవమును విని కోపారుణ నేత్రుడైన దుర్యోధనుడు నీటిలోకూడా చెమటలు కక్కినాడని, రన్నకవి వర్ణించిన తీరు ప్రశస్తమైనది.

''ఆరవముం నిర్జిత కం
ఠీరవ రవమం నిరస్త ఘనరవమంకో
పారుణ నేత్రం కేళ్దా
నీరొళగిర్దుం బెమర్తనురగ పతాకం'

రన్నకవి గదాయుద్ధ కావ్యమున, నన్నెచోడ నాచనసోమనల రసావేశమేకాక తిక్కన నాటకీయత రసప్లావితంగా మిళితమై యున్నది.

పంప, పొన్న, రన్న కవులు కన్నడ కవి రత్నత్రయంగా విఖ్యాతులై కన్నడ సాహిత్యమును సుసంపన్న మొనర్చారు.

పంప యుగమున వెలసిన పెక్కురు కవులలో చాముండ రాయ, ఒకటవ నాగవర్మ గజాంకుశుడు, చంద్రరాజు, దుర్గసింహ, రెండవ నాగవర్మ ప్రసిద్ధులు. ఈ యుగానికే చెందిన నాగచంద్రుడను కవి పంప రామాయణమును రచించాడు. కవయిత్రి 'కంతి' 'కంతి హంపన సమస్యెగళు' అను కావ్యమును రచించింది.

పంపయుగాన్ని జైనయుగమని కూడ కన్నడ పండితులు పేర్కొంటారు. రామాయణ మహాభారతాలేకాక, పెక్కు జైన పురాణాలు వెలువడిన కాలమది. తెలుగు—కన్నడ సాహిత్య బాంధవ్యానికి గట్టి పునాదులు వేయబడినదీకాలములోనే అని చెప్పవచ్చును.

తెలుగు సాహిత్యములో శివకవుల యుగమువలె 'బసవ యుగము' విశిష్టమైనది. దీనినే హరిహర యుగమని కూడా పేర్కొంటారు. నిరాభరణ సుందరి వంటి వచన వాఙ్మయము మొగ్గవేసినదీకాలములోనే. ఈ యుగ కర్తగ ప్రసిద్ధుడైన మహనీయుడు బసవణ్ణ. బసవనకు ముందే దేవరదాసమయ్య ప్రభుదేవ (అల్లమప్రభు) మున్నగువారు వచన రచన చేశారు. శ్రీ వైష్ణవుల తేవారములవలె వీరశైవకవుల వచనములు ప్రజాబాహుళ్యమున కెంతగానో నచ్చినవి.

బసవన (క్రీ. శ. 1132 – 1160) సాహిత్యయుగ ప్రవర్తకుడేకాక, వీరశైవ మతోద్ధారకుడు, రాజనీతి విశారదుడు, భక్త కవిశేఖరుడు. బాగెవాడి అగ్రహారంలో మాదిరాజు మాదాంబికె అను బ్రాహ్మణ దంపతులకు జన్మించిన బసవన వైదికమతాన్ని వదలి, శివభక్తి ప్రధానమైన వీరశైవము నవలంబించాడు.

బసవ వచనాలు సదాచార స్మృతులు. ఆయన బహుముఖ ప్రతిభ వీటిలో వ్యక్తమవుతున్నది. కులతత్వాన్ని నిర్మూలింపయత్నించి శివభక్తులందరిదీ ఒకటే కులమన్నాడు.

'సెట్టియందు నా సిరియాళుని ?
మడివేలందు నా మాచయ్యను ?
మాలవాడందు నా కక్కయ్యను
మాదిగయందు నా చెన్నయ్యను ?
నేను బాపడనినచో కూడల సంగయ్య నవ్వునయ్యా,

అన్నాడు.

'దయయే ధర్మద మూలవయ్యా' అన్న మానవతావాది ఆయన. దేవలోక, మర్త్యలోకములు వేరు కాదంటూ —

సత్యము చెప్పనదే దేవలోకము
మిథ్య యనునదే మర్త్యలోకము
ఆచారమే స్వర్గము, అనాచారమే నరకము'

అన్నాడు.

శ్రమ విలువను గుర్తించమని చెబుతూ 'కాయకవె కైలాస' (కష్టించి పనిచేయటమే కైలాసము) అన్నాడు.

వచన కవితలల్లిన భక్త కవయిత్రులలో అక్క మహాదేవి అగ్రగణ్యురాలు. కామాతురుడైన కౌశికుడనే రాజు బలవంతంగా యీమెను పెళ్ళిచేసుకొంటాడు. తన శివపూజకు మూడు సార్లకంటె ఎక్కువగా విఘ్నమైతే రాజును వదలివేస్తాననే షరతుపై అతనిని వివాహమాడుతుంది. భర్త వచన భ్రష్టుడయ్యాడు. అక్క సర్వసంగ పరిత్యాగియై కళ్యాణనగరముచేరి అల్లమ ప్రభువు అధ్యక్షుడుగా వుండిన అనుభవ మంటపమున సభ్యురాలై అందరి మన్నన లందుకొన్నది. ''ఎన్నదేవ మల్లికార్జున నల్లదె, అన్యర్కెళసువదె నన్నమన్న'' (నా దేవుడైన మల్లికార్జునుని కాక, అన్యాని కాతురతపడుతుందా ? నా మనస్సు ?) అన్న శివశరణురాలు అక్క మహాదేవి. అక్క వచనాలు ఆమె హృదయాంతరాళమునుండి వెలువడిన భావ పయోధారలు అనుటలో అతిశయోక్తి ఆవంతైనాలేదు.

బసవ మేనల్లుడైన చెన్నబసవన్న పెక్కు వచనాలనేకాక 'మంత్రగోప్య, మిశ్రగోప్య' అను శాస్త్ర గ్రంథాలను రచించాడు. సామాజిక పరివర్తనకోసం బసవేశ్వరునితోపాటు కృషి చేసిన సంఘ సంస్కర్త చెన్నబసవన్న. సాహిత్యంలోనేకాక సమాజంలోకూడ విప్లవభావాలు చెలరేగిన కాలమది.

బసవన యుగములో దేశి, మార్గ సాహిత్యాలకు సమానంగ సేవ చేసిన మహాకవి హరిహరుడు. 'రగడ' ఛందస్సుకు వూపిరి పోసినవాడీకవి. ఈతని 'రగళె' (రగడ) కావ్యాలలో బసవరాజ 'దేవర రగళె' అత్యంత శ్రేష్ఠమైనది. హరిహరుడు గిరిజా కళ్యాణ

మనే మహా ప్రబంధాన్ని రచించాడు. హరిహరుడు మేనల్లుడైన రాఘవాంక కవి శివకవులలో విఖ్యాతుడు. ఈతని 'హరిశ్చంద్రకావ్య' కన్నడ కావ్యములలో ఉత్తమ శ్రేణికి చెందినదిగా పేర్కొన బడింది. కెరెయ పద్మరస, నేమిచంద్ర, రుద్రభట్ట, జన్న, అండయ్య అను కవులు గణింపదగినవారు. రుద్రభట్టు రచించిన 'జగన్నాథ విజయ' ఆధారంగా ముక్కు తిమ్మన పారిజాతాపహరణ మందలి కొన్ని ఆశ్వాసాలు రచింపబడినవి.

క్రీ. శ. 1250కి చెందిన మల్లికార్జునకవి సూక్తసుధార్ణ వమును రచించాడు. ప్రతక్ష భృంగీశావతర, జైనమస్తక విన్యస్త శాతశూల మొదలైన బిరుదములచే భూషితుడైన పాల్కురికి సోమనాథుడు (క్రీ. శ. 1260–1320) తెలుగు కన్నడము లలో 'దశవిధ పాదోదకవివర, హరగణమాలె, బసవరగళె' అను కృతులను రచించాడు. ఆంధ్రుడైన పాల్కురికి సోమనాథునిపై కన్నడములో పురాణమే వెలువడింది. కన్నడిగులు బక్త శైవాచార్య త్రయంగా, భక్తితో స్మరించు శ్రీపతి పండితుడు, మల్లికార్జున పండితుడు, శివలెంక మంచన పండితుడు ముగ్గురూ తెలుగునారే.

పంప బసవన్నల తర్వాత కన్నడ సాహిత్య యుగకర్తలలో మేటివాడు కుమారవ్యాసుడు. హరిదాస సాహిత్యోద మీా కాలమందే జరిగింది. శివభక్తి ప్రచార ప్రాధాన్యం తగ్గి విష్ణుభక్తి ప్రచారము ఎక్కువైంది.' కుమార వ్యాసముని' యనిపించుకొన్న యీా భక్తకవి క్రీ.శ.1400–30 ప్రాంతమువాడని చెప్పవచ్చును. ఈ మహాకవి ప్రభావం దాదాపు అయిదువందల సంవత్సరాలపాటు అవ్య టాతంగా కన్నడ సాహిత్యంలో సాగింది. మన పోతన శ్రీరామ చంద్ర కృపా కటాక్షముతో భాగవతమును రచించినరీతిగా, కుమార వ్యాసకవి గదగులో వేంచేసియున్న వీరనారాయణస్వామి అనుగ్రహ ముతో తన భారతరచనను పూర్తిచేసినట్లు తాను 'లిపికార' నని చెప్పుకొన్నాడు. పంపభారతము లౌకిక కావ్యమైన కుమారవ్యాస భారతము భగవద్విలాస చిత్రణము. మానవ మనస్తత్వచిత్రణములో అద్వితీయుడు కుమార వ్యాసకవి కావ్యకె గురువెనలు (కావ్యము నకు గురువు అన్నట్లు) కన్నడ భారతమున రచించి తరించాడు. మహాకవి డా. కె.వి. పుట్టప్పగారు యీాకావ్యమును ప్రస్తుతిస్తూ—

> ''కుమార వ్యాసను హాడిదవెందరె
> కలియుగ ద్వాపర వాగువుదు
> భారత కణ్ణలి కుణివుదు, మైయలి
> మించిన హొళెతళు కాడువుదు' అన్నారు.

(కుమారవ్యాసుడు పాడిన కలియుగం ద్వాపర మవుతుంది. భారతం మన కన్నులలో నృత్యం చేస్తుంది. మన శరీరంలో విద్యుత్కాంతులువెలుస్తాయి) కుమారవ్యాసుని అసలుపేరు నారయణప్ప. క్రీ. శ. 1230–1235 ప్రాంతమున జన్మించినాడని పరిశోధకుల అభిప్రాయము. ఈ యుగానికి చెందిన వీర శైవ కవులలో లక్కణ్ణ దండేశ, చామరస పేర్కొనదగినవారు. కుమార వాల్మీకి (క్రీ.శ. 1500) రచించిన తొరవె రామాయణము కన్నడ రామాయణాలలో అత్యంత జనప్రియ మైనది.

వచనసాహిత్యం తర్వాత కన్నడములో దాససాహిత్యం ప్రశస్త మైనది. దాససాహిత్యానికి మూలపురుషుడుగ ప్రసిద్ధిగన్న మహ నీయుడు శ్రీపాదరాయలు (క్రీ.శ. 1500). సాళువ నరసింహుడీ మహనీయునికి కనకాభిషేకం చేశాడు. వందలాది కీర్తనలనురచించి, పాడి ప్రచారము చేసిన వాగ్గేయకారు డీయన. కన్నడ సంకీర్తనా చార్యులలో మొదటివాడుగ పరిగణింపబడిన నరహరితీర్థుడు క్రీ.శ. 13–14 శతాబ్దులకు చెందినవాడు.

కుమారవ్యాసుడు భారతములో పది పర్వములు మాత్రము రచించాడు. తక్కిన ఎనిమిది పర్వములను రచించి భారతకావ్యాన్ని పూరించినవాడు తిమ్మణ్ణకవి. ఈకవి కృష్ణదేవరాయల కొలువులో వుండినవాడు.

వ్యాసరాయలు మహాతపస్సంపన్నుడేకాక న్యాయమృత, తర్క తాండవ మున్నగు ఉద్గ్రంథములను రచించినాడు. మేధావి, తార్కి కుడూ అయిన వాదిరాజకవి 'హయవదన' అంకితముతో పెక్కు కీర్తనలు రచించాడు.

మన అన్నమయ్య దాదాపు సమకాలీనుడు, కన్నడ సంకీర్త నాచార్యులలో సువిఖ్యాతుడు అయిన పురందరదాసు వేలకొలదికీర్తన లను రచించాడు. దండనాయకుడుగా ఉండి, విరక్తుడై, ఆది కేశవస్వామి భక్తుడుగా మారి ఎన్నో కీర్తనలను రచించిన భక్తకవి కనకదాసు. ఈయన రచనలో 3200 సాంగత్యాలుగల 'మోహన తరంగిణి' గొప్పది.

'కర్ణాట కవి చూతవనచైత్ర' బిరుదాంకితుడైన లక్ష్మీశ కవి జైమిని భారతమును రచించాడు. ఈ యుగమునకు చెందిన వీరశైవ కవులలో 'కుమారరామ సాంగత్య' రచించిన నంజుండ కవి విరుపాక్ష పండితుడు, 'కవికర్ణ రసాయన' కర్త షడక్షరదేవుడు మేటివారు.

మన వేమన్నను పోలినవాడు సర్వజ్ఞకవి. కన్నడ, జానపద సాహిత్యానికి గాయత్రి యనదగు 'త్రిపది' ఛందస్సులో వేలకొలది పద్యాలు అందించిన ప్రజాకవి సర్వజ్ఞుడు కులమతాల పరిధుల నధిగమించి మానవ కులమంతా ఒక్కటే అన్నవాడాయన. మందవద లిన మద గజంలా దేశాటనం చేస్తూ ప్రజలను మంచి వైపుకు మళ్ళించటానికి ఎంతో కృషి చేశాడు.

కుమారవ్యాస యుగములో తెలుగు, కన్నడములు మరింత సన్నిహితమైనాయి. కవిసార్వభౌముడైన శ్రీనాథుడు ప్రౌఢదేవ రాయల ఆస్థానమున కనకాభిషేక సత్కార మందుకొన్నాడు. కుమారవ్యాసుని భారతంలో తిక్కన ఛాయలు స్పష్టంగావున్నాయి. మను చరిత్రలోని 'నిరుపహతి స్థలంబు' అను పద్యము అప్పటికి మూడు శతాబ్దులకు ముందే వెలసిన మల్లికార్జున పండితుని కన్నడభాషా కావ్యమైన సూక్తి సుధార్ణవమును అన్నివిధాలా పోలి యున్నది. కన్నడ జైమిని భారతకర్త వసు: చరిత్రకారుని అనుస రించాడు.

( మిగతా 55 వ పేజీలో )

శ్రీ ఘట్టమరాజు అశ్వత్థనారాయణ

# అనాదృత వాఙ్మయ భిక్షువు: కీ. శే. నేదునూరి గంగాధరంగారు

పల్లెసాహిత్యం కోసమే తమ జీవితం వినియోగించారు గంగాధరంగారు. ఈ పనిలో తెలుగుదేశంలోనే కాదు, భారతదేశమంతటా పేరుపడ్డారు వారు.

గంగాధరంగారు కారణ జన్ములు. ఆయనను కని ఆంధ్ర దేశం—ముఖ్యంగా గోదావరి మండలం—రాజమండ్రి గర్విస్తున్నది. ఆయనకు ఎంతైనా రుణపడి వుంది తెలుగుదేశం.[1]

నేదునూరి గంగాధరంగారి జానపదగేయ సంకలనాలైన 'మిన్నేరు', 'మున్నీరు'ల సర్వస్వత్వాలు పుచ్చుకొన్న వారి జానపద గేయ, సాహిత్య సంకలనాలను తమ కైవసములో నుంచుకొన్న ప్రకాశకులు ఈ విధంగా కృతజ్ఞతాభారంతో తలవంచటం నిజంగా మెచ్చదగిందే. అయితే తన జీవిత సర్వస్వాన్నీ జానపద సాహిత్య సముద్ధరణకే అర్పించిన త్యాగశీలి. భోళాశంకరులైన నేదునూరి గంగాధరంగారికి వారి జీవిత కాలంలోనూ, తర్వాత కూడా న్యాయం చేకూర్చలేకపోయిందే ఆంధ్రదేశం అని కొందరు జానపద సాహిత్యాభిమానుల బాధ.

జానపద సాహిత్యానికి మిగతా భారతీయ భాషలలోవలెనే తెలుగుదేశంలోనూ చాలా ఆలస్యంగా మన్ననా మర్యాదా లభించాయి. మిగతా భాషలలోవలెనే తెలుగు జానపద సాహిత్య సేకరణలో, సంరక్షణలో, పరిశీలనములో పాశ్చాత్యులే కష్టపడినారు.

కాలక్రమంలో నందిరాజు చలపతిరావుగారు, మంగు వెంకట రంగనాథరావు, అక్కిరాజు ఉమాకాంతం పంతులు, వేటూరి ప్రభాకర శాస్త్రి మొదలగు మహనీయులు తెలుగు జానపద సాహిత్యానికి ఎంతో సేవ చేసినారు. కాని నేదునూరి గంగాధరంగారివలె జీవిత సర్వస్వాన్ని జానపద సాహిత్య సేవకు ముడుపు కట్టిన మహనీయులు వేరొకరు లేరంటే స్వభావోక్తి అనిపించుకుంటుంది. గంగాధరంగారి పుణ్యమా అని పల్లెసీమల పాతపాటలు గుజిలీ పుస్తకముల లోనే గాక, పండితులు చదివే పత్రికలలో కూడా చోటు చేసుకొన్నాయి. పిమ్మట పుస్తక రూపంలో కూడా అవతరింప నారంభించాయి. అంతవరకూ అనాదృత వాఙ్మయంగా పరిగణింపబడుతూ వచ్చిన జానపద సాహిత్యం పండితుల, సహృదయుల సెబాసుల నందుకొని సమాదృత వాఙ్మయంగా చెలామణి కాసాగింది. సాగరాంధ్ర ప్రాంతంలో జానపద సాహిత్య సేకరణకు చాలామంది కంకణము కట్టుకొన్నా నిదానంగా తెలంగాణంలోనూ, రాయలసీమలోనూ జానపద సాహిత్య సేకరణకు సహృదయులు పూనుకొనసాగినారు. పల్లెపాటల సేకరణ, ప్రచురణ జరగటమేకాక వాటిపై పరిశోధనకూడ చేయవలసిన అగత్యము ఏర్పడింది. "తెలుగు జానపద గేయ సాహిత్యము" అనే సిద్ధాంత వ్యాసమును సమర్పించి శ్రీ బి.రామరాజుగారు ఉస్మానియా విశ్వవిద్యాలయమునుండి తెలుగులో పి.హెచ్‌డి. పట్టమును పొందుట తెలుగు సాహిత్య చరిత్రలో— ముఖ్యంగా తెలుగు జానపద సాహిత్య చరిత్రలో ఉల్లేఖింపదగిన విషయము. అయితే పల్లెసీమలనుండి పట్టణాలకు, విశ్వవిద్యాలయాలకు తరలిన తెలుగు జానపద సాహిత్యమునకు పూర్వరంగమును సిద్ధపరచిన మహనీయుల సేవ అని స్మరణీయము.

అటువంటి అవిస్మరణీయ వ్యక్తులలో స్వర్గీయ నేదునూరి గంగాధరంగారి పేరు అగ్రగణ్యము. గంగాధరంగారు తెలుగు జానపద సాహిత్య సేకరణలో కొన్ని దశాబ్దాలు గడిపినారనీ, కొన్ని వేల గేయాలు సేకరించారనీ, లెక్కలేనన్ని సామెతలు, పొడుపు కథలూ, జానపదవిశేషాలు సంగ్రహించారనీ జానపద సాహితీవేత్తలు చాలా చోట్ల పేర్కొన్నారు. ఆ పేర్కొన్న వారందరూ జానపద సాహిత్య క్షేత్రంలో అగ్రగణ్యులు కావటం మూలాన, నేదునూరితో ప్రత్యక్ష పరిచయం, లాభం పొందిన వారగుట మూలాన వారి మాటలు నమ్మితే సత్యానికి వత్తాసు పలికినట్లే. జానపద సాహిత్య క్షేత్రంలో క్రొత్తగా కాలుమోపేవారికి పాతపాటల గంగాధరంగారు ఒక **'Legendery figure'** అయితే వారి సేకరణ విషయ మట్లుంచి, ప్రచురింపబడిన వారి జానపద గేయ సంగ్రహాలను కాని, సామెతలను కాని, వ్యాససంకలనాలను గాని చూస్తే గంగాధరంగారు తెలుగు జానపద సాహిత్యానికి చేసిన లపూర్వమైన సేవను మనకు అర్థం కానంత అల్లిక బిల్లికలతో గందరగోళం చేసే ప్రయత్నాలు జరుగుతున్నాయనీ భాసింపక మానదు.

గంగాధరంగారు నాలుగువేల తెలుగు జానపద గేయాలు సేకరించారని శ్రీ దేవేంద్ర సత్యార్థిగారు 1946లోనే వ్రాశారు.[2] గంగాధరంగారు పదివేలకు పైచిలుకు గేయాలు సేకరించారని ఇటీవల డా. బి. రామరాజుగారు గంగాధరంగారి సప్తమ వర్ధంతి సభలో పేర్కొన్నారు. (చూ. ఆంధ్రపత్రిక 13–3–77 ఆంధ్ర పత్రిక ప్రతినిధి రిపోర్టు)

శ్రీ దేవేంద్ర సత్యార్థిగారు వ్రాసిన నాటికీ (1946) గంగాధరంగారు మరణించేనాటికీ (1970) జానపద గేయముల సంఖ్య పదివేల పైచిలుకు అయివుండటం ఆశ్చర్యమేమీ కాదు. ముఖ్య సమస్య ఏమిటంటే — గంగాధరంగారు సేకరించిన పదివేల పైచిలుకు జానపద గేయాల్లో ఎన్ని వేలు ఇంతవరకూ ప్రచురింపబడినాయి ? ఎన్ని వేల గేయాలు ఏ యే ప్రెస్సుల్లో, ఎవరెవరి వద్ద పడి మూలుగుతున్నాయి? ఎన్ని గేయాలు వేరే మహానుభావుల పేరిట ప్రచురితమయ్యాయి ? ఇవి మనం ఎదుర్కొనే సమస్యలు.

తెలుగు జానపద గేయ సాహిత్య అధ్యయనము సాగిస్తూ, గంగాధరంగారి సేకరణల గూర్చి ఆరా తీద్దామనే కోరిక పొడమింది నా పరిశోధనా విషయానికి **(A comparative study of the Folk-songs of Braj and Telugu fertaining to the story of Sree Krishna)** సంబంధించిన తెలుగు జానపద గేయ సంకలనాల్ని సాధ్యమైనంతగా గాలించాను. గంగాధరంగారి సంకలనాలు 1. మంగళ హారతులు మొదటి భాగము. 2. మంగళ హారతులు రెండవ భాగము. 3. సెలయేరు 4. మిన్నేరు 5. మున్నీరు 6. జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి 7. త్రివేణి. (గంగాధరంగారు నలుగురు సంపాదకులలో ఒకరు) — వీటిని పరిశీలించాను. గంగాధరంగారి బృహత్ కార్యము ఇంతటికే పరిమితమయి వుండదని తలంచి వారి కార్యక్షేత్రమయిన రాజమండ్రికే (నవంబరు 1973) వెళ్లాను. గౌతమీ గ్రంథాలయ గౌరవ కార్యదర్శులైన శ్రీ మహీధర జగన్మోహనరావుగారు నాకు గ్రంథాలయం లోని అమూల్యమైన జానపద గ్రంథాలను లభ్యము చేసినారు.

గౌతమీ గ్రంథాలయావరణములోనే నేదునూరి గంగాధరం పరిశోధక మందిరం (పేరు సరిగ్గా జ్ఞాపకంలేదు) కూడా వెలసి వుండటం ఆడబోయిన తీర్థ మెదురయినట్లయినది. నా ఆశ రెక్కలు చాచింది. ఆశ్చర్యం కలిగించిన విషయమేమిటంటే —ఆ ఆవరణలో ఒకే గది కందుకూరి స్మారక పరిశోధక మందిరంగానూ, గంగాధరం పరిశోధక మందిరంగానూ ఏర్పాటు చేయబడి వుండటం. ఏమైతేనేమాయె, పని జరిగితే సరికదా అనుకొని ఆ పరిశోధక మందిరం ద్వారాలు తెరిపించాను. (చెన్నకేశవస్వామి గుడి వైకుంఠ ద్వారాలు ఏడాదికోమారు తెరిపించినట్లు) అష్టదిగ్బంధనం చేయబడిన ఆ చిన్న గదిలో దుమ్ము — ధూళి, కంపు, ఆరడుగుల అల్మైరా సాక్షాత్కరించాయి. ఆ అల్మైరాలో నాకు కావలసిన బొక్కసమూ — బండారము దొరకవచ్చు లనే దురాశతో దాని తలుపులు తీశాను. (క్షమించాలి—మరో ఇరువురి సాయంతో తీయించగలిగాను) అందులో నాకు కనపడిన సంపత్తు ఇది :

1. డా. బి. రామరాజుగారి థీసిస్ (వారు గంగాధరంగారికి కాంప్లిమెంటరీగా చేవ్రాలుచేసిపంపినది) 2. సెలయేరు 3. వాస్తుశాస్త్రము గురించి ఒక చిన్న పుస్తకం. 4. చాలాకాలం క్రిందట గంగాధరంగారు సామెతల గురించి 'ప్రజామత' లో వ్రాసిన పేపరు కటింగులు కొన్ని. 5. డా బి. రామరాజుగారు నేదునూరి వారి సేవలను ప్రశంసిస్తూ వ్రాసిన ఒక ఉత్తరం. 6. గ్రామాల పేర్ల పట్టిక 7. పెన్సిలు వ్రాతలమీద నేదునూరివారు కొక్కిరిబిక్కిరిగా ఇంకుతో వ్రాసుకొన్న జానపద గేయాలు. ఇంతే.

దాదాపు 20—30 ఉండలుగా చుట్టిన పేపరులను విప్పి చూశాను. అందులో కొన్ని గంగాధరంగారు వ్రాసుకొన్నవి, మరి కొన్ని వారి మిత్రులు, సాఫు ప్రతులను వ్రాసిన సుబ్బయ్యగారు వ్రాసినవి. సరే వాటినే వ్రాసుకొందామని ఒక్కటొక్కటిగా నాలుగైదు వ్రాసుకొన్నాను. వాటిని ఎక్కడో చదివినట్లు జ్ఞాపకం వచ్చింది. వెంటనే నావద్దనున్న 'మిన్నేరు', 'మున్నీరు'లను తిరగవేయగా అవన్నీ వాటిల్లో సాక్షాత్కరించాయి. పడిన శ్రమ వ్యర్థమనుకొని, పడబోయే శ్రమ వ్యర్థము కాకూడదనీ ఆ కాగితాల్లోని ప్రతి గేయం గంగాధరంగారి ప్రచురితాల పుస్తకాల్లో ఉందా లేదా పరిశీలించసాగాను. నూటికి తొంబై తొమ్మిది గేయాలు పుస్తకాల్లో కానవచ్చాయి. మిగలావి ఒకటి రెండు చరణాలతో అసమగ్రంగా కనపడ్డాయి. ఒకటో అరో పూర్తిగా కనపడితే వ్రాసుకొన్నాను. అయితే నాకు నేదునూరి వారి అముద్రిత గేయాలను అనుకున్నంత పరిమాణంలో ఆ చూసేభాగ్యం కలగలేదు. ముద్రిత గ్రంథాల పరిశీలనతోపాటు అముద్రిత గ్రంథాల పరిశీలన కూడా అధిక అప్రయోజనకరమని భావించిన నాకు నిరాశ ఎదురయ్యింది. నేదునూరి గంగాధరంగారి సేకరణ అంతా ఇంతేనా అనిపించి, వారి యింటికి వెళ్లి వారి శ్రీమతిని, కూతురిని పరామర్శించి, వారి అనుమతితో గంగాధరంగారి లైబ్రరీని గాలించాను. నాకు ఎటువంటి జానపద గేయ కోశమూ దొరకలేదు.

మరుసటిరోజు 'మిన్నేరు' పుటలు తిరగేస్తుండగా, పుస్తకం చివర నేదునూరివారి రచనల పట్టీ కనిపించింది. 'అచ్చునకు సిద్ధపరచినవి' అను శీర్షిక క్రింద 14 పుస్తకముల జాబితా కనపడింది.

వాటిలో మున్నీరు 1973 లో అచ్చయింది. సెలయేరు (రెండవ కూర్పు) అచ్చయిందో లేదో నాకు తెలియదు. మిగతా పన్నెండు గ్రంథాలూ అచ్చయినట్లులేదు. వాటిలో జానపద కథా ఖండ స్వరూపాలు, జానపద కథలూ—గాథలూ, శృంగార పదాలు, పదాలు — పద కర్తలు, సంప్రదాయిక విజ్ఞానం, జీవద్భాషా నిఘంటువు మొదలైనవి జానపద సాహిత్యానికి చెందినవి. ఇవన్నీ ఏమయ్యాయో తెలియదు. గంగాధరంగారి శ్రీమతిని ఈ విషయం అడగ్గా వారు ప్రాచీన గ్రంధావళి ప్రకాశకులను ఆ అముద్రిత రచనలను తమ కిమ్మని అడగ్గా వారు నిరాకరించినట్లు చెప్పినారు. 1968 లో ప్రచురింపబడిన 'మిన్నేరు' చివరి పేజీలో ఇవ్వబడిన గంగాధరంగారి అముద్రిత గ్రంథాలపట్టీ 1973 లో ప్రచురింపబడిన 'మున్నీరు' లో కానరాకపోవటం నాకు చాలా ఆశ్చర్యం కలిగించింది. ఈ అయిదేళ్లలో 'మిన్నేరు'లోని పట్టీలోని గ్రంథాలు ఏమైనా ప్రకటించివుంటే వాటిని వదిలి మిగతావాటిని 'మున్నీరు'లో వేయవచ్చును కదా ? ఎందుకు వేయలేదు? 'మున్నీరు' కు సంపాదకత్వ బాధ్యతను వహించి, పీఠిక వెలయించిన శ్రీ పురిపండా అప్పలస్వామి గారు "గంగాధరంగారి సంకలనాలు వెలుగులోకి తేవడంతోపాటు

... సేకరించి కుప్పవేసిన పల్లెసాహిత్యం భద్రపరచడంలో ప్రధాన పాత్ర వహిస్తున్న అద్దేపల్లివారిని అభినందిస్తున్నాను''[3] అని వ్రాసినారు. గంగాధరంగారి సంకలనాలను వెలుగులోనికి తెచ్చినందులకు మనం అద్దేపల్లివారిని అభినందించాల్సిందే. కాని ''వారు సేకరించి కుప్ప వేసిన పల్లె సాహిత్యాన్ని భద్రపరచడంలో ప్రధాన పాత్రను'' అద్దేపల్లివారు ఇంకా ఎంతకాలం నిర్వహించదలుచుకున్నారు ? గంగాధరంగారి సంకలనాలను ముద్రించేందుకు ఆర్థికమైన ఇబ్బందులు వుంటే 'మున్నీరు'కు ఇచ్చినట్లే మిగతా గ్రంథాల ప్రచురణకు కూడా ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ఆర్థిక సహాయము ఇస్తుంది కదా ? అద్దేపల్లివారు అకాడెమీని అడగలేదా !

''శిథిలావస్థలో వున్నటు వంటివి, అచ్చుకాని రచనలను త్వరలో సంగీత అకాడమీ, ఆంధ్ర సారస్వత పరిషత్తు ముద్రించటానికీ పూనుకోగలదని శ్రీ రాజు చెప్పారు.''[4] గంగాధరంగారి సేవలను ఉగ్గడించిన డా. బి. రామరాజుగారు చెప్పిన మాటలు నేదునూరి గారి సంకలనాలకు వర్తించునా లేక మరి ఇతరత్రా లభించిన రచనలకు అన్వయించునా ? నేదునూరి గంగాధరంగారి జానపద గేయ సంకలనాలు అసూర్యంపశ్యలుగా ఎక్కడెక్కడ ఉన్నాయో గాలించి, పట్టితెచ్చి వాటిని ఓపికగా, సమర్థవంతంగా 'ఎడిట్' చేయించి, ప్రకటించటం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ చేపడితే బాగుంటుందని భావిస్తున్నాను.

నేదునూరి వారి సేకరణలలో అముద్రితమైనవి లభించగలవనే పేరాసతో రాజమండ్రికి పోయిన నాకు నిరాశ కలిగింది. కాని అక్కడి మిత్రుల సహకారం వలన నాకు పెన్నిధిలాగా గంగాధరం గారి అముద్రిత గ్రంథాలు రెండు చూడటానికి లభించాయి. ఒక మహానుభావుడు తమ యింటినుంచి నాకు రెండు ఉద్గ్రంథాలు (అముద్రితాలు) తెప్పించి, యిచ్చాడు. ఒకటి తమ కూతురు యమ్. ఏ. 'డిసర్టేషను'కు సమర్పించిన పుస్తకమన్నారు. ఆ పుస్తకం సుమారు 600 పుటలున్నది. పెక్కు జానపద గేయాల, కథాగేయాల ఉదాహరణలతో కూడి వివరణాత్మకమైన వ్యాససంపుటి. అది ఎక్సర్‌సైజు పుస్తకాల గ్రథనము కావున దాన్ని ఏ పరిశోధకుడు 'డిసర్టేషను' అంటే నమ్మడు. రెండవ పుస్తకము జానపద గేయాల, కథాగేయాల సంకలనం. పుస్తకంపేరు ''స్త్రీల కథల పాటలు'' (స్త్రీల కథాపాటలు) అని పేర్కొనబడి వున్నది. శ్రీరామజననము (37 పేజీలు) కుచేలోపాఖ్యానము (19 పేజీలు సుందరకాండము (107 పేజీలు) సోమప్రభ పెండ్లి (36 పేజీలు) మొదలైన 48 కథాగేయాల సంకలన మీ పుస్తకం. మొత్తము పుటల సంఖ్య 582. నా విషయానికి సంబంధించిన సామగ్రి లేనందున ఆ పుస్తకము వారి కిచ్చివేయడము జరిగింది. నేదునూరి వారి సేకరణలను పరిశీలించిన సునిశిత బుద్ధులకు ఈ రెండు గ్రంథాలు గంగాధరంగారి కష్టార్జితములని తెలుస్తుంది. ఈ రెండు పుస్తకముల వ్రాతప్రతులు సిద్ధము చేసినవారు గంగాధరంగారి మిత్రులయిన శ్రీ సుబ్బయ్యగారు. వారి వ్రాతను నేను పోల్చుకో గలిగాను. గంగాధరంగారు తమ చేతితో పుస్తకములపేర్లు, విషయాను క్రమణిక మాత్రమే వ్రాశారని నేను తెలుసుకొన్నాను. ఈ రెండు ఈ గ్రంథాలు తెలుగు జానపద సాహిత్యానికి అమూల్యమైన అలంకరణాలు. అయితే ఇవి ఏ మహానుభావుని పేరుతో ఎప్పుడు ప్రచురింపబడుతాయో వాటిని భద్రపరిచిన వారికే ఎరుక! ఇలా గంగాధరంగారి సేకరణలు ఇంకా ఎంతమంది దగ్గరఉన్నాయో?

గంగాధరంగారి సేకరణలలో కొన్నింటిని 'మిన్నేరు', 'మున్నీరు' గ్రంథరూపంలో అద్దేపల్లివారు ప్రకటించారు. వాటికి సంపాదకత్వమును నిర్వహించిన పురిపండా అప్పలస్వామిగారు పై రెండింటిని 'ఎడిట్' చేసేముందు గంగాధరంగారి ఇతర గ్రంథాలను (ముద్రితములైన వాటిని) చూసివుంటే బాగుండేది. మంగళహారతులు (మొదటి, రెండు భాగములు) జానపద గేయ సాహిత్య వ్యాసావళి వీటిలోని పాటలు కొన్ని 'మిన్నేరు', 'మున్నీరు' లలో పునరుక్తమయ్యాయి. అంతెందుకు 'మిన్నేరు'లోని కొన్ని గేయాలే మరలా 'మున్నీరు'లో ముద్రితమయ్యాయి.

ముఖ్యమైన, విశిష్టమైన పదాలకు అర్థవివరణ, జానపద విశేషాలు తెలియజెయ్యటం మొదలగు సంపాదకీయ కర్తవ్యం ఈ రెండింటిలోనూ పాలింపబడలేదు. జానపదగేయ సంకలనాలు ముద్రించటం సులభం. కాని సరియైన, శాస్త్రీయ పద్ధతిలో ప్రచురించటం మనమింకా నేర్వవలసిన విద్య.

'అనాదృత వాఙ్మయ భిక్షువు' అయిన శ్రీ నేదునూరి గంగాధరంగారు ఊరూరూ, పల్లె పల్లె, తిరిగి మాధుకరీ వృత్తిచేత సంపాదించిన పంచభక్ష్య పరమాన్నాలు తిని, త్రాగి, తేన్చినాము మనము: కాని ఆ మహానుభావుడు పడిన కడగండ్లు మనము పట్టించుకోలేదు. వారి సేకరణలను, వారి పేరుతోనే సరియైన రీతిలో ప్రచురిస్తే, మనము వారిపట్ల కొంతవరకైనా కృతజ్ఞత ప్రదర్శించిన వారమవుతాము.

## అధోజ్ఞాపికలు

1. ప్రకాశకుల విజ్ఞప్తి. మున్నీరు.
2. పుట 181. **Meet my people. Sangam Publishers LTD. Lahore! India. (1946)**
3. పుట 13. మున్నీరు. ప్రాచీన గ్రంథావళి. రాజమండ్రి.
4. జానపద కవి గంగాధరం సప్తమ వర్ధంతి సభ ఆంధ్ర పత్రిక 13–3–77 (ఆంధ్రపత్రిక ప్రతినిధి రిపోర్టు).

శ్రీ మల్లంపల్లి ఆదిత్యశర్మ

# విష్ణుకుండినులు - వేంగిదేశము

క్రీ. శ. 6, 7 శతాబ్దాలలో ఆంధ్రదేశాన్ని పరిపాలించిన రాజ వంశం విష్ణుకుండిన రాజవంశం. వీరి చరిత్రను గురించి, కాలానుక్రమణిక గురించి, వంశవృక్షాన్ని గురించి చర్చించని చరిత్ర పరిశోధకుడులేడు. ఎవరు ఏ విషయాన్ని చర్చనీయాంశ విషయంగా తీసుకున్నా, విష్ణుకుండినుల 8 తామ్రశాసనాలు, ఒక శిలాశాసనం; తదితర సమకాలీన చారిత్రక వస్తుసామగ్రి వారికి ముఖ్యాధారాలు. ఇన్ని ఉన్నా, విష్ణుకుండినుల చరిత్ర ఇదమిత్థమని తేలలేదు. చారిత్రక పరిశోధకులు ఎవరికి తోచినట్లు వారు విష్ణుకుండినుల చారిత్రక వస్తుసామగ్రిని ఉపయోగించుకుని వారి చరిత్ర, వంశ వృక్షం, కాలానుక్రమణికలను నిర్ణయించారు.

విష్ణుకుండినుల చరిత్రని, చారిత్రక వస్తుసామగ్రిని కూలంకషంగా పరిశీలించి పుస్తకరూపంలో వెలువరించినవారు శాసన చారిత్రక పరిశోధకాగ్రేసర చక్రవర్తులు డాక్టరు నేలటూరు వేంకట రమణయ్యగారొకరు; డాక్టరు శంకర నారాయణన్‌గారిం కొకరు. వీరి పరిశోధనలలో కూడ ఏకాభిప్రాయం కుదరలేదు. శ్రీ వేంకట రమణయ్యగారు పుస్తకం రచించేనాటికి శ్రీ శంకరనారాయణన్‌గారి పరిశోధన పూర్తికాలేదు. శ్రీ వేంకట రమణయ్యగారు స్థూలంగా చర్చించిన విషయాలని అసందిగ్ధంగా వదలివేయడంకాని, ఇంతవరకు సందేహాస్పదాలుగా ఉన్న వాటిని గూర్చి పూర్తిగా చర్చించకపోవడం కాని శ్రీ శంకరనారాయణన్‌గారి పుస్తకంలో గోచరమౌతుంది. అందువల్ల ఈ వ్యాసానికి మూలం డాక్టరు నేలటూరు వేంకట రమణయ్యగారి పరిశోధనా ఫలితంగా వెలువరించిన "విష్ణుకుండినులు" అన్న పుస్తకం. వారందులో ఇచ్చిన వంశ,కాలానుక్రమణికలు యథాతథంగా అనుసరిస్తున్నాను :







ఇక ప్రస్తుత విషయం గురించి ప్రస్తావిస్తాను. విష్ణుకుండినుల పరిపాలనారంభకాలంనించి, కనీసం రెండవ మాధవవర్మ కాలంనుంచి, వేంగి దేశం వారి యధీనంలోనే ఉందని చరిత్రకారుల యభిప్రాయం. కాని విష్ణుకుండినుల శాసనాలు, సమకాలీన రాజ వంశాల శిలా తామ్ర శాసనాలని పునఃపరిశీలిస్తే ఈ అభిప్రాయం గురించి సందేహించవలసి వస్తుంది ఈ చారిత్రక వస్తుసామగ్రి పునః పరిశోధనా ఫలితమే ఈ వ్యాసం. ఇందులో చెప్పబడిన అభిప్రాయాలలోని సత్యాసత్యాలను చారిత్రక పరిశోధకులు నిర్ణయించాలి. విష్ణుకుండినుల, శాలంకాయనుల, పల్లవుల తామ్ర శాసనాలేకాక సమకాలీన రాజవంశాల శిలా తామ్ర శాసనాలలో కొన్నింటిని గురించి మాత్రమే ఇందులో చర్చించడమైంది.

రెండవ మాధవవర్మ (క్రీ. శ 445–482) రాజ్యము రేవా సరిత్సలిలయ వలయ యశోభూషణమని ఆతని సంతతివారిచ్చిన తామ్ర శాసనాలలో [1] చెప్పబడింది. దీనినిబట్టి మాధవవర్మ రాజ్యం "దక్షిణమున కుంతలమునుండి ఉత్తరమున రేవా పర్యంతము, తూర్పున అజంతా ఎల్లోరాల నుండి పశ్చిమమున సముద్ర పర్యంతము" వ్యాప్తి చెందింది. ఈ రాజ్య విస్తరణలో వాకాటక ప్రభువు రెండవ పృథ్వీసేనుడు మాధవవర్మకు లోబడి తనకుమార్తెనిచ్చి సంధి చేసుకున్నాడు. ఈ దంపతుల కుదయించినవాడు "విష్ణుకుండి వాకాటక వంశద్వయాలంకృత జన్ముడు," "పరమ సౌగతుడు," "మహాకవి" మొదటి విక్రమేంద్రవర్మ

రెండవ మాధవవర్మకి విక్రమేంద్రవర్మ కాక మహారాజ దేవవర్మ మరొక తనయుడు. ఏ కారణం వల్లనో మొదటి విక్ర మేంద్రవర్మ, దేవవర్మలను గురించి విష్ణుకుండి తామ్రశాసనా లలో చెప్పబడలేదు. వారు రాజ్యపరిపాలనచేసి ఉండరేమోనని సందేహం కలుగుతుంది. మొదటి విక్రమేంద్రవర్మ కుమారుడు ఇంద్రభట్టారకవర్మ — దేవవర్మ కుమారుడు మూడవ మాధవ వర్మ.

ఈపూరు రెండవ తామ్రశాసనం [2] ప్రకారం మూడవ మాధవవర్మ (క్రీ. శ. 482–529) రాజ్యం త్రికూటమలయా వని ప్రాంత భూభాగం. త్రికూటమన్నది నాసిక ప్రాంతంలోని సహ్యాద్రి అని, మలయావని యన్న పేరు తూర్పు గోదావరిజిల్లా పశ్చిమ ప్రాంతపు పర్వత శ్రేణికి చెల్లుతుందని, పండితుల అభి ప్రాయం. కనుక ఈతని రాజ్యం "పూర్వదిగ్భాగమున మలయ ప్రాంతమునుండి పశ్చిమమున త్రికూటము వరకు వ్యాపించిన భూభాగమంతయు ఆతని (మూడవ మాదవవర్మ) యేలుబడి క్రిందనుండె" నని డాక్టరు నేలటూరు వేంకటరమణయ్యగారు నిర్ణయించారు. [3] రేవానదిత్పురిల పర్యంతం రాజ్యమేలిన రెండవ మాధవవర్మ రాజ్యానికి తన మనుమడైన మూడవ మాధవవర్మ వారసుడైనాడు.

రెండవ మాధవవర్మ మనుమడు, విక్రమేంద్ర వర్మ కుమారుడు, ఇంద్రభట్టారకవర్మ(క్రీ.శ.529–556)తన 27వ రాజ్యవత్సరంలో ఇచ్చిన తామ్రశాసనం [4] విశాఖపట్టణం జిల్లా లోని రామతీర్థంలో దొరికింది. ఈ శాసనంలో దానంచేయబడిన గ్రామం పెరువాడక గ్రామం–ప్లక్కి రాష్ట్రంలోనిది. ఈ ప్లక్కి రాష్ట్రం విశాఖపట్టణంజిల్లా ప్రాంతమని చరిత్ర కారులు నిర్ణ యించారు. తీరాంధ్రంలో దొరికిన మొదటి శాసనం (కాలానుక్రమ ణికననుసరించి) ఇదే. ఇంద్ర భట్టారకవర్మ అనేక చతుర్దంత సమర సంఘట్టన విజయోపలబ్ధుడై సమస్త దాయాదులను నిర్జించి చక్రవర్తి క్షేత్రాధిపతియైనవాడు.

పైచెప్పిన తామ్రశాసనాలలోని విషయం పరిశీలిస్తే కొన్ని చారిత్రక విషయాలు ఊహించవచ్చు. రెండవ మాధవవర్మ గతించిన తరువాత ఆతని రాజ్యానికి (త్రికూట మలయాధిపతియై) మూడవ మాధవవర్మ వారసుడైనాడు. కాని, ఇంద్రభట్టారక వర్మ అనేక చతుర్దంత యుద్ధాలలో దాయాదులని ఓడించి; బాహు బల వీర్య సంపన్నుడు, చక్రవర్తి సమోపేతుడైన రెండవ మాధవవర్మ రాజ్యాన్ని ఆక్రమించుకుని చక్రవర్తిక్షేత్రాధిపతి అయి నాడు. ఈతడు ఓడించిన దాయాదులలో మూడవ మాధవవర్మ ముఖ్యుడు కావచ్చు. అతనివద్ద నుండే ఇంద్రభట్టారకవర్మ చక్ర వర్తి క్షేత్రాన్ని చేజిక్కించుకున్నాడు. చక్రవర్తి క్షేత్రాధిపతి అయినప్పటికి ఆతడు దాన్ని నిలబెట్టుకోలేకపోయాడు. మూడవ మాధవవర్మ నుంచి ఆక్రమించిన త్రికూట మలయావని ప్రాంత భూమిలో త్రికూట ప్రాంతాన్ని పోగొట్టుకుని ఉండవచ్చు. మాళవ రాజ్యాధిపతి మౌఖరి ఈశానవర్మ తాను ఆంధ్రాధిపతిని ఓడించి తరుమగొట్టానని తన హరహ శాసనంలో [5] చెప్పుకున్నాడు. ఈశాన వర్మ చేతిలో ఓడిపోయిన ఆంధ్రాధిపతి ఇంద్రభట్టారకవర్మ అని చరిత్ర కారుల అభిప్రాయం. త్రికూట ప్రాంతంపోగా ఆతనికి మిగిలినది మలయావని మాత్రమే. ఈ మలయావనిలో వేంగిదేశం చేరియుండలేదు. ఇతడిచ్చిన రామతీర్థ శాసనంలోని ప్లక్కి రాష్ట్రం మధ్యమ కళింగాగ్గతంకాని, వేంగి భూభాగంలోనిది కాదని చెప్పాలి. కాబట్టి ఇంద్రభట్టారకవర్మ నాటికి వేంగి విష్ణు కుండినుల యధికారంలో లేదని సందేహించవలసి వస్తుంది.

ఈ ఊహకు మరొక నిదర్శనం పిష్ఠపురాధిపతి రణ దుర్జయ వంశస్థుడైన పృధ్వీమహారాజు తాండివాడ, [6] గొల్లపల్లి [7] తామ్రశాసనాలు. ఈతని తండ్రి విక్రమేంద్రుడు, పితామహుడు రణదుర్జయుడు. ఈ రణదుర్జయుని పిఠాపుర రాజ్యంలో వేంగి అంతర్భాగమని చెప్పడానికి శాసనాధారాలు లేవు. అంతేకాదు. ఒక ప్రక్క వేంగిని పరిపాలించిన కడపటి శాలంకాయన ప్రభువులు నందివర్మ, స్కందవర్మ [8] పేర్లకు, పల్లవరాజు నందివర్మ ఉద యేందిరం తామ్రశాసనంలో [9] చెప్పబడిన మొదటి సింహవర్మ కుమారుడు స్కందవర్మ, మనుమడు నందివర్మ పేర్లకు; మరొక ప్రక్క రణదుర్జయుని కుమారుడు విక్రమేంద్రునికి, విష్ణుకుండి ఇంద్రభట్టారకవర్మ తండ్రి విక్రమేంద్ర వర్మలకు నామసామ్యం ఉండటంవల్ల, శాలంకాయనులకు, పల్లవులకును; రణదుర్జయు లకు, విష్ణుకుండినులకు, రాజకీయ సంబంధాలుండి ఉండవచ్చు నననడం అసంబద్ధం కాదేమో. తీరాంధ్రంలో మొట్టమొదట విష్ణు కుండినులు జయించినది వేంగి ప్రాంతభూమిని కాదు — పిష్ఠపుర రాజ్యాన్ని.

విష్ణుకుండి ఇంద్రభట్టారకవర్మతరువాత అతనికుమారుడు రెండవ విక్రమేంద్ర భట్టారకవర్మ (క్రీ. శ. 556–570) రాజ్యపాలన చేశాడు. ఇంతవరకు దొరికిన ఈతని తామ్రశాసనాలు మూడు :

## (1) చిక్కుళ్ళ తామ్ర శాసనం [10] :

ఇది ఈతని 10వ రాజ్యవర్షంలో ఇచ్చినది. ఈ శాసనం నత్రపాటి (విషయం) లోని రావిరేవ గ్రామాన్ని బ్రాహ్మణులకు దానంచేసినట్లు తెలుపుతుంది. ఈ "నత్రపాటి" సతవాడి సీమకు పూర్వనామం. ఈసీమ కృష్ణాజిల్లా నందిగామ తాలూకా ప్రాంత మని చరిత్రకారులు నిర్ణయించారు. పల్లవరాజు మొదటిసింహవర్మ (క్రీ.శ.436–461) ఇచ్చిన వెసంతనామగ్రామం నాదత్తపాటి లోనిది. [11] నాదత్తపాడు సతవాడికి ప్రాచీన నామమని చెప్పవచ్చు. మొదటి సింహవర్మ తమ్ముడు యువమహారాజు. విష్ణుగోపవర్మ తనయుడు రెండవ సింహవర్మ (క్రీ.శ. 460–485 రమారమి) ఇచ్చిన మాంగడూరు గ్రామ దానశాసనంలో [12] చెప్పబడిన గ్రామం మాంగడూరు వేంగో రాష్ట్రంలోనిది. వేంగో రాష్ట్రమే వేంగి. మాంగడూరు నేటి మాంగల్లు అని చరిత్రకారులు నిర్ణయించారు. మాంగల్లుకూడ సతవాడి విషయంలోనిదని తూర్పు చాళుక్యప్రభువు దానార్ణవుని మాంగల్లు తామ్రశాసనం [13] వల్ల తెలుస్తుంది. శాలం కాయనులు రమారమి క్రీ.శ. 475–80 వరకు వేంగిని పరిపా

లించారని చరిత్రకారులు నిర్ణయించారు. పై విషయాలు పరిశీలిస్తే క్రీ.శ. 480 తరువాత వేంగి పల్లవరాజుల ఏలుబడిలోకి వచ్చి ఉండవచ్చునన్న సందేహం కలుగుతుంది.

## (2) తుమ్మలగూడెపు రెండవ శాసనం[14] :

చిక్కుళ్ల తామ్ర శాసనం రెండవ విక్రమేంద్ర భట్టారకుని 10వ రాజ్య వర్షంలో ఇచ్చినదైతే, ఈ తామ్ర శాసనం అతని 11వ రాజ్యవత్సరంలో ఇచ్చినది ఈ 11 వ సంవత్సరం శకవర్షం 488 (క్రీ. శ. 566) నకు సరియైందని ఈ శాసనంలో చెప్పబడివుంది. విష్ణుకుండినుల తామ్ర శిలాశాసనాలన్నిటిలోను శకవర్షం చెప్పబడిన శాసనం ఇదొక్కటే. ఇదే దీని ప్రాముఖ్యత.

ఈ శాసనంలో దానం చేయబడిన గ్రామం ఇరుణ్డేరు. ఇది ఏ విషయంలో, ఏ రాష్ట్రంలో, ఏ సీమలో ఉన్నది చెప్పబడలేదు. ఈ శాసనానికి ఆజ్ఞప్తి పృథ్వీమూలుడు. పై చెప్పిన శకవత్సరంలో పల్లవ రాజుసింహుని ఓడించి, అధః పతనమైన తన ప్రభువు రాజ్యలక్ష్మిని నిలబెట్టానని చెప్పుకొన్నాడు, పృథ్వీమూలుడు. అనేక చతుర్దంత సమరాలలో పాల్గొన్నట్లు, ఇంద్రాధిరాజు (ఇంద్రభట్టారకవర్మ) పై దండెత్తివచ్చినవారిపై విజయం సాధించినట్లు, తాను దానమిచ్చిన గోదావరిజిల్లా తామ్ర శాసనంలో[15] చెప్పుకున్నాడు. ఈ శాసనంలో దానమిచ్చిన 4 గ్రామాలు తాలుపాక విషయంలోనివి. ఈతని కుమారుడు హరివర్మ ఇచ్చిన కట్టు చెరువు తామ్ర శాసనంలో [16] ఇచ్చిన గుణపాశపురం కూడ తాలుపాక విషయంలోనిదే. ఈ తాలుపాక విషయం, తూర్పు గోదావరిజిల్లా రాజోలు, అమలాపురం తాలూకాలలో కొంత ప్రాంతమని చరిత్ర కారులు నిర్ణయించారు. ఇంద్రభట్టారకవర్మ రాజ్యంలో వేంగి చేరలేదని ఇదివరకు చెప్పుకున్నాం. ఈతని సామంతుడైన పృథ్వీమూలుని రాజ్యం ఇంద్రభట్టారకవర్మ రాజ్య భాగమైన మలయావనిలో (వేంగి మినహా) అంతర్భాగమని సందేహించవలసి వస్తుంది.

## (3) తూండిగ్రామ దాన శాసనం[17] :

రెండవ విక్రమేంద్ర భట్టారకవర్మ తన 14 వ రాజ్య వర్షంలో ఇచ్చినది. ఇంతవరకు లభ్యమైన ఈతని కడపటి శాసనం ఇదే. దీనినిబట్టి తుమ్మలగూడెపు రెండవ శాసనం ఆధారంగా ఈతని రాజ్య పరిపాలనా కాలం క్రీ. శ. 556 మొదలు క్రీ. శ. 570 అని చరిత్రకారులు నిర్ణయించారు.

రెండవ విక్రమేంద్ర భట్టారకుని తరువాత కాలానుక్రమణిక ననుసరించి దొరికిన తర్వాతి శాసనం నాల్గవ మాధవవర్మ పాలమూరు తామ్రశాసనం.[18] ఈ శాసనం ఫాల్గుణమాసం పౌర్ణమాస్యనాడు సంభవించిన చంద్రగ్రహణ పుణ్యకాలంలో ఇవ్వబడినది. ఈ మాసంలో చంద్రగ్రహణం క్రీ.శ. 594 లో భారతదేశంలో దృగ్గోచరమైందని శ్రీ కొమర్రాజు లక్ష్మణరావుగారు నిర్ణయించారు. ఈ శాసనం నాల్గవ మాధవవర్మ 48 వ సంవత్సరంలో ఇవ్వబడినది. ఈతనిదే తన 37వ సంవత్సరంనాటి ఈపూరు (మొదటిది) శాసనం [19] మరొక్కటి. ఈపూరు శాసనంలో ఈతనికి త్రివరనగర భవనగత యువతీ హృదయ నందనుడని, అగ్నిష్టోమ సహస్రయాజి అని, హిరణ్యగర్భ ప్రసూతుడని మొదలైన బిరుదావళులు చెప్పబడ్డాయి. 48వ సంవత్సరంలో దానమిచ్చిన పాలమూరు తామ్రశాసనంలో పై బిరుదావళులేగాక ''దశశత సకల ధరణీతల నరపతి'', ''జనాశ్రయ ''డన్నవి కూడ చేర్చబడ్డాయి. దశశత సకల ధరణీతలమన్నది వేంగి సహస్రమని—నా పితృపాదులు శ్రీ సోమశేఖర శర్మగారు నిర్ణయించారు. ఈతని పై రెండు శాసనాలూ, నాల్గవ మాధవవర్మ స్కంధావారాలలో విడిదిచేసిన సమయంలో దానమివ్వడం గమనించదగిన విషయం. ఈ పూరు శాసనం శ్రీ మాధవవర్మకూడా వాడగ్రామంలో విజయ స్కంధావారంలోఉన్నప్పుడు బ్రాహ్మణులకు గుడ్డవాదివిషయంలోని విలెంబలి గ్రామాన్ని దానంచేశాడు. అప్పుడు మాధవవర్మ పల్లవులపై దండయాత్రా సంరంభంలో ఉన్నాడా ? కావచ్చునని వేల్పూరు శిలాశాసనం [20] సమాధానం చెబుతుంది. శాసనం బాగా అరిగిపోయినప్పటికి, ''గోవి ......... సూనో మ్మాన్ధవ వర్మణో'' పల్లవ కుల ......... (6వలైను); అనే మాటలనుబట్టి నాల్గవ మాధవ వర్మ పల్లవులపై దండయాత్రా సంరంభంలో ఉన్నాడని ఊహించడానికి ఆస్కారం ఉంది.

పాలమూరు తామ్రశాసనం మాధవవర్మ పూర్వదిగ్విజిగీషుడై గోదావరి దాటిపోయే సమయంలో గుద్దాది విషయంలో దళియవావి తీరంలో ఉన్న పులంబూరునామ గ్రామాన్ని గౌతమ సగోత్రుడు, రుద్రశర్మ మనుమడు, దామశర్మ పుత్రుడైన శివశర్మకు దానమిచ్చాడు.

గుద్దాది విషయం గురించి ప్రస్తావించడం ఇక్కడ అప్రస్తుతంకాదు. ప్రాచీన అర్వాచీన శాసనాలలో చెప్పబడిన గ్రామాలనిబట్టి గుడ్డ వారద్వయం ఉన్నట్లు గోచరిస్తుంది. కృష్ణాజిల్లా గుడివాడ, బందరు తాలూకా శాసనాలలో చెప్పబడిన గుద్దాది విషయమొకటి, గోదావరి మండలంలోని రామచంద్రపురం తాలూకాలోని శాసనాలలో కానవచ్చే గుద్దాది విషయమింకొకటి. [21] పై చెప్పిన నాల్గవ మాధవవర్మ ఈపూరు తామ్రశాసనంలో చెప్పబడిన 'విషయం' మొదటిది. పాలమూరు తామ్రశాసనంలోనిది రెండవది.

ఇక ప్రస్తుత విషయం. వేంగి సహస్రం విష్ణుకుండి రాజుల ఏలుబడిలోనేఉంటే నాల్గవ మాధవవర్మ వేంగిని జయించి గర్వంగా ''దశశత సకల ధరణీతల నరపతి'' అనే బిరుదు వహించేవాడు కాదు కదా. అంతేకాదు తన 37వ రాజ్యవర్షంలో దానం ఇచ్చిన ఈపూరు తామ్ర శాసనంలో లేని బిరుదు 48 వ సంవత్సరంలో దానమిచ్చిన పాలమూరు శాసనంలో కనబడడంవల్ల రెండవ విక్రమేంద్రవర్మ తరువాత వేంగి సహస్రాన్ని నాల్గవ మాధవవర్మ తిరిగి జయించాడన్నది స్పష్టమవుతుంది. అంటే రెండవ విక్రమేంద్రవర్మ కడపటి రాజ్య సంవత్సరం క్రీ. శ. 570 నుంచి నాల్గవ మాధవవర్మ పాలమూరు శాసనకాలం క్రీ. శ. 594 వరకు వేంగిదేశ చరిత్ర గురించి తెలియదు. కాని ఊహాతీతమైనదికాదు.

విష్ణుకుండి రెండవ విక్రమేంద్ర భట్టారకవర్మ చరిత్ర మరొకసారి పునరావృతం చేసుకుందాం. ఈతని తండ్రి ఇంద్ర భట్టారకవర్మ పిఠాపురరాజ్యాన్ని జయించినప్పటికి వేంగి ఏ రాజ వంశపు ఆధీనంలో ఉంది ? లేదా విక్రమేంద్ర భట్టారకవర్మ చిక్కుళ్ల తామ్రశాసనకాలం నాటికి ఆతడు ఆ భూభాగాన్ని ఎవరి వద్దనించి స్వాధీనం చేసుకున్నాడు ? 570 తర్వాత ఎవరి వశ మైంది ? చిక్కుళ్ల శాసనకాలం నాటికి వేంగి పల్లవుల పరిపాలన క్రింద ఉండి ఉంటుందని మరుసటి సంవత్సరం ఇచ్చిన ఈతని తుమ్మలగూడెం రెండవ తామ్రశాసనం చెబుతుంది. క్రీ. శ. 480 వరకు వేంగి పల్లవరాజు యువమహారాజు విష్ణుగోపవర్మ కుమారుడు రెండవ సింహవర్మ ఆధీనంలో ఉందనే నిర్ణయానికి వచ్చాం. ఆ తర్వాతకూడ వేంగి (క్రీ.శ. 566) వరకు వారి ఏలుబడిలోనే ఈ భూభాగం ఉన్నదనడం అసంగతం కాదేమో. విష్ణుకుండి విక్రమేంద్ర భట్టారకవర్మ రెండవ తుమ్మలగూడెం శాసనంలో చెప్ప బడిన పల్లవసింహుడు యువమహారాజ విష్ణుగోపవర్మ సంతతి వాడైన మూడవ సింహవర్మగాని, అతని కుమారుడు సింహవిష్ణువు గాని కావచ్చు.[22] పల్లవులతో జరిగినయుద్ధంలో విష్ణుకుండినులు ఓడి, వారితో సంబంధ బాంధవ్యాలు చేసుకుని సంధిచేసికొని ఉండ వచ్చు. పల్లవుల చరిత్ర వ్రాసిన [23] దూబ్రాయి పండితుడు పల్లవ, విష్ణుకుండి గుహాలయ వాస్తునిర్మాణ సారూప్యాదులను గురించి చర్చించారు. ఈ రెండు రాజవంశజులు నిర్మించిన గుహాలయాలు. ఒకే వాస్తుశిల్ప రీతులలో ఉండడంవల్ల విష్ణుకుండినులనాటి మొగల్రాజపురం, ఉండవల్లి గుహాలయాలనిచూచి పల్లవులు తమిళ దేశంలో గుహాలయాలు నిర్మించిఉంటారని, పల్లవ మూడవ సింహవర్మ కుమారుడు సింహవిష్ణువు విష్ణుకుండి రెండవ విక్రమేంద్ర భట్టారకవర్మతో చేసిన వివాహసంబంధం ఫలితంగా ఉదయించినవాడే సింహవిష్ణువు కుమారుడు మహేంద్ర విక్రముడనే అభిప్రాయం వెలిబుచ్చారు. గుంటూరుజిల్లా చేజర్ల కపోతేశ్వరాలయ శిలా శాసనంలో పల్లవుల గోత్రమయిన భారద్వాజగోత్ర ప్రస్తావన మహేంద్ర విక్రమునిపేరు చెప్పబడటం గమనార్హం.

దుబ్రాయిగారి అభిప్రాయం ఏదయినా, విష్ణుకుండినులు పల్లవులతో చేసిన యుద్ధంవల్ల వారి బలప్రాభవాలు కుంటుపడ్డా యని అభిప్రాయం కలుగుతుంది. క్రీ. శ. 566 లోని రెండవ విక్రమేంద్రభట్టారకుని తరవాత శాసనం ఆతని 14 వ సంవత్స రంలోని తూండిగ్రామ శాసనం. ఇదే అతని కడపటి శాసనం. పల్లవరాజులతోటి యుద్ధం తరువాత విష్ణుకుండినుల సామంతులు ప్రబలులై వారిని తూర్పు గోదావరి విశాఖజిల్లా ప్రాంతం వరకు తరిమి వేంగిని ఆక్రమించి ఉంటారు. ఈ కారణంవల్లనే నాల్గవవర్మ క్రీ. శ. 594లో వేంగిని తిరిగి ఆక్రమించుకుని ''దశశత సకల ధరణీతల వరపతి'' అని బిరుదు పెట్టుకున్నాడు. రెండవ విక్రమేంద్రునికి, నాల్గవ మాధవవర్మకి మధ్య కాలంలోవేంగి ఎవరి ఆధీనంలో ఉన్నదని సందేహం. దీనికి సమాధానంగా సమ కాలీన రాజవంశ చారిత్రక వస్తుసామగ్రిని ఆధారంగా తీసుకుందాం.

బాదామి చాళుక్య ప్రభువు రెండవ పులకేశివల్లభుడు, ఆతని తమ్ముడు కుబ్జవిష్ణువర్ధనుడు తమ శిలా తామ్ర శాసనాలలో తాము వేంగిని దుర్జయులని తరుమగొట్టి ఆక్రమించుకున్నామని చెప్పుకున్నారు. తీరాంధ్రంలో పరిపాలించిన తాండివాడ పృథ్వీ మహారాజు దుర్జయవంశస్థుడు. ఆతని కడపటి శాసనం 49 వ సంవత్సరంనాటిది. కుబ్జవిష్ణువర్ధనుడు దుర్జయుల నోడించి వేంగి నాక్రమించి క్రీ. శ. 624 లో తూర్పు చాళుక్య రాజ్య వంశ స్థాపకుడయ్యాడు. అంటే పృథ్వీ మహారాజు 49వ రాజ్య వర్షం క్రీ. శ. 624 గాని, అంతకుముందుగాని అవుతుంది. క్రీ. శ. 624 నుంచి 49 సంవత్సరాలు మినహాయిస్తే ఆతని మొదటి రాజ్య సంవత్సరం క్రీ. శ. 575 నాటికి సరిపోతుంది. రెండవ విక్రమేంద్రభట్టారకుడి కడపటి రాజ్యవర్షం శాసనాధారాల ప్రకారం 570 అయినప్పటికి, తర్వాత 4, 5 సంవత్సరాలు రాజ్య పరిపాలనచేసి, పృథ్వీ మహారాజుతో జరిగిన యుద్ధంలో మరణించిఉంటాడనడం అసమంజసం కాదేమో. తరువాత వేంగిలో రణదుర్జయుల పరిపాలనకి తాత్కాలికంగా అంతరాయం కలిగించిన వాడు విష్ణుకుండి నాల్గవ మాధవవర్మ. వేంగిని జయించి, రణ దుర్జయ రాజ్యాన్నికూడా స్వాధీనం చేసుకోవాలన్న ప్రయత్నంలో విఫలుడై వీరమరణం పొందినవాడు నాల్గవ మాధవవర్మ. ఈతని మరణంతో తీరాంధ్రంలో విష్ణుకుండి వంశజుల శకం అంతరిం చింది. 30 సంవత్సరాల తర్వాత దాదాపు 350 సంవత్సరాలు కోటి దివ్వెల వెలుగై ప్రకాశించిన తూర్పు చాళుక్య రాజవంశానికి నాందీ ప్రస్తావన చేశాడు రెండవ పులకేశి వల్లభుని తమ్ముడు కుబ్జవిష్ణువర్ధనుడు.

★ ★ ★

ఇక తీరాంధ్రంలో గుహాలయాలని గురించి ఒక్కమాట. ఇవి ఉండవల్లి, మొగల్రాజపురం, గుంటుపల్లి, సంకారం మొదలైనవి. సంకారం బౌద్ధారామం. గుంటుపల్లిమహామేఘవాహన బిరుదాంకితుడు కళింగ మహిషక దేశాధిపతి, అయిన ఖారవేలుడి కాలంనాటివని అక్కడ దొరకిన శిలా శాసన ఫలకాలవల్ల తెలు స్తుంది. అదే కాలపు శాసన లిపిలో దొరకిన శిలా శాసనంలో ఈ గుహాలయ ప్రాంతపు ప్రాచీననామం ''నాగశైల''. ఇక ఉండ వల్లి, మొగల్రాజపురం గుహాలయాలు పల్లవ రాజుల వాస్తునిర్మాణ మని, విష్ణుకుండినుల కాలపునాటివని, చరిత్ర కారులు భిన్నాభి ప్రాయాలు వ్యక్తంచేశారు. ఖారవేలుడి శాసనం తరువాత చారిత్ర కాధారాలనుబట్టి పరిశీలిస్తే వేంగిని పరిపాలించిన మొదటి రాజ వంశం శాలంకాయన రాజవంశం.

గుంటుపల్లిలో శాలం కాయన రాజులలో కడపటి రాజైన నందివర్మ శిలాశాసనం బయల్పడినట్లు తెలుస్తోంది. దీనినిబట్టి పరిశీలిస్తే ఉండవల్లి, మొగల్రాజపురం గుహాలయాల నిర్మాణం శాలం కాయనుల కాలంనాడే జరిగి ఉండవచ్చునని, వాటికి మెరుగులు దిద్దినవారు వారిని జయించిన పల్లవరాజులు కావచ్చు నని అనుమానించవలసి వస్తుంది.

## అధోజ్ఞాపికలు


1. Epi Ind., XVII, pp. 334-37; Ibid-XII pp.133 ff., Ibid-IV, p.193-98., A.P.G.S., No.8., Bharati, Vol. 42., No. 6. (1965).
2. E. I; XVII, pp. 337-39.
3. "విష్ణు కుండినులు" — డాక్టరు నేలటూరు వేంకటరమణయ్యగారు, పుటలు 30–31.
4. E. I; XII; pp. 133-36.
5. Corpus Inscriptionum Indicarum, Vol. III, Ne. 51, pp.228-30.
6. "పల్లవులు — చాళుక్యులు" — డా. నే. వేంకటరమణయ్యగారు, పుటలు 114–123; E. I; XII.
7. E. I; XXXV; No. 31.
8. E. I; XXXI, pp. 7; Bharati, Aug. 1924; J. A. H. R. S; Vol. II; p. 92.
9. E. I; Vol. III, pp. 142 ff.
10. Ibid, Vol. IV; pp. 193-98.
11. Copper Plate Inscriptions in the A. P. Govt. Museum, vol., pp. 236 ff by Dr. N. Ramesan.
12. Ind. Ant. vol. V., pp 155-56.
13. Epi. Andh., vol. I., pp 57 ff.
14. Bharati, vol. 42, No.6 (1965)
15. Bombay Gazeteer, vol. I, part II, p. 334
16. Copper plate Inscriptions in the A.P. Govt Museum, vol. 1., by Dr. N. Ramesan.
17. A.P.G.A.S., No. 8.
18. Bharati, vol.VII, No.8., vol. VIII, pp 302-315.
19. E.I., XVII, No. 20., pp. 334-37.
20. E.I., vol. XXXVII, p. 125.
21. ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము — శ్రీ కుందూరి ఈశ్వరదత్తు, పుట 130.
22. కేలూర్‌పాళెం తామ్రశాసనం; ద. భారత శాసనములు (S.I.I.) సం. 2., పుట 503.
23. The Pallavas, p. 35 — G J. Dubreuil.


## కన్నడ సాహిత్య చరిత్ర - ఒక సమీక్ష

( 47 వ పేజీ తరువాయి )

'భావంబెక్కడలేక వృత్త నియమూపాయంబు జింతింపకెందే వర్తించిపదార్థవంచనలచేదీపించి'అన్నరామరాజభూషణునిపలుకులు. 'పారదె పదార్థమం వరయతిగె, భంగ మంతారదె, నిజాన్వయ క్రియగళ్ దూషణం'గా కన్నడ జైమిని భారతంలో రూపొందాయి.

పిడపర్తి బసవన, సోమనాధులు కన్నడ దీక్షా బోధను, ప్రభులింగలీలెను తెనుగుచేశారు. బెంగళూరు నగర నిర్మాత తెలుగువాడైన కంపేగౌడ (క్రీ. శ. 1513–69) లేదా అతని మనమడు 'గంగా గౌరీ విలాసము' ను రచించినట్లు తెలుస్తున్నది.

ఆంధ్ర సాహిత్య చరిత్రలో ప్రశస్తికెక్కిన రాయలయుగం వలె కన్నడ సాహిత్య చరిత్రలో చిక్కదేవరాయయుగం (క్రీ. శ. 1700–1900) విశిష్టమైనది. మైసూరు రాజకుటుంబాలలో బడెయర్లు, వారిలో చిక్కదేవరాయలు విఖ్యాతులు. చిక్కదేవరాయ సంగీత సాహిత్యాలలో అభిరుచి గల్గినవాడు. 'రసికజన కర్ణరసాయనీకృత విస్తరం' బిరుదాంకితుడు. అతని రచనలలో 'చిక్కదేవరాజ బిన్నప' 'గీతగోపాల'పేర్కొనదగినవి. తిరుమలార్య,సింగరార్య,చిక్కుపాధ్యాయ మొదలైన కవులు, శృంగారమ్మ, హోన్నమ్మ మున్నగు కవయిత్రులు వుండేవారు. ఈ యుగానికి చెందిన కవులలో 'రామాశ్వమేధ' కర్త ముద్దణ మేటివాడు. దంపతుల మధ్య సంభాషణా రూపములో కావ్యమును సాగించినముద్దణకవి వృత్తిరీత్యా వ్యాయామ శిక్షకుడు. చిక్కదేవరాయల కుమారుడైన మూకరసు తెలుగులో రచనలు చేసినట్లుతెలుస్తున్నది. కళాలె వీరరాజు, గీర్వాణాంధ్ర కర్ణాటకాది నానాభాషా కావ్యరచనా చతురుడు.

19వ శతాబ్ది చివరికాలంనుండి కన్నడంపై ఆంగ్లభాషాప్రభావం ఎక్కువైంది. బసప్పశాస్త్రి, కెంపు నారాయణ, వెంకటాచార్య మొదలగువారు పెక్కుఅనువాదాలు చేశారు. ఆధునిక కన్నడ కవిత్వానికి ప్రాణం పోసినవారిలో శ్రీ బి.యం.శ్రీకంఠయ్య, పంజీమంగేశరాయ, గోవిందపై, డి.వి.గుండప్ప, దత్తాత్రేయబేంద్రె, మాస్తి వెంకటేశ అయ్యంగార్ ఆద్యులు. నవలాకర్తలలో డా.శివరామ కారంత్, అ.న. కృష్ణరాయ, గోకాల్, దేవుదునరసింహశాస్త్రి, త.రా.సు. టి.ఆర్. సుబ్బరావు, కృష్ణమూర్తి పురాణిక్, నిరంజన, బీచి, యు.ఆర్. అనంతమూర్తి, ఎస్. ఎల్. బైరప్ప, శ్రీకృష్ణ ఆలనహళ్ళి, రచయిత్రులలో త్రివేణి, ఎం.కె.ఇందిర మున్నగువారు ప్రసిద్ధులు.

ఆధునిక కన్నడ నాటకకర్తలలో టి. పి. కైలాసం, ఆద్య రంగాచార్య, గిరీస్ కర్నాడ్, లంకేశ్. వ్యాస రచయితలలో శ్రీరంగ, ఎ.ఎన్.మూర్తిరాయ, గొరూరు రామస్వామి అయ్యంగార్, కస్తూరి ఎస్.వి రంగణ్ణ, వి. సీతారామయ్య మొదలగువారు గణనీయులు. డా. కె.వి. పుట్టప్ప, డా. బేంద్రే వివిధ ప్రక్రియలలో ఆరితేరిన వారేకాక జ్ఞానపీఠ బహుమతి నందుకొన్న మేధావులు.

గ్రంథం చివరిభాగంలో డా. సుందరంగారు విభిన్న సాహిత్య ప్రక్రియల వైశిష్ట్యాన్ని విపులీకరించి వ్రాశారు. ఉపసంహారములో తెలుగువారైన కన్నడభాషాభిజ్ఞులగు శ్రీయుతులు టి. యస్. వెంకణ్ణయ్య, టి.యస్.శ్యామరామ, నంజనగూడు శ్రీకంఠశాస్త్రి,వీరకేసరి సీతారామశాస్త్రి, దేవుడు తరాసు, కె.యస్ జానకిరామయ్య, కె.సుబ్బరామప్ప పేర్కొనదగినవారు.ఎందరోకన్నడపండితులకు తెలుగుబోధించిన శ్రీమాన్ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు కన్నడములో రచించిన'గానకలె','సాహిత్యమత్తుజీవనకలె'అందరిప్రశంసనందుకొన్నారు.

కన్నడ సాహిత్య చరిత్రను విపులముగ రచించి, తెలుగువారి కుపకరించిన డా.ఆర్వియస్ సుందరంగారిని మనసార అభినందిస్తున్నాను.

* కన్నడ సాహిత్య చరిత్ర–రచయిత డా ఆర్వియస్ సుందరం. VI+244 పుటలు. ప్రచురణ: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, హైదరాబాదు–500004 వెల–రూ. 5.

— శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

శ్రీ నిడుదవోలు సుందరేశ్వరరావు

# గోళగి మఠములు - ఆంధ్రదేశము

"శ్రీకంఠశివులు గౌరీనాథ శివులు
లోకేశ శివులు త్రిలోచన శివులు
నీశాన శివులు మహేశ్వర శివులు
పాశమోచన శివుల్వరమాత్మ శివులు
శాశ్వత శివులు గణేశ్వర శివులు
విశ్వేశ శివులును విమలాత్మ శివులు
త్రిపురాంతక శివులు త్రినయన శివులు
ద్విపదైత్యహారి శివు ల్దేవేశ శివులు
నురులింగ శివులును సుగ్రాక్ష శివులు
హర శివులును బరమానంద శివులు
ధర్మ శివులును విద్యాధర శివులు
నిర్మల శివులును నిష్కల శివులు
మొదలుగాగల శైవ ముఖ్యులందఱును
నిది యేమి మతములో నెఱుంగంగరాదు
బసవయ్య తోయుంపు భక్తులఁ జూచి
వసుధదారును లింగవంతుల మనుచుఁ
దొడఁగి ప్రసాదంబుఁ గుడుచుచున్నారు
నడరఁగ మాకించుకైనను నిడరు"

అని కల్యాణపురమందలి బోయలు బిజ్జలునితో మొర బెట్టుకొనిరట !

(బసవ పురాణము (1926) పు. 229.)

బిజ్జలుడు పశ్చిమ చాళుక్యుల కడ సామంతుడుగ నుండి క్రీ. శ. 1167 వరకును కల్యాణపుర ప్రాంతమును పాలించినాడు. ఇతని కడనే బసవేశ్వరుడు దండనాయకుడు. దీనికి వాఙ్మయాధారమే కాని సమకాలీన శాసనాధారము లేదు. ఏమైననేమి పై ద్విపదల యందుదాహృతులైన శివ శబ్దధారులెవరు? వారికి తెలుగు దేశముతో నెట్టి సంబంధము కలదు ? అను ప్రశ్నలకు సమాధాన ప్రయత్నమే ఈ వ్యాసోద్దేశము. పాల్కురికి సోమనాథుడు కాకతీయ ప్రతాపరుద్రుని (1295–1323) కాలమువాడు. (వెంకట రమణయ్య పు.107) కావున సోమన తన గ్రంథములలో నెక్కించిన చారిత్రక విషయము లన్నియు నంతకు పూర్వవిషయములేయని వేరుగా చెప్పనవసరములేదు.

2. కాకతీయులు తొలుత జైనమతాభిమానము కనబరచి నన్ను, తరువాత తరువాత శైవమునందే ఆదరణమును చూపిరి. మొదటి ప్రోలరాజు (1075) కాలిముఖ రామేశ్వర పండితుని ఉత్తమ శిష్యుడు. (హనుమకొండ 35. వ. జి. శా.) కుమారుడైన రెండవ బేతరాజును (1090) నీతని శిష్యుడే (కాజీపేట 15. వ. జి. శా). రుద్రదేవుడు (1150–1195) తాను జయించిన ప్రదేశములందు తనపేర రుద్రేశ్వరాలయములను నిర్మించెననియు, హనుమకొండలోని సహస్రస్తంభ రుద్రేశ్వరాలయ మీతడు కట్టించెననియు తెలియుచున్నది. (ద.ప్రా.చ. 597) మహాదేవరాజు (1195-1198) 'గౌరీభర్తుః ప్రసాదా దధిగత నియత ప్రాజ్య రాజ్య' పదస్థుడు. ప్రముఖ శివసిద్ధాన్త ప్రవర్తకుడైన ధ్రువేశ్వర మునీశ్వర శిష్యుడు (వరంగల్లుకోట 47. వ. జి. శా). మహాదేవరాజు కాలము వరకు కాలాముఖ శైవమే తెలంగాణా ప్రాంతమున ప్రచారములో నుండెడిది. శ్రీశైల ప్రసిద్ధ మల్లికార్జున శిలామఠమున చెందిన కాలముఖ తపోధనులైన రామేశ్వర పండితుడు 'లకులేశ్వరాగమ మహాసిద్ధాంత సారామృతము'ను గోరిన వాడు. గణపతిదేవుని కాలమున వీరి ప్రభావము సన్నగిల్లినది. వీరి స్థానమును గోళగిమఠ సంప్రదాయమువారు సంపాదించిరి.

3. క్రీ. శ. 1261 మార్చి 25వ తేది కాకతి రుద్రాంబ గణపతిదేవుని దీక్షాగురువైన విశ్వేశ్వర శివునకు మందారం (నేటి మందడం. గుంటూరు తాలూకా, జిల్లా) అను గ్రామమును, కృష్ణానదికి దక్షిణ తీరముననున్న లంకభూములను దానముచేసెను. దీనికే 'మాల్కాపుర శాసన'మని పేరు. (JAHRS. IV. 1930; 147–164 కా. సం. అ. 71, 81, SII. X No. 395).[2] అందు విశ్వేశ్వర శివునిగూర్చియేగాక, గోళగి గురుపరంపర, మఠ స్థాపన, దాని స్వభావము మొదలైన అపూర్వ విషయములున్నవి. కావుననే ఆంధ్రదేశ చరిత్రకారులకేగాక యావద్భారత వర్ష చరిత్ర కోవిదులకు సుపరిచితము.

**శాసన సారాంశము:** కాకతి గణపతి దీక్షాగురువు, గౌడ రాడోల్లసత్పూర్వగ్రామ శిఖామణి, విద్యామండపవర్తి, శాంతుడు, శుచి, శైవరహస్య వేది, ధర్మశివుని శిష్యుడైన విశ్వేశ్వర శంభువునకు గణపతి దేవుడు వాగ్దత్తము చేసిన మందర గ్రామమును, రుద్రమదేవి తాను దానము చేసిన వెల్లపూడి గ్రామముతోబాటు విశ్వేశ్వర దేశికునకు క్రీ. శ. 1261లో అష్టస్వామ్య సహితముగా దానము చేసెను. వెల్లపూడి, మందరమును కలిపి గోళగి మఠముగా విశ్వేశ్వర దేవుడు ఏర్పరచెను.

(చూ. ప్రధాన శాసనము—అనుబంధము)

## శాసన వివరణము

4 మాల్కాపుర శాసనములోని అనేక విషయములు వ్యాఖ్యాసాపేక్షములు.

**డహాల మండలము :** ఇది భాగీరథీ నర్మదా నదుల మధ్య మండలము. అనగా నేటి జబ్బల్‌పూర్ పరిసర ప్రాంతము. తెలుగుదేశము నేలిన తూర్పు చాళుక్య వంశీయుడు గుణగ విజయాదిత్యుని (884–888) మహాసేనాని దీనిని జయించినట్లు—

> "కిరణపురము డహాల నిరుతంబు దక్షిణాదు
> నచలపురము సొచ్చె నచలితుండు" అని

చాళుక్య భీముని ధర్మవరశాసనము[3] చెప్పుచున్నది. అనగా సుమారు వేయి సంవత్సరముల క్రింద మనకు డహాలతో పరిచయము కలదు. దీనిని కాలచూరి చేది వంశస్థులు పరిపాలించుచుండెడివారు. వీరి రాజధాని త్రిపురి.[4] (నేటి తివూర్ జబల్‌పూర్ జిల్లా). ఈ రాజులలో రెండవ కోకల్లుని గంగయదేవుని కాలమున కాలచురి—చేది రాజ్యము మహోన్నతస్థితికి వచ్చెను. గంగయదేవుడు 1019 నాటికే రాజ్యమునకు వచ్చి ఉత్కళమును జయించి 'త్రికళింగాధిపతి' యను బిరుదము పొందెను. ఇతని తనయుడు కర్ణుడు (1034–42) రాజ్యమునకు వచ్చి రాఢామండలము (నేటి పశ్చిమ బెంగాల్)ను గూడ జయించెను అక్కడ పాలవంశీయులు పరిపాలన మొనర్చుచుండిరి. వారిలో విగ్రహపాలునికి తన కూతురైన యౌవనశ్రీని ఇచ్చి వివాహము చేసెను. కాలచురి—చేది వంశస్థులలో యశః కర్ణదేవుడు (1073–1123) ఆంధ్రదేశమునకు వచ్చి తూర్పు చాళుక్య ప్రభువైన 7వ విజయాదిత్యుని (1061–1076) ఓడించి యాతని వస్తుచయము నెల్ల కొల్లగొని యాభూషణములతో దక్షవాటి భీమేశ్వరు నర్చించితినని యశఃకర్ణదేవుడు తన ప్రతాపమును జెప్పుకొనెను.

> అంధ్రాధీశమరంధ్ర దోర్విలసితం స్వచ్ఛంద ముచ్ఛిందతా
> యేనాభ్యర్చ్యత భూరిభిః స భగవాన్ భీమేశ్వరో భూషణైః ।
> యస్యావర్ణ్యయదాత్త నృత్యలహరీ భ్రూవల్లి గోదావరీ
> గాయంత్యున్మదహంసనాద మధురైః స్రోతస్వరైః సప్తభిః॥

(ఖైరా తామ్రశాసనము. EI. XII. పు. 205. వెంకట కృష్ణారావు 169)

(యశః కర్ణదేవుని యశమును సప్తగోదావరి యందలి మద హంసలు మధురనాదము చేయుచుండ, తరంగములు నృత్యము చేసినవి)

ఈ విజయాదిత్యుడు ఆంధ్రమహాభారత శ్రోత రాజరాజ నరేంద్రుని సవతి తమ్ముడు.

త్రిపురి కాలచుర్యులు మన పొరుగువారైన కల్యాణి చాళుక్యులకు బంధువులు. ఉత్తరమున కాలచుర్యులు, పడమట కల్యాణి చాళుక్యులును వేంగీ చాళుక్యులకు ప్రక్కలోని బల్లెములవలె నుండిరి.

ఈ విధముగా పది, పదకొండు పండ్రెండవ శతాబ్దములలో ఆంధ్రులకు చేది కాలచుర్యులతోడను, కాలచుర్యులకు పశ్చిమ బంగ్లాదేశములోని రాఢామండలముతోను పరిచయమున్నది.

## 5. దుర్వాసోన్వయము :[5, 6]

శాసనములోని మొదటి గురువైన సద్భావ శంభువు దుర్వాసోన్వయమునకు చెందినవాడు. దుర్వాస మహాముని అపరరుద్రుడు, మునీంద్ర సార్వభౌముడు, క్రోధసిక్త తపోనియతుడు. (పాల్కురికి సోమన. పం. చ. దీక్షా 106). శర్వాంశ సంభవుడు. (తిక్కన అను 5–383) శివుడు త్రిపుర నాయకులను జయించిన బాణమును తన అంకమున నిడికొనినది బాలుడయినది. ఆబాలుడే దుర్వాసుడు. (సం. భా 13. 145. 3, తిక్కన అను 5–389) కావుననే దుర్వాసుడు శర్వాంశ సంభవుడయినాడు. కలియుగము ప్రవేశింపగనే శివధర్మము విచ్ఛిన్నమైనదనియు, నిఖిల శైవ శాస్త్రోపనిషత్సారమును భూలోకమున ప్రచారము చేయుటకు దుర్వాస మహామునిని ఆజ్ఞాపించినట్లు తంత్రాలోకమను గ్రంథము (V. S. P–29) (తత్త్వప్రకాశ–2,3) చెప్పుచున్నది. ఆ మునికి త్ర్యయంబక, ఆమర్దక, శ్రీనాథులను ముప్వురు మానస పుత్రులుదయించిరనియు,వారుక్రమముగా అద్వయ, ద్వయ,ద్వయాద్వయ మతములను వ్యాఖ్యానించిరనియు, మఠముల నేర్పరచిరనియు ఆ గ్రంథమునందే కలదు. దుర్వాసుడే ఆమర్దక మఠ మూలపురుషుడని తాంత్రిక గ్రంథములలో నున్నదట. (V.S.P, 30)[7] కర్ణాట దేశములో ఆలూపరాజయిన దత్తపేంద్ర శ్రీమారుడు ముదుకెరె సోమేశ్వరాలయములో వేయించిన శాసనములో తన గురువైన గగన శివుడు "శ్రీమతు దుర్వాసను మునీంద్ర వంశ తిలకయ సంతతి సంజాతరప్ప శ్రీమత గగన శివాచార్య" డని పేర్కొనబడినాడు. (SII. VI. No. 134. VSP 31) క్రీ. శ. 1212లో విమల శివుని శిష్యుడైన శాంతశివుడు దుర్వాసుని అపరావతారమని కాలచురి త్రైలోక్యమల్లుని (Dhureti Plates. Mirashi 11–369–374) శాసనమున గలదు. ఈ శాసన రచయిత విశ్వేశ్వర పండితుడట.

దీనినిబట్టి తేలిన దేమనగా మా. శా. లో చెప్పబడిన దుర్వాసుడు ప్రాచీనకాలపు శైవమహా మునీశ్వరు డనియు, ఆతని మానసిక సంతతివారు త్ర్యయంబిక, ఆమర్దక, శ్రీనాథులనియు వారు ఒక్కొక్కరిపేర మఠములను స్థాపించుకొని శైవమతము ప్రచారము గావించిరనియు స్పష్టముగా తెలియుచున్నది.

## 6. సద్భావశంభు

మా. శాసనములోని గురుపరంపరలో మొదటివాడు. ఈతని పేరు దహాళ మండలములోని కాలచురి చేది వంశమువారు వేయించిన శాసనములలోగాని, గురుపరంపరలలోగాని కానరాదు. కాని వి. ఎస్. పాఠక్‌గారు కాలచురి ప్రథమ యువరాజ దేవునిచే (915–945)

భూరి దానములు గొన్న ప్రభావ శివుడే సద్భావ శంభువని గట్టిగా నమ్మిరి. (VSP46-47) కాని ఈ నమ్మకమును వి. వి. మిరాశీ గారు త్రోసిపుచ్చిరి.[8]

మిరాశీగారి అభిప్రాయ మెట్లున్నను మా. శాసనములో—

''తస్మైనిస్పృహచేతసే గళచురి క్ష్మాపాల చూడామణి
గ్గ్రామాణాం యువరాజ దేవనృపతి ర్భిక్షాం త్రిలక్షీం దదౌ
కృత్వాస శైవముని రద్భుత శీలమూర్తి
శ్రీగోములకీ మఠముదార ముదాత్తచిత్తః
త్ర స్యాకరస్య నృపదేశిక మౌక్తికానాం
వృత్తిం చకార సకలానుపితాం త్రిలక్షీం''

అని స్పష్టముగా చెప్పబడి యుండుటచేత కాలచురి క్ష్మాపాల చూడామణియైన యువరాజ దేవునిచేత మూడులక్షల గ్రామము లను భిక్షగా గ్రహించి శ్రీగోములకీ మఠమును సద్భావ శంభువు కట్టించెననునది సత్యమైన విషయమే. ఈ దానమును చేసినవాడు కాలచురి ప్రథమ యువరాజదేవుడు (915-945). ఈతని గుర్గి, చంద్రెహి శాసనములు (EI XXII. 127, CII Mirashi No. 44) యువరాజ దేవుడు చేసిన భూరిదానము సమర్థించు చున్నవి. చంద్రెహి శాసనములోని—

''తతో మధుమతి పతేకృత మహాతపస్యాంచయ
ప్రభవశివ ఇత్యభూత్సకల శైవ చూడామణిః
అనేక నృపవందితః స యువరాజ దేవేన
యస్తపోధనపతిః కృతచరణపూత గోల్గిక ః''[9]

యను శ్లోకమును ఈ గోల్గి లేదా గోములక లేదా గోళగి మఠ మును స్థాపించుటకు అనంతధనము నిచ్చినటుల

''సత్వోపకార భవదుత్తమ కీర్తి హేతోర్గ్రాహ
యన్మఠ మనంత ధనప్రతిష్ఠాం''

అను గుర్గిశాసనములోని వాక్యము ప్రబల నిదర్శనములుగానున్నవి. కాని శాసనగ్రహీత ప్రభావ శివుడుకాని సద్భావ శివుడు కాదు. ప్రథమ యువరాజ దేవుని ప్రసక్తి 300 సంవత్సరముల తర్వాత మా. శాసనములో నుండుటచేతను, త్రిపురి నేలిన కాలచురి రాజులు 1212లో అంతరించిపోవుట చేతను ప్రభావశివునికి మారుగా సద్భావ శివుని మాల్కాపుర శాసనకర్త జ్ఞాపకమును బట్టి వ్రాసియుండును. ఈ ఊహ బలపడునంతవరకు సద్భావ శంభువు క్రీ. శ. 945 కాలము వాడని, దహల మండలము నేలిన త్రిపురి కాలచురి రాజుల రాజగురువని స్పష్టమగుచున్నది. ఇతడే గోళగి మఠశాఖకు ప్రథమ గురువు. మా. శాసనములో నీతనిని 'శైవానాం ప్రథమాయ' అని విశేషించి చెప్పుటకు గూడ కారణమిదియే.

సద్భావ శంభువు దుర్వాసోన్వయ సంభవుడని మా. శా. చెప్పినను నీతడే మఠమువాడో తెల్పలేదు. అయినను ప్రభావ శివుడే సద్భావ శంభు వైనచో ప్రభావ శివుడు మధుమతేయ మఠమునకు చెందినవాడు. ఈ మఠము నేటి మధ్యప్రదేశ్ జబ్బలపూర్‌కి సమీపమునమున్న 'తెరాహి' అను ప్రదేశ మునకు దక్షిణముగా నొక మైలుదూరములో మహోవా అను గ్రామము. ఈ మఠము, మత్తమయూర, అమర్దక మఠములు – గుహావాసి లేదా కదంబ గుహావాసి మఠమునుండి వేరయినవి.

## గుహావాసి : బిక్షాటన :

గుహావాసి గురించి కూడ చిత్రమైన కథ ఏర్పడినది. దారువన విహార సందర్భమున శివుడు గుహావాసిగా నవతరించి బిక్షాటన రూపమున ముని పత్నుల హృదయములను మరులుగొల్పె నట. బిక్షాటన మూర్తియే గుహావాసి. శివుని లీలలలో బిక్షాటన మొక లీలగదా ! (పం. చ. వాద 621 – 625 ) (హరవి. 5. 41-56). గుహావాసి పండితారాధ్య చరిత్రలోని గణమాలికలో పేర్కొనబడియున్నాడు. హోస, గుహావాస, హరమహామాయ (మహిమ–75), లకులీశ్వర గుహావాస (మహిమ–82)[10] పెద్ద పెద్ద మఠాధి పతులు భిక్షార్థమై వెడలుట, గొప్పగొప్పవారు ఆయా మఠాధిపతులకు భూరి బిక్ష నిడుట నేడు మనము చూచుచునే యున్నాము. బహుశః ఈ సంప్రదాయమునకు శివుని భిక్షాటనమునకేమైన సంబంధము కలదేమో! యువరాజ దేవుడిచ్చినది భిక్షయే గదా ! తమిళ దేశమున లక్ష్యాధ్యాయి, తెలుగుదేశమున భిక్షావృత్తి మఠములవారు గోళగి మఠమునకు సంబంధించిన వారగుటచే నీయూహ సమంజసముగనే కన్పట్టు చున్నది. గుహావాసి క్రీ.శ. 675 ప్రాంతమువాడని వి.ఎన్. పాఠక్ గారు లెక్కగట్టినారు. (V. S. P. 31)

# 7. సోమశంభువు :

ఇతడు మా. శా. గురు పరంపరలో రెండవవాడు. సద్భావ శంభువు పేరు వలెనే ఈతని నామము గూడ కాలచురి గురు పరం పరలో కనబడదు. సకలాగమ సింధుసేతు వనదగిన పద్ధతి నొక దానిని రచించినట్లున్నది. దానికి సోమశంభు పద్ధతి యని చెప్ప వచ్చును. పాల్కురికి సోమనాథుడు తన సోమనాథ భాష్యములో సోమశంభొ

''నిజమూర్తా గురోర్మూర్తా
హస్తకే సలిలే న లే
చిత్రాదౌ స్థండి లే లింగే
ఏవ మష్ట విధార్చనం''
(శివలింగ ధారణ మాహాత్మ్యం 4 ప్రకరణం)

అని ఒకే ఒక శ్లోకమును నుద్ధరించినాడు.

చోళ మహాచక్రవర్తి మొదటి రాజరాజు (985-1014) గురువగు ఈశాన శివుని శిష్యుడు విమల శివుడు. రాజేంద్రచోళుని (1012-44) రాజగురువు సర్వశివుడు. ఈ విమలశివుని శిష్యుడు

సర్వశివుని శిష్యుడే. సోమశంభువని కర్మ క్రియాకాండ యను గ్రంథము తెల్పుచున్నది. (V S P 38). శివభూషణ గ్రంథము —పద్ధతి వ్రాసిన సోమశంభుని పేర్కొన్నదని, లభించుచున్న సోమ శంభు పద్ధతి రచన కాలము 1095 అని వి. ఎస్. పాఠక్ వ్రాసియున్నారు కాని వాని ఆకరములు స్పష్టముగా విశదీకరించ లేదు. (V S P 38, 40). అఘోర శివాచార్యులు వ్రాసిన క్రియా క్రమోద్యోతముపై నిర్మలమణి గురువు లఘుప్రభ యను వ్యాఖ్య వ్రాసినాడు. అందు సోమశంభు పద్ధతి ఎక్కువగా కొని యాడబడినదట. (చూ. అఘోరశివాచార్యులు. (ఆం. బా. భూ. సర్వస్వము. సం. 1). ఇందు విమలశివ, ధర్మశివ, విశ్వేశ్వరశివులు పేర్కొన బడినందున 14 వ శతాబ్ది తరువాత వ్రాయబడిన గ్రంథమై యుండును. సాయణ మాధవుని సర్వదర్శన సంగ్రహ ములో గూడ, సోమశంభు పద్ధతి నుండి శ్లోకములు రెండుద్ద రింపబడినవి.[11] ఏమైననేమి తెలుగు దేశ పరిశోధకుల కిది కంట బడకుండనున్నది. "శివలెంక మంచన పండితు డీ సోమశంభువు మనుమడట" అని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు వ్రాయగా (పీఠిక. బస. పు. 75) చిలుకూరి నారాయణరావుగారు పండితా రాధ్య చరిత్ర ఉపోద్ఘాతములో కన్నడ గ్రంథములలో శివలెంక మంచనను గురించిన యీ క్రింది విషయములు తెలియవస్తు న్నవి. ఈతని తాత సోమశంభు దేశికుడు. తండ్రి కామితాద్యఖిల శివకథిత తంత్రావళికి ప్రేమతో వృత్తి దీపికల నుత్తరించి సోమ ధరసమయమును ధరణిలో నిలిపిన సకలాగమాచార్యుడు" (పు.72) అని వ్రాసిరి. శివలెంక మంచన కాశీక్షేత్రవాసి.

"శివలెంక మంచయ్య శ్రీ కాశిలోన

దతిలి విశ్వేశ్వర స్థానంబునందు"

అని బ. పు. (6. 197వ పుట) లో గలదు. కావున తాత సోమశంభు డచ్చటి వాడై యుండవచ్చును.

కాలచురి చేది రాజులలో రెండవ కొక్కొల్ల దేవుడు ప్రబోధ శివునకు వారణాశి యందొక మఠమును నేర్పరుచుటకు దానము చేసినట్లు గుర్గి శిలాశాసనము చెప్పుచున్నది. అది క్రీ.శ. 1000 ప్రాంతము. సోమశంభువు ఆ మఠమునకు చెందినవాడేమో!

## 8. వామశంభు :

ఇతని పేరు కాలచురి చేదిరాజగు ప్రథమ కర్ణ దేవుని (1041–73) శాసనమున గలదు. ఇందు కర్ణదేవుడు 'పరమ మాహేశ్వర శ్రీ వామదేవ పదాను ధ్యాత' అని చెప్పకొన్నాడు. కర్ణ దేవుని తరువాతి వారును అట్లే చెప్పకొనుచు వచ్చిరి. కాని కాలచురి రాజగురు పరం పరలో వామశంభు లేడు. క్రీ. శ. 1261 నాటి మాల్కాపుర శాసనములో ఆనాటికి గూడ వామశంభువును కాలచురి రాజులు పూజించుచున్నట్లు చెప్పట చరిత్రకు విరుద్ధ ముగా నున్నది. కాలచురి రాజ్యము 1212 తోనే అంతరించినది. ఇతని మఠములో వేనకు వేలు శిష్యులు గలరట!

## 9. శక్తి శంభు, కీర్తి శంభు :

మా. శా. లో 'ఇత్థం కాలేయాత' అని చెప్పటచే కొంత కాలము జరిగిపోయినట్లు తరువాత శక్తిశంభు, అతని శిష్యుడు కీర్తిశంభు గురు పరం పరలో చేరిరి. ఇక్కడ నుండి కాలచురి జయసింహుని జబల్‌పూర్ శాసనముతో మా. శా. సంవదించు చున్నది. జయసింహుని గురువు విమల శివుడు. జబలపూర్ 63, 64 శాసనములలో ముఖ్యముగా 64 లో విమల శివ గురువు యొక్క పూర్వ గురు ప్రశంస కావింపబడినది. దీని కాలము 26–11–1174. ఇందు పురుష శివుడు, శక్తి శివుడు, కీర్తి శివుడు పేర్కొనబడినారు. కీర్తి శివుని నిర్యాణాంతరము కాబోలు ఆతని శిష్యుడు విమల శివుడు కీర్తీశ్వరుని పేర దేవాలయమును నిర్మించెను. (C II Mirashi 63, 64) శక్తి శివుడు కాలచురి గయాకర్ణునికి (1123–53), కీర్తిశివుడు నరసింహ దేవునికి (1153–63) రాజగురువులు.

## 10. విమల శివ :

ఈ విమలశివుడు కాలచురి జయసింహునికి (1163–88) రాజగురువని తెలిసినది. క్రీ. శ. 5–9–1212 లాటి చాండాల్ల త్రైలోక్యమల్లుని శాసనమున శాంత శివుడు విమల శివుని శిష్యుడు. ఇతనికి నాద శివుడను తమ్ముడుగూడ గలడట. దీనినిబట్టి విమల శివుడు జయసింహుని తరువాత లేడనుట స్పష్టము. అనగా 1188 నాటికి ఇతడు కేరళ దేశీయుడని మా. శా. చెప్ప చున్నది. ఇంతటితో కాలచురి గురు పరంపర ముగియుచున్నది. క్రీ. శ. 1212 నాటి శాంతశివుడు కాలచురిరాజ్య పతనాంతరము తెలుగు దేశమునకు వచ్చెనాయని సంశయము కలుగుచున్నది. ఇతని పేరుతో నున్న శాసనములు కొన్ని త్రిపురాంతకమున గలవు.

(త్రిపురాంతకము. మార్కాపురం తా. కర్నూలు జి.)

## 11. ధర్మ శివ :
## ఆంధ్రదేశమున గోళగి మఠస్థాపన

చేది కాలచురి రాజ్య మస్తమించినది. అయినను ధర్మ శివా చార్యుడు మా. శా. ప్రకారము విమల శివునికి శిష్యుడు. కాలచురి గురు పరంపరలో ధర్మ శివుని పేరు లేదు. అది విమలశివ శాంత శివులతో నాగిపోయినది. మ. శా. గూడ నీతనిని తగురీతిని ప్రశం సించలేదు. అయినను ఆంధ్రదేశమున గోళగి మఠస్థాపనకు నీతడే ప్రథముడని చెప్పవచ్చును. క్రీ. శ. 1234 లో తూర్పు గోదావరి జిల్లా రామచంద్రపురం తాలూకా దాక్షారామ దేవాలయమున "శ్రీ గణపతి క్ష్మా ... ర్చితః ... శ్రీమా ... బిమల శివస్యాంఘ్రి ద్వయారాధకో ధర్మ ధర్మశివో మునీశ్వర వర లోకేషు ... వర్ణ్యతే ధర్మశివప్రాదాదీపం శ్రీ భీమ శంభువే[13]" (S II. Vol IV 1056) అని యున్నది.[12]

ఈ ద్రాక్షారామపు శాసనములో "గణపతిక్ష్మా......ర్చిత" అని యుండుచే నీతడు గణపతి దేవునకు రాజగురువై యుండెనా యను ఊహ పొడముచున్నది. మారేమండ రామారావుగారు "The preceptor of the king" (Inscriptions of AndhraDesa vol II, part I, page 198. No. 31) అని అన్నారు. గణపతి దేవుని సేనాని విరియాల రుద్రనృపతి (క్రీ.శ. 2–10–1245) లో వేయించిన వరంగల్లుకోట శంభునిగుడిలోని దీపదానశాసనములో

"విమలశిర భరణకమల ద్వంద సమారాధనా గత మహిమా
గో [ళగి? వం[14] ] శ మౌక్తికమణినా ధర్మశివ దేశిక వరేణ
... ...................... .......................
శ్రీమద్ధర్మశివాయ పాదకమల ధ్యానోల్ల సన్మానసః"
[వ. జి. శా. నెం. 65]

దీనినిబట్టి ధర్మశివుడు కాకతి గణపతి దేవుని రాజధాని యగు వరంగల్లు నందే యుండెడివాడని స్పష్టమగుచున్నది. మరియు నీ శివాచార్యుడు విరియాల రుద్రునికేగాక, గణపతి దేవుని చెల్లెలు, నతవాటి రుద్రుని భార్యయగు మైలమదేవికి గూడ గురువని, ఖమ్మంజిల్లా, ఎల్లెందు తాలూకా కోటగడ్డలోని బయ్యారం చెఱువు దగ్గరనున్న శాసనము చెప్పుచున్నది (A P G R E / 1965 No. 197). మైలమ్మ శివాలయము నొకదానినికట్టించి గురువైన ధర్మ శివాచార్యునికి కొంత భూదాన మొసగినది. దీనికి తేది లేదు. ఈ మైలమ ధర్మకీర్తి మైల సముద్రమను గొప్ప తటాకము ను కోటగడ్డ (ఖమ్మం జిల్లా, ఎల్లెందు తా.) వద్ద త్రవ్వించినది. దీని వలన నీమెకు 'ధర్మకీర్తి' యని బిరుదము వచ్చియుండును. ( E A Vol 1. 74).

క్రీ. శ. 1247లో ధర్మశివాచార్యులు కర్నూలుజిల్లా త్రిపురాంతకములో త్రిపురాంతకేశ్వరఆలయపు చీకటి మిద్దె దక్షిణపు వైపున నొక శాసనము వేయించినాడు. "స్వస్తి శ్రీ శకవరుషంబులు ౧౧౬౯ అగునేంటి ప్లవంగ సంవత్సరమున నవలక్షడాహల త్రిపురి శ్రీ గోళగిరి బిమళ శివాచార్యులు శ్రీపాద పద్మారాధకులైన శ్రీమతు ధర్మశివాచార్యులు శ్రీ త్రిపురాంతక శ్రీ మహాదేవరకు భండారువు మఠము సేయించిరి "మంగళ మహ శ్రీ శ్రీ శ్రీ"
(SII Vol X. 315)

ఇదియే ఆంధ్రదేశమున ప్రథమముగా వెలసిన గోళగి మఠమనియు, ధర్మశివాచార్యుల కాకతీయుల కాలమున వచ్చిన ప్రథమ గోళగిమఠ శివాచార్యులనియు, గణపతి దేవునిచే గురువుగా మొదట సేవింపబడిన వాడనియు నిశ్చయముగా చెప్పవచ్చును.

ఈ మఠమును ధర్మశివాచార్యుల శిష్యుడైన విశ్వేశ్వర శివ దేశికుడు క్రీ. శ. 1253లో దర్శించి (అనగా 6 సం|| తరువాత) త్రిపురాంతకేశ్వరునికి కొంత సువర్ణదానము చేసినాడు.

త్రిపురాంతకములో గోళగి మఠము వెలిసిన 15 సంవత్సరముల తరువాత మందడము గోళగిమఠము పుట్టినది.

క్రీ. శ. 1254లో విశ్వేశ్వర దేశికుని శిష్యుడును కాయస్థ రాజు జన్నిగదేవుని [1258–69] రాజగురువునైన శాంతశివుడు ఈ త్రిపురాంతక మఠమునకు చెందినవాడే. (SII Vol X 345) ఈ దేవునికి మధ్యగోపురము శాంతశివదేవుని ఆజ్ఞపై కట్టబడినది. క్రీ. శ. 1263లో ఈ శాంతిపూర్ణదేశికులు (శాంతిశివ, శాంతి శంభు) త్రిలక్షగ్రామ గోళగిరి మహామఠ శైవ సామ్రాజ్య పట్ట భద్ర, శ్రీసుగ్రాజ గురుచరణ సరసీరుహ భూషితుడని చెప్పబడినాడు. ఇతడు అభినవ గణపాపురము కట్టించెను. [SII X400] క్రీ. శ. 1271లో కాయస్థరాజు త్రిపురాంతక మహారాజు త్రిపురాంతక దేవర దివ్యపాద పద్మారాధకులైన త్ర్యయంబక శివాచార్యులకు నెల్లూరు జిల్లా దర్శి తాలూకాలోని ఆలవులపాడు అను గ్రామమును దానము చేసెను. క్రీ. శ. 1271లోని శ్రీకంఠ శివుడు [246/1905] [188/1905] క్రీ. శ. 1290లో అంబిదేవ మహారాజువలన దానమును పొందిన నందశివుడు పై త్ర్యయంబ శివాచార్యుని శిష్యుడు. క్రీ. శ. 1272లో అంబదేవ మహారాజు [1274–92] "మంత్రపుష్ప పెట్టిడి పూజారులు—నందశివులు, కొమారశివులు, రుద్రశివులు, సూరెరాశి, త్రిపురాంతక శివులు, బ్రహ్మశివులు, వీరశివులు, మైలశివులు, గంగసాని త్రిపురాంతక శివులకు" దానధర్మము లొనరించినాడు. [SII X 432. 168/1905] క్రీ. శ. 1313లో ప్రతాపరుద్రుని కాలమున చంద్రభూషణ శివాచార్యులు ప్రస్తుతింపబడినాడు.

ఈ విధముగా ధర్మశివాచార్యునిచే స్థాపితమైన త్రిపురాంతకములోని గోళగిమఠము క్రీ. శ. 1247 నుండి 1313 వరకు వర్ధిల్లినది. పాల్కురికి సోమన తొలికృతి అనుభవసార కృతిపతి గోడగి త్రిపురారి ఈ గోళగి మఠమునకు చెందినవాడై వీరశైవుడిగా మారియుండును. అవచి తిప్పయసెట్టి [హరవిలాస కృతిపతి]కి "త్రిపురాంతక దేవమనో విపుల కృపావర్ధితాభివృద్ధి" యుండవలెనని శ్రీనాథుని ప్రార్థన. [హర. పీఠిక 36]

గోళగిమఠము – త్రిపురాంతకము. (మార్కాపురం తా. కర్నూలు జిల్లా).

ధర్మశివా చార్యుడు (ధర్మశంభువు)
(1234–1252)
విశ్వేశ్వర శివాచార్యుడు
| (1253)
శాంతశివ (శాంత శంభు, శాంతిపూర్ణ దేశిక)
............ 1254
శ్రీకంఠశివ 1270
............
త్ర్యయంబకశివ 1270
నందశివ
............
చంద్రభూషణశివ 1313.

త్రిపురాంతకము శ్రీశైలము యొక్క తూర్పువాకిలి. పాల్కురికి సోమన తన తొలికృతి అనుభవసారమును ఈత్రిపురాంతక వాస్తవ్యుడైన గోడగి నారయ పుత్రుడు గోడగి త్రిపురారికి వినిపించినాడు. బసవ పురాణావతారికలోని భక్తానీకములో నీ త్రిపురారియేగాక త్రిపురాంతకమునకు తూర్పు దెసను సోపానములు కట్టించిన రెంటాల మల్లినాథుడును నున్నారు. ఈ రెంటాల మల్లినాథుడు కాయస్థ రాజైన అంబదేవుని [1290–91] నీలగంగవరశాసనములో ప్రస్తుతింపబడినాడు. [సోమశేఖరశర్మ తారణ మాఘ 'భారతి' EI XXV 270–278] ఏతత్ త్రిపురాంతక క్షేత్ర మహిమను సోమనాథుడు పం.చ లో [పర్వ. ప్ర. పుటలు 530–532] వర్ణించినాడు. రావిపాటి త్రిపురాంతకుడును కవి ఈ త్రిపురాంతక దేవునిపేర నొక ఉదాహరణమును రచించినాడు.[15]

## 11. విశ్వేశ్వరం శంభువు

మందడము[16] – వెల్లపూడి గోళగిమఠము. (గుంటూరు జి.తా.) మా. శాసనములో నీతనివర్ణన యిట్లున్నది:

"గౌథరాథ మండలములోని 'పూర్వ గ్రామవాసియు,[18] వేదవేదియు, గణపతి క్ష్మాపాల దీక్షాగురువునైన విశ్వేశ్వరశంభువు ధర్మశంభువునకు గలిగెను. శైవాగమాంభోనిధి, విద్యావల్లీవలయ కలనా కల్పతరువు, దాంతుడు, మహాశాంతుడునై రెండవధూర్జటి వలె ప్రకాశించుచున్నాడు. అట్టి శంభువుకు చోళ, మాళవ, కాలచురి రాజులు శిష్యులు. గణవృధీశ గురుతా సింహాసనా ధ్యాసియైన నీతనివలన గౌడదేశీయులెందరో తమ యభీష్టముల నెర వేర్చుకొనిరి. తాపసులు ధనమును బొందిరి. రాజులు పాశవిముక్తులైరి. పింగజులూ కిరీటి, గణపతి క్ష్మాపాల దీక్షాగురువు, విద్యామంటపవర్తి, ముత్యపు కుండలములచే తాకబడిన భుజాగ్రములు కలవాడు. అప్పడే వికసించిన తామరపువ్వువలె నగుమొగము కలవాడు. అట్టి శివమూర్తిని చూచినవారి కన్నులే కన్నులు."

శాసనోక్తప్రకారము విశ్వేశ్వరశంభువు మహా తేజో విరాజితుడై, చోళ, మాళవ, కాలచురి, [7] కాకతీయ రాజులకు దీక్షాగురువై, రాజగురువై మహోన్నతపదవి నలంకరించినవాడు గాని, సామాన్య గురువుమాత్రము కాదని తెలియుచున్నది. గణపతిదేవుడు గురువుగారికి వెలనాడు కంద్రవాటిలోని మందడగ్రామమును అన్ని ఆయములతోను ఇచ్చుటకు వాగ్దత్తము చేయగా నాతని పుత్రిక రుద్రదేవి తదనుజ్ఞతో వెలగపూడియను మరియొక గ్రామముతో కలిపి అష్టస్వామ్యములతోడను, పంటలతోను, కృష్ణలోగల లంకలతోను చేర్చి దానము చేసెను. ఆ దానమును పరిగ్రహించి విశ్వేశ్వర శంభువు గోళగి మఠము నేర్పాటు చేసెను.

## 12. గోళగిమఠము- స్వరూప స్వభావములు

మఠమనగా[19] 'సన్యాసులగృహమని,Mouastery, convent అని ప్రౌను. [తెలుగు–ఇంగ్లీషు నిఘంటువు] నేడు convent అనగా బాలబాలికలు చదువుకొను క్రైస్తవ మతగురువులు నడిపెడు పాఠశాల అయినను కళాశాలలవంటివి [లయోలా] లేకపోలేదు. బోధకులు వారి మతాచారముల ననుసరించి నిష్ఠాగరిష్ఠులై, బ్రహ్మచారులై, మునులవోలెనుండుట మనకు తెలిసిన విషయమే. అటులనే పూర్వకాలమున శైవమఠములు వేదవిద్యా బోధనశాలలైయుండెడివి. ఇవిగాక బ్రాహ్మణ మఠము లుండెడివి. వానిని ఘటికాస్థానము లనెడివారు. శైవమఠములును బ్రాహ్మణాధ్వర్యముక్రింద నడపబడినను అందు ప్రత్యేకముగా పాశుపత కాలముఖ కాపాలికాది శైవ సమయములను బోధించెడివారు. క్రీ. శ. 1058 నాటి చాళుక్య చక్రవర్తి యాహవమల్ల సోమేశ్వరుని కాలమునాటి 'నాగతాది శాసనము నందచటి ఘటికాస్థాన నిర్వహణ మెట్లుండెనో' తెలిపిరి. [డా. నేలటూరి వేంకటరమణయ్యగారు విష్ణుకుండినులు, పుట. 46]

విశ్వేశ్వరశంభువ స్థాపించిన గోళగిమఠము గూడ విశ్వ విద్యాలయముతో సాటి వచ్చునదియె. దీనికి విశ్వేశ్వర గోళకి యనిపేరు.

తన పేరనొక దేవాలయము, తన పేరుతో గోళగిమఠము, విశ్వజినాగ్రహారము, సత్రము, ప్రసూతిశాల, ఆరోగ్యశాల ఏర్పరచి ఆయా విభాగములలో పని చేయువారికి తగిన గ్రాసవాసములు కల్పించినాడు. దీనిని మనము నేడు (Residential University) యనవచ్చును.

**మఠము** (College professors)

1. వేదా అధ్యాపకులు—వేదశాఖ
ఋగ్వేదం—1, యజుర్—1, సామ—1. 3గురు

2. పద, వాక్య, ప్రమాణ, సాహిత్య, ఆగమ (Lecturers) [వ్యాఖ్యాన భట్టారకులు] వ్యాఖ్యాతలు 5గురు

3. వైద్యుడు— (Physician) 1

4. కాయస్థుడు (Scribe) 1

5. విద్యార్థులు

**విశ్వేశ్వర దేవాలయము:** (Temple)

1 నాట్యకత్తెలు (Dancers) 10

2. సంగీత గాయినులు (Lady Musicians) 14

3. మర్దలకాండ్రు (Drummers) 9

4. కాశ్మీర దేశీయ గాయకుడు (Kashmir musician) 1

**సత్రము:** (Feeding house) [ధర్మసత్రము]

బ్రాహ్మణ పాచకులు (Brahmin cooks) 2

బ్రాహ్మణ సేవకులు [Attendents] 6
పరిచారకులు [Servants] 4

### గ్రామ రక్షకుల (Police

[20]వీరముష్టులు — 20.
వీరభద్రులు — 10.

### పంచాణం వారు

సువర్ణకార — కంసాలి (Goldsmith)
తామ్రకార — (Coppersmith)
వంశాయ — మేదరి
పాషాణ —
కుంభకార — కుమ్మరి
స్థపతి — వాస్తుశాస్త్రజ్ఞుడు (Architect)
శిల్పి — (Sculptor)
నపిత — మంగలి (Barbor)

పై వారి కందరికి జీవనమునకై తగు యేర్పాటులు కావించుటయే గాక, 60 మంది ద్రావిడ బ్రాహ్మణులకును, తన దేశము నుండి, తన గ్రామము నుండి వచ్చిన సామవేద పారగులు శ్రీవత్స గోత్రులునైన గౌడ బ్రాహ్మణులకు, కొంత భూదానము చేసెను. వీరు ఈ మఠమునకు సంబంధించిన ఆదాయ వ్యయములను వ్రాయుచుండవలెను. వారు తోటలు పెంచుకొనుటకు అదనముగా గూడా భూమి నొసంగెను.

సత్రము నడపుటకేగాక విద్యార్థులకు, కాలానన (కాలముఖ) శైవులకు, పాశుపత వ్రతులకు, శివశాసనులకు, తుదకు చండాలురకు పర్యంతము, సర్వకాలము అన్న వస్త్రాది దానములకును నేర్పాటు చేసిన నైష్టిక శీలి. శుద్ధశైవమతము నందలి విద్యార్థులకు గూడ నీతడు కొంత ఏర్పాటు గావించెను.[21]

### ఆరోగ్య శాల (Health Centre)
### ప్రసూతి శాల (Matertity Centre)

శైవ గురువులు సర్వశాస్త్ర పారగులు. ఆయుర్వేదము గూడ నభ్యసించెడి వారని వేరుగా చెప్పనక్కరలేదు. విశ్వేశ్వర శంభువు యెంత దయామయుడో! [22] ఆరోగ్యశాలే గాక ప్రసూతి శాలను గూడ నొక కేంద్రముగ నేర్పాటు చేసినాడు. స్త్రీలకు పుత్రులు లేనిపక్షమున తమ పనులు నితరులచే చేయించుకొని క్షేత్రారామాదులను నడుపుకొనవచ్చును.

శాసనములో చెప్పిన ప్రకారము విశ్వేశ్వర దేశికుడు సమలోష్ట కాంచనుడు, శాంతుడు, శుచి. శైవా రహస్యవేది, ఎల్లరయందును భూతదయగలవాడు. సమస్తవిద్యా సుకృతావగాహనుడు గణపతి దేవుని విద్యామండప వర్తి. ఆచార్య భోగము క్రింద తాను నిష్కముల నూరింటిని (నిష్కము : ఇరువది చిన్నముల యెత్తు బంగారు ముద్రిక — ద్రౌను) గ్రహించెడివాడు ఈ దానధర్మములను శాశ్వత మొనర్చుటకు సూర్యగ్రహణ పుణ్యకాలమున కృష్ణానదీయందు కృతావగాహుడై, దానగ్రహీతలను అట్లు చేయుడని కోరియుండును.

క్రీ. శ. 1262 లో కోట గణపతి దేవరాజు రాచగురు దేవులకు దాన మొనర్చినట్లు మందడమున నున్న నొక శాసనము చెప్పుచున్నది (SII X 399. 1262).

[క్రీ. శ. 1282 లో భారద్వాజ గోత్రుడును విశ్వేశ్వర దేశికుని ధాన్యాధిపతియైన వొట్టరువు కొమ్మన ప్రెగడ కొడుకు మల్లయ తమ్మ రక్షించినదాత రాచగురు దేవర పుణ్యమునకుగాను దానముచేసెను.] ఈ కాశీశ్వర శివాచారి తలిదండ్రులు సోమసాని విద్యా శివులు (SII X 454, 1282)

### 13. కాశీశ్వర శివాచారి :

విశ్వేశ్వర దేశికుని తరువాత నీ శివాచారి మఠాధిపతియైయుండును. శ్రీవత్స గోత్రులైన రాచగురు దేవరకు కొడుకు ననియు, విశ్వేశ్వరాయ ప్రధమ పరిషత్తునకు సంబంధించిన వాడనియు (SII X X 454. క్రీ. శ. 1282) శాసనము చెప్పుచున్నది. ఇతని పుణ్యము కొరకు భృత్యుడైన మాయిదేవభట్టు దీపము కొరకు 50 గొర్రెలను దానము చేసెను.

### గుంటూరు

భట్టిప్రోలులో నొక గోళగి మఠముండియుండు ననుటకు గురు పరంపర కొంత కనిపించుచున్నది. అచ్చట భోగేశ్వర మహాదేవుని దేవాలయ మానాడున్నట్లు తెలియుచున్నది.

### పరిపూర్ణ శివ మహాముని :

(భట్టిప్రోలు. రేపల్లె తా.) క్రీ. శ. 1243 లో రాచగురు విశ్వేశ్వర దేవుని శిష్యుడు, తండ్రి సుకృతార్థము ఎనిమిది దీపములు పెట్టుటకు కావలసిన నెయ్యినిచ్చుటకు గొర్రెలను, ఆవులనుదానము చేసినాడు. (293 /1936–7. IA. 301). క్రీ.శ. 1252లో తన తండ్రిరాచగురు విశ్వేశ్వర శివమహాముని సుకృతార్థము(గురువు) దండ సానికిచ్చిన పన్నస (301/1936–37 I. A 301) ఆ సంవత్సరముననే మరికొంత భూదానము (294/1936–7) క్రీ. శ.1271 రుద్రమదేవి పరిపాలనా కాలమున రాచగురుదేవుని శిష్యుడు ఉత్తమ శివుడు ద్వివద్వయమును భోగేశ్వర దేవునికి సమర్పించినాడు. (307/1936 – 37) (130 – 1897. SII. VI. 86)

**సదాశివ :**

(1258) కంభంపాడు. పల్నాడుతా. శాంతీశ్వరగురుదేవుని శిష్యుడు.

వేంగీశ్వర దేవుని స్థానాపతి (301/1930–31)

**ఈశాన శివ :**

(క్రీ. శ. 1127 సత్తెనపల్లి) వెల్లంటూరు త్రికోటీశ్వర దేవాలయ స్థానాపతి (6/1908). అచ్చటనే క్రీ. శ. 1148 లో నొక దానములో గ్రహీత. (7/1908).

# అధోజ్ఞాపికలు

1 ఈ వ్యాస రచనకు ప్రొ. బి. జి. ఎల్. స్వామిగారి **"The Golaki School of Saivism" (JIH. LIII. Aug. 75 - P - 167.209)** విషయ విపుల విజ్ఞాన తేజోమయమైన వ్యాస ముద్బోధకమైనది. వారికి నాకృతజ్ఞత.

2 గుంటూరు తాలూకా మాల్కాపుర పొలములలోని విశ్వేశ్వర దేవాలయమునకు ముందు పడియున్న నందిస్తంభమీదను క్రిందను చెక్కబడినది. కావున మాల్కాపుర శాసనమని దీనికి పేరిడియుందురు. నేటికి 65 సంవత్సరములముందు వెలువడిన చిలుకూరి వీరభద్రరావుగారి 'ఆంధ్రులచరిత్ర' ద్వితీయ భాగమున దీని ప్రశంస విశేషముగా గలదు. మాల్కాపురమను గ్రామముపేరితో ఆంధ్రదేశముననే గాక ఉత్తర భారతమున గూడ గలవు. మధ్యప్రదేశ్ అకోలానుండి భూసావాల్ వెళ్ళు రైలుమార్గమున గలదు.

3 భారతి. విభవ చైత్ర. విశేష వివరములకు చూ. **Epigraphia Andhrica. Vol. III. p p 34—35.**

4 "కళింగ దేశములో నింద్రుదుపురంబుఁబోలె నొప్పుం ద్రిపురీ నగరంబు" (కేయూ: 1–49) దీని విషయమై చూ. వేదం వేంకటరాయశాస్త్రిగారి పీఠిక.

5 ఈ దుర్వాసోన్వయము గల శాసనము **K. B. Musuem. No. 141. A P G E R/1966** నమోదు అయినది. దాని వివరములు తెలియవు.

6 దుర్వాసుడు శ్రీ కృష్ణనిర్యాణమునకు కారకులైన వారిలో నొకడు. దుర్వాసుని పాయస కథను పాల్కురికి సోమన (దీక్షా 106), తిక్కన (అను 5–371–383) భిన్నరీతులలో వ్రాసియున్నారు. రుక్మిణీ కృష్ణులు అభ్యాగతుడైన దుర్వాసునికి భక్తి పెంపార పాయసమును వండిబెట్టగా నాతడా పాయసమును నీశ్వరార్పణచేసి, తాను భుజించి తత్ప్రసాదావశిష్టమును

"గొవింద కడుపార గుడిచి చిక్కినది
పూసికో సర్వాంగముల నంచు నొసఁగ
నాసక్తి గుడిచి భుక్తావశిష్టంబు
నతికాళ్లఁ దక్క సర్వాంగంబులందు
నెఱిఁ బూసికొనుటయు" (దీక్షా. 107)

అది చూసి దుర్వాసుడు కోపోద్రిక్తుడై

"అచ్చోట నీకు
నెఱనుగా నొక బోయ నిశిత బాణోప
హతి మరణంబు నీ కయ్యెడ ననుచు"

శపించినాడు. ఇది పాల్కురికి సోమన కథనము. దీని కత్యంత విరుద్ధముగాతిక్కనభారతములోనిట్లున్నది:దుర్వాసుడు కృష్ణునితో—

క. నాయంగంబుల నెల్లం
బాయస మతిభక్తి బూసి పాదతలమునం
బూయవు గావునఁ గలుగు న
పాయం బఱకాల నీకు నవిలంఘ్యంబై
(అను. 5. 377)

అని దుర్వాసుడు చెప్పటచే శ్రీ కృష్ణుడే దుర్వాసునికి పాయసము నొడలంటబూసి పాదతలమున బూయలేదని అద్దానివలన శ్రీకృష్ణుడు శాపోపహతుడైనట్లు భారతమున నున్నది. (సం. భా. 13–144–14) భారతములో నున్నదానికంటే పం.చరిత్రలోని క్రమమే సమంజసముగా నున్నట్లు కనబడుతున్నది. పండితులు చర్చింతురుగాక!

శైవులు శివప్రసాదమును భుజించిన వెనుక చేతులను కడుగుకొనరనియు, అవశేషము లేకుండ తలకు బూసుకొనిన పసుపుల నాగయ యోగినివి తాము చూచినామనియు మరియు ముదిగొండ శంకరారాధ్యులు[హైదరాబాదు కవాడిగూడ మఠగూడ నట్లు చేసెడివారని మా నాయనగారు వేంకటరావుగారు చెప్పుచున్నారు.

7 కాశ్మీర శైవ దార్శనికుడైన సోమానందుడు (క్రీ.శ.900) తన 'శివదృష్టి' యను గ్రంథమునందు దుర్వాసుడే మూల పురుషుడని చెప్పబడినది. (నంజుండారాధ్య–2)

8 **I cannot also accept the view that Sahbhava-sambhu mentioned in the inscription (Malka-**

**pur) is identical with Prabhavasiva described in Kalachuri inscriptions These two names are not synonyms like Chindasiva and Sikhasiva and the Saiva Acharyas are not known to have assumed more than one name** (పాఠక్‌గారి పుస్తకముపై నిచ్చిన అభిప్రాయములో)

9 రాయిబహద్దరు హీరాలాల్‌గారు **JBORS (XIII 1927. p. 138. EHD. P. 707, 708)** లో మధ్యప్రదేశ్‌లోని గోళగి మఠమును గూర్చి ఇట్లు తెలిపినారు: వారి వ్యాస సారాంశము:—

''చేదిదేశములో గోళగి మఠమనునది లేదు. ఉన్న దేవళము చేంసత్త (చౌషష్ఠ) జోగిని దేవాలయము మాత్రమే. ఇది భేడాఘాట్ వద్ద ఉన్నది. (మధ్యప్రదేశ్.) ఇందు 64 సంఖ్యకంటే యెక్కువ స్త్రీ ప్రతిమలు కలవు. ఇది గో ళా కా ర ము గా **( Hypethral cloiser )** నుండుటచే దీనికీపేరు వచ్చి యుం డును. ఈ దేవళను గుండ్రని గుట్టపై కట్టబడి యుండుటచే దీనికి 'గోళగిరి మఠమని' పేరువచ్చి యుండును. 'ఈ గోళగిరి' పదమే 'గోళగి'య్యె యుండును.

(గోళా—గాం నేపాళ భూమింలాతి జన్మభూమిత్వే నేతిగోళా. లాఆదానే, నేపాళ భూమిని జన్మభూమిగా స్వీకరించునది. గురు బాల ప్రబోధిక.) నేపాల దేశము పాశుపతి శైవమునకు జన్మ భూమి. ఈ మఠము పేరులో నేదైన అంతరార్థమున్నదేమో !

10 ఈ రెండు పేరులు శైవమత చరిత్రకు చాల విలువైనవి. పండితారాధ్య చరిత్ర (ఆంధ్ర గ్రంథమాల. 1939) కు విశేష పరిశ్రమ కోర్చిబృహత్తమమైన ఉపోద్ఘాతమును, సంజ్ఞా, ఆచ్చికపద పట్టికలను కూర్చిన చిలుకూరి నారా యణరావుగారు ఏల జారవిడిచిరో !

11 విజ్ఞానా కల నామైకే ద్వితీయః ప్రలయా కలః।
తృతీయా సకలః శాస్త్రాను గ్రాహ్యస్త్రిధో మతః॥
తత్రాథో మలమాత్రేణ యుక్త్యాన్యో మలకర్మభిః।
కలాది భూమి పర్యంత తత్వైస్తు సకలోయుతః॥
(శైవదర్శన 19, 20 శ్లోకములు)

13 **This 'Can be taken as the benining of the influence of Golakimatha in Andhradesa' (Hanumantha Rao - 292)**

12 'భీమశంభువే' అని భీమేశ్వరస్వామికి శంభుశబ్దమును జేర్చి నాడు. ఇట్లే హలాయుదుడు (8వ శతాబ్ది) అభిదాన రత్నమాల (నిఘంటువు) లో విష్ణు నామములను జెప్పు నప్పుడు ''శంభు'' అను పర్యాయపదమును జేర్చినాడు. (శివ.ప. పీఠిక 'ర') ఈ హలాయుధుని కథ బసవ పురాణములో (చతుర్థాశ్వాసము – పు. 122–127) వర్ణితమైనది.

''అవిరళంబై వెల్గెనతఁడు వాలించు
నవపురంబులుగూడ శివభక్త వితతి
.................................
కైలాసమునకుఁ జక్కనఁ గొనిపోయె'' అనియు, పండితా రాధ్య చరిత్రమున—

శివపురికేగఁడే భువినరుల్ పొగడ
నవపురంబులుఁ దాను న వి హలాయుదుఁడు

(పై ద్విపదలలో 'నవపురంబులు' అనుటకు బదులు ''నవ పురంబును'' అని యుండవలె (పు. రా. 410 పు)

ఇతని జన్మభూమి దక్షిణ రాఢా మండలను (పశ్చిమ బెంగాల్) లోని నవగ్రామము. (నవ్‌గామ) ఆధునిక విభాగము ననుసరించి హుగ్లీజిల్లా ఖుర్‌షుత్ పరగణాలో జేరినది. వంగదేశ మును వదలి దక్షిణదేశమందలి మాన్యఖేటము (మల్‌ఖేడ్) ను పరిపాలించుచున్న రాష్ట్రకూట కృష్ణరాజు (756–775) నాస్థానము నాశ్రయించి సన్మానము నందినాడు. (శివ పం...'ర') హలాయుధ స్తవము చివర

ద్విజో దక్షిణ రాఢీయో నవగ్రామ వినిర్గతః
హలాయుధ బుధః శంభోరిమాం స్తుతి మరీరచత్.

నర్మదానదీతీరమున సుప్రసిద్ధమైన ఓంకార క్షేత్రమైన అమరేశ్వర మందిరముననే ఈ హలాయుధ స్తోత్రము శిలపై లిఖితమైనది. (**EI vol XXV** (శివ. పం. పు. లవ)

14 నేనూహించిన పాఠము.

15. త్రిపురాంత కోదాహరణము. పరిష్కర్త: కళాప్రపూర్ణ నిడుదవోలు వేంకటరావు.

16 పశ్చిమబెంగాల్ హుగ్లీజిల్లాలో ఆరామ్‌బాగ్‌కు 7 మైళ్ళు పశ్చిమముగా తారకేశ్వరీనది మీాది ఖిటాగర్ మందారన్ అనుఊరు కలదు. ఇది దక్షిణరాఢా మండలములోనిదే. (ముజుందారు 189 F.N. 212). నేటి మందడ గ్రామమునకు మూలరూపము మందార గ్రామమేమో. విశ్వేశ్వరు డీపేరు పెట్టియుండవచ్చును.

17 విశ్వేశ్వరశంభువు నాటికి, మూడవ రాజరాజు చోళుడు (1216–46), మూడవ రాజేంద్రచోళుడు (1246–67), మాళ్వ పరమార దేవపాలుడు (1218–36), జైతుగి (1239–43), రెండవ జయవర్మ (1256–60), పరిపాలించుచుండిరి. కాలచురి రాజులెవ్వరో చెప్పుట కష్టము (సర్కార్–158)

18 విశ్వేశ్వర శంభువు గౌడరాడ్ఢోల్ల సత్పూర్వగ్రామ శిఖామణి యనియు, శ్రీ గౌడచూడామణి యనియు, దానశ్రోతలలో బ్రాహ్మణులు కొందరు గౌఢ దక్షిణ రాఢీయ పూర్వగ్రామ సముద్భవులనియు శాసనములో చెప్పబడినది.

దక్షిణరాఢా మండలమునుండి అనేక శైవబ్రాహ్మణులు ఆంధ్రదేశమునకు రాక పూర్వము తమిళ కర్ణాట ప్రాంతము లకు వచ్చిరి. క్రీ.శ. 1021–23 సంవత్సరముల నడుమ చోళ మహాచక్రవర్తియైన ప్రథమ రాజేంద్రచోళుడు పవిత్ర గంగానదీ జలమును దెచ్చి తన దేశమును పునీత మొనర్చుటకు ఉత్తరభారత దిగ్విజయయాత్ర చేసెను. తూర్పుచాళుక్యులకు బంధువులగుటచే తీరాంధ్ర ప్రాంతము నుండి ఉత్కళమునుదాటి పశ్చిమ బంగాళ దేశములోని అనేక చిన్న చిన్న రాజ్యములను జయించెను. అందులో దక్షిణ రాఢ ప్రదేశమొకటి. అచ్చటనున్న సర్వశివుని తన దేశమునకు గొనిపోయి అతనివద్ద దీక్షగొనియెను. రెండవ రాజాధిరాజు (1163–79) గురువు ఉమాపతి శివాచారి (జ్ఞానశివ) మూడవ కులోత్తుంగుని గురువైన సోమేశ్వరుని శిష్యుడు శ్రీ కంఠశంభు దక్షిణ రాఢా మండలమునుండి వచ్చినవారే వేరొక గురువు గంగోలి ఈశ్వరశివాచారు (ఎ.రి. 105/1934) దక్షిణ రాఢీయుడే. ఇతని కాలము క్రీ. శ. 1235. ఇది తెలుగుదేశమున గణపతిదేవుని రాజ్య పాలనము జరుగుతున్న కాలము. విశ్వేశ్వర శివుడే ప్రథమ గౌడ బ్రాహ్మణశివగురువని చెప్పవచ్చును. మరియు మా.శా. కాలము నాటికి అనేక గౌడ బ్రాహ్మణులు తన స్వగ్రామ మైన నవగ్రామమునుండి వచ్చియుందురు. వీరిది శ్రీవత్స గోత్రము. బహుశః విశ్వేశ్వర శివునిది అదే. కాని పూర్వ గ్రామవాసులువాత్స్య గోత్రులని (మజుందారు 480) వ్రాసి యున్నారు. వాత్స్య గోత్రులే తెలుగు దేశమున శ్రీవత్స గోత్రులేమో. శ్రీనాథుని హరవిలాసములో 'రాఢా' (పీఠిక. 29) పేర్కొనబడినది. అనువాదమైన ప్రబోధ చంద్రో దయములో (జంటకవులది)

''దక్షిణ రాఢా రాష్ట్రాగతుండగు నహంకారుడు'' (2–5) ''గౌడదేశ రాఢావర పట్టణంబునఁగడాని మదీయ గృహంబు'' (2–12) అని యున్నది. భారతవర్ష పండిత పరీక్షలకు శాణోపలకమైన నవద్వీప విూ దక్షిణ రాఢా మండ లములోనిదే. దక్షిణ రాఢ నేటి పశ్చిమ బెంగాల్ హవురా, హుగ్లీ, బర్ద్వాను జిల్లాలే. నవగ్రామము నౌగావ్ హుగ్లీ జిల్లాలోనిది. పూర్వగ్రామ విూజిల్లాలలో నేదైన నొక జిల్లాలోనిదై యుండును. (ముజుందారు 13)

19 ఛాత్రోఽన్తేవాసీ ఆదిర్యేషాం తే పరివ్రాజక క్షపణ కాదయఃతేషానిలయః—ఇతిమఠః—అమరను.

20 క్రీ.శ. 1258 లో వరంగల్లుజిల్లా, పార్కాల్ తాలూకా కంతాత్మకూరులోని శాసనమున వీరముష్టులు గ్రామ రక్ష కులుగా వర్ణింపబడిరి. ''వీరముష్టులు ఎవ్వరు విన్నాను వానిం బొడిచి తల గొటిగి పిలటు సేయకుండిరేని వారు వీరముష్టులు గారు'' (**1 AP WD No. 75**).

21. క్రీ. శ. 1215 లో పిల్లలమర్రి భేతిరెడ్డి పెండ్లము ఎఱకసానమ్మ ఎఱుక మఠమును స్థాపించి, సత్రము పెట్టి విద్యార్థులకు, గ్రాసవాసస్సులకు భూదానము గావించె (నల్గొండజిల్లా పిల్లలమర్రి. తె. శా. మొ. సం. 36–37)

22. అశోకుని శిలాశాసనము 21లో (క్రీ.పూ. 272–732) రెండురకములైన చికిత్సశాల లుండెడివి. 1. మనుష్యులకు 2 పక్షులకు. వీరరాజేంద్రచోళుడు (1063–70) తిరుముక్కూడల్ (చెంగల్పట్టు జిల్లా) లో ను (**EI XXI P. 220**) హొయసల వీరరామనాథ దేవుడు (1255–95) (**EI XXIV 91**) ను, ఆరోగ్యశాలలు నెలకొల్పి యున్నారు. (**SRAMI**) బలిగ్రామ్ (కర్ణాట కము) కోడియ మఠమునందలి యొక శాసనములో ''నానా దేశ భిక్షుక జన నివార్య అన్నదాన స్థానముం నానా నాథ రోగి జనరోధ భైషజ్య స్థానముం'' అని యున్నది. (**E I V 222**).

**( సశేషము )**

# కలగూరగంప

## మనుచరిత్ర విమర్శావేశము

ఆంధ్ర కవితా పితామహుడగు అల్లసాని పెద్దనామాత్యుడు స్వారోచిష మనుసంభవ ఆశ్వాసాంత గద్యమున తనను గూర్చి "పంకజాక్ష పాదాంబు జాధీన మానసేందిందిర..." యని చెప్పుకొనుటనుబట్టి, విష్ణుభక్తుడని తెలియుచున్నది. పెద్దన పూర్వులందరును శివకేశవుల యందు సమాన భక్తి కలవారు. శఠకోప యతి వలన పెద్దన వైష్ణవమును స్వీకరించెనని తెలియుచున్నది. కొందరు పెద్దన వైష్ణవమును స్వీకరించెననుటను వ్యతిరేకించిరి. కాని పెద్దన వైష్ణవమునుస్వీకరించెననుటను మనుచరిత్రమునందలి ఆశ్వాసాంత గద్యమే స్థిరపరచుచున్నది. పెద్దన వైష్ణవమును స్వీకరించినను శివద్వేషికాడు. శివభక్తి పెద్దన యందు జీర్ణించి పోయినది. విష్ణుభక్తుడుగ మను చరిత్రమును వ్రాయుచున్నను ఆయనలోని శివభక్తి తత్పరత అంతర్లీనముగ ఈ కావ్యమునందు దర్శనమిచ్చుచున్నది. దానిని పరిశీలించుటయే ఈ వ్యాసోద్దేశము.

వరణా తరంగిణీ దరవికస్వర నూత్న
కమల కషాయ గంధము వహించి
ప్రత్యూష పవనాంకురములు పైకొను వేళ
వామన స్తుతి పరత్వమున లేచి
సచ్ఛాత్రుడగుచు న్నిచలునేగి యయ్యేట
నఘమర్షణ స్నాన మాచరించి
సాంధ్యకృత్యము దీర్చి సావిత్రి జపియించి
సైకత స్థలిగర్మ సాక్షి కెఱగి
ఫల సమిత్కుశ కుసుమాది బహు పదార్థ
తతియు నుదికిన మడుగు దోవతులు గొంచు
బ్రహ్మ చారులు వెంటరా బ్రాహ్మణుండు
వచ్చునింటికిఁ బ్రజ తన్ను మెచ్చి చూడ. 1–54

ఇది ప్రవరుని ప్రాతః సంధ్యా కృత్యము. ప్రవరుడు శిష్యులతో గూడి ప్రాతః కాలమున వరణా నదియందు అఘమర్షణ స్నానమాచరించునని చెప్పబడినది. ఇట అఘమర్షణ స్నానమనగా పాపములను నశింపజేయు స్నానమను సామాన్యార్థము గ్రహింపరాదు. అఘమర్షణ స్నానము శైవాగమ విహిత కార్యము.

"అస్త్రేణ మన్త్రితం తోయం వామనాసాగ్ర మానయన్
ఇడ యాన్తర్గతం తేన దగ్ధమేనో విచిన్తయేత్॥
బహిర్గతం పిఙ్గళయా భావయన్ దక్షిణకరే
ధృత్వా జలం తత్ర పాప పురుషం భావయేత్తతః॥
వామభాగే వజ్రశిలాం ధ్యాత్వాతత్ర క్షిపేజ్జలం
చూర్ణితం భావయే త్పాపనర మిత్యఘమర్షణం"
38, 39, 40 శ్లో. 3స. కారణోత్తరాగమము.

[అస్త్ర మంత్రములచే మంత్రింపబడిన జలమును ఎడమ ముక్కు కొననుజేర్చి ఇడయను నాడిచే నా జలములోనఁ బ్రవేశించునట్లును, అద్దానిచే లోని పాపము కాలిపోయినట్లును భావించి, తరువాత పింగళయను కుడిముక్కునాడిచే నాజలము వెలుపలికివచ్చి కుడిచేతియందున్నట్లు భావించి, అందు పాపపురుషు డున్నట్లు ధ్యానించి, ఎడమప్రక్కన వజ్రశిల యున్నట్లు భావించి, యా జలమునందువైచి, పాపపురుషుడు చూర్ణమయ్యెనని యెంచవలయు. ఇదియె అఘమర్షణ మగును.] [1]

ఇంతటి విశిష్టతగల అఘమర్షణ స్నానమును శిష్య సమేతముగ ప్రవరునిచే చేయించుట పెద్దనకుగల శైవాగమ పరిజ్ఞాన ఫలితమే. ఈ చిత్రణమంతయు అమూలకమే.

"మృదుస్వభావః సద్వృత్తో వేదవేదాంగ పారగః
సదాఽతిథి ప్రయో రాత్రా వాగతానాం సమాశ్రయః
— సంస్కృత మార్కండేయ పురాణము.

"అతి సుకుమారమూర్తి ప్రవరాఖ్యుడు దాత్తుడువేదపారగుం
డతిథి జనార్చనాభి రతుడై చరియించుచు ... ... ...
— ఆంధ్ర మార్కండేయ పురాణము.

ప్రవరుని పాత్రచిత్రణము నందేకాదు. ఔషధసిద్ధుని పాత్ర చిత్రణమునందును పెద్దనార్యుని శైవాగమజ్ఞానము ప్రస్ఫుటమగుచున్నది.

మడిచిన యొంటి కెంజడ మూయ మువ్వన్నె
మెగము తోలు కిరీటముగ ధరించి
కకపాల కేదార కటక ముద్రిత పాణిఁ
గుఱుచ లాతాముతోఁ గూర్చి పట్టి
య్యైణేయమైన యొడ్డాణంబు లవణిచే
నక్కళించిన పొట్ట మక్కళించి
యారకూట చ్ఛాయ నవఘళింపగ జాలు
బడుగు దేహంబున భస్మమలది
మిట్ట యురమున నిడుయోగ పట్టె మెఱయఁ
జెవుల రుద్రాక్ష పోగులు చవుకళింపఁ
గావి కుబుసంబు జలకుండికయును బూని
చేరేఁ దద్గేహ మౌషధ సిద్ధుడొకడు. 1–59

ముడువబడిన ఎఱ్ఱని జడలలో పులితోలు కిరీటము, పంచ లోహములతో చేయబడిన చేతి కడియము, కక్షపాల, యోగ దండము, ఆడలేడి తోలితో చేయబడిన నడుముకట్టు, ఇత్తడి వలె మాసిన పసుపురంగు దేహమంతటను విభూతి పూత, చెవులకు రుద్రాక్ష పోగులు, కావిరంగు చొక్కా, కమండలము ఇదీ ప్రవరుని ఇల్లు చేరిన ఔషధ సిద్దుని స్వరూపము. ముమ్మూర్తులా శైవ జంగముని స్ఫురణకు దెచ్చునది.

శివలింగార్చనము చేయువారి బాహ్య చిహ్నములు పదింటిలో మొదటిది భస్మరుద్రాక్ష ధారణము. ఈ భస్మధారణము త్రివిధము, ఉద్ధూళనము, అవకుంఠనము, త్రిపుండ్రము అని. పొడి విభూతిని శరీరమంతట పూసికొనుట ఉద్ధూళనము.

"తేషాం బాహ్య చిహ్నాని దశసన్తి బృహస్పతే
ప్రథమం భస్మ రుద్రాక్ష విజ్ఞ దారణ మీరితం॥
ఉద్ధూళనం తతః కార్యమవ కుణ్ఠన మేవ చ
త్రిపుణ్ద్రం చేతి విఖ్యాతం త్రివిధం భస్మధారణం॥
పఞ్చభి ర్బ్రహ్మభి రార్యాపి మూల మన్త్రేణ వాపునః
సమ్మన్త్ర్య నిర్జలం భస్మతేన లిమ్పేత్సు సంయుత ః॥2
13, 45, 46 శ్లో. 4ప. చంద్రజ్ఞానాగమము.

ఔషధ సిద్ధుని భస్మధారణ పద్ధతి ఉద్ధూళనము, రుద్రాక్షలు ధరించినాడు. సంస్కృత మార్కండేయ పురాణమున "అతిథి" వచ్చెనని మాత్రమే యుండగా మారన తన మార్కండేయ పురాణానువాదమున "ఔషధ సిద్ధు" డనెను. ఆ ఔషధ సిద్ధుడు పెద్దనార్యుని చేతిలో రూపొందినది శివభక్తుని రూపము. దీనికి మరికొన్ని ఉపబలకములు నున్నవి.

"రసలింగమునిదు వ్రటువ ప్రేపసజ్జలోని దంతపుబరణిలో మంచిన పాదలేపమును ప్రవరుని పాదములకు పూసె (1–78)" నని చెప్పబడినది. ఇదియును అమూలకమే. శివదీక్షా పరునకు విధింపబడిన షట్కాల లింగార్చనమునకు ఆటంకము కలుగికుండ లింగమును సజ్జయందిడుకొని సంచరించు ఔషధసిద్ధుడు శివ లింగార్చన పరుడేయని తెలిసికొనగలము. మరియొక విషయము.

"పాదలేపమన పేరంగల్గు దివ్యౌషధంపు రసంబీశ్వర సత్కృపం గలిగె" నని (1–74) ఔషధసిద్ధుని వచనము. ఈశ్వరభక్తుడగువానికి ప్రతివస్తువును ఈశ్వర ప్రసాదమే కదా! అట్లే ఔషధసిద్ధునకు పాదలేపమును.

"మంత్రౌషధి ప్రభావేణ విప్రాఽ ప్రతిహతా గతిః
యోజనానాం సహస్రం హి దివార్ధేన వ్రజామ్యహమ్"
— సంస్కృత మార్కండేయ పురాణము.

"ఏనొక సిద్ధుడన్వినుు మహీసుర శేఖర ధాత్రియంతయు
నా నుగఁ బాదలేపమనుమందు ప్రభావమునన్‌జరించితిన్."
— ఆంధ్ర మార్కండేయ పురాణము.

ఈ విధముగ ఈశ్వర సత్కృపను పాదలేపము కలిగినదని, రసలింగము నీడు సజ్జలోని దంతపు భరణినుండి తీసియిచ్చుటయు, ధరించిన వేషమును ఔషధసిద్ధుని శివదీక్షాపరుడని చెప్పక చెప్పుచున్నవి.

ఇక ప్రకృతి వర్ణనమునందును పెద్దనార్యునకు కనబడునది శివస్వరూపమే.

"చండీశ తాండవోత్సవ సంభృత క్షపా
హస్తాగ్ర దీప గభస్తి చయమొ" 3–17

అనునట్లున్నదట సంధ్య. శివతాండవ సమయమున రాత్రి యను స్త్రీ హస్తాగ్రములపట్టిన దీపకాంతుల సమూహమో యనునట్లున్నదట. ఇట సంధ్యయందు శివస్వరూప ధ్యానము.

సాంధ్యనటన చండచండీశ పదహతిఁ
దరణి చక్రమొరగి శరధి గ్రుంగ
దొరగల్గు వడియె భూరథేతర భాగ
చక్రమనగ నపుడు శశియు దోఁచె. 5–35

చంద్రోదయమైనది. సంధ్యా తాండవ మొనర్చు శివుని తీవ్రపాద ఘట్టనముచే భూరూపమగు రథమొరగిలబడగా, ఆ రథమునకొక చక్రమగు సూర్యుడు సముద్రమున బడి మునుగగా పైకిలేచిన రెండవ చక్రమనునట్లు చంద్రుడుదయించెను. చంద్రోదయ సమయమందును ఈశ్వరుని సంధ్యా తాండవ మూర్తియే పెద్దన కనులకు కనబడునది.

"అనలాక్షు ఘనజటా వనవాటి కెవ్వాడు
వన్నెవెట్టు ననార్తవపుఁ బువ్వు" 1–18

ధూర్జటి ఘనజటా వనవాటికి వన్నెవెట్టు ఋతు సంబంధములేని పూవట చంద్రుడు. ఋతు సంబంధి పుష్పమైనచో ఆ ఋతువునందు మాత్రమే వన్నెలు చిందును. ఋతు సంబంధి కానిదనుటచే అన్ని ఋతువులయందును వన్నెలు చిందుననీ భావము.

సంధ్యయందు, చంద్రోదయ మందును మాత్రమే కాదు. కటికి చీకటి యందును కనుపించునది పెద్దనకు ఈశ్వర స్వరూపమే.

"మృగనాభి పంకంబు మెయినిండ నలదిన
మాయా కిరాతుమైఁ చాయఁదెగడి" 3–19

రోదసీ గహ్వరమున కటికి చీకటి యున్నదట. నల్లని కస్తూరిని శరీరము నిండ పూసికొనిన మాయాకిరాతుని (కిరాతార్జునీయ ఘట్టమునందలి ఈశ్వరుని) మేని కాంతిని తెగడి యున్నదట ఆ కటికి చీకటి.

హిమాలయమును దర్శించుట యందు పెద్దనార్యుని ప్రవరునకు జ్ఞప్తికి వచ్చినది హిమాలయమునకు ఈశ్వరునితోగల సంబంధమే.

"పుచ్ఛడీక-తనంబు పోబెట్టి గిరికన్య
పతి గొల్వ నాయాస పడిన చోట
వలరాచ రాచ వాడలి కాక్షు కను వెచ్చఁ
గరగిన యల కనికరపుఁ జోటు" 2–9

"పసపు నిగ్గులు తేఱు పాప జన్నిదమొప్పఁ
బ్రమథాధిపతి యింటి పట్టెటింగె" 2–11

పార్వతీదేవి సిగ్గరి తనసును విడచి పతిని (శివుని) కొలువ నాయాసపడిన చోటట! ఫాలాక్షుని కంటి మంటకు మన్మథుడు కరగిపోయిన కనికరపు చోటట! పచ్చని కాంతుల నీను సర్పయ

జ్ఞోపవీత మొప్పు చుండు ప్రమథాధిపతి ఈ తుషారాద్రి కారణముననే యింటి పట్టైటింగెనట.

హిమవన్నగమున కేగినది ప్రవరుడుకాడు. ప్రవరుని రూపమున పెద్దనార్యుని ఆత్మయే. అటులకానిచో ఈ భావనీరాజనమునకు సాఫల్యమేమి ?

సంధ్యయందు, చంద్రునియందు, కటిక చీకటిలో, హిమవన్నగ దర్శనమున మాత్రమే కాదు. చంద్రోపాలంభ సందర్భమునను పెద్దనకు ఈశ్వర స్మరణమే.

> "త్రిపుర సంహార మొనరించునపుడు హరుడు
> బండికల్లుగ నీ మేను గండిచేసె
> నదియు సెలవాటి తెగటాఅవ్వైతి చంద్ర" 3–40

త్రిపురాసుర సంహార కాలమున శివుడు తన రథ చక్రముగ చేసికొననెంచి నీ శరీరమును బెజ్జము చేయగా ఆ గాయము సెల వేసి చావవ్వైతివి కదా చంద్రా !

ప్రకృతి వర్ణనముననే కాదు. వివిధ విషయములందును పెద్దనకు ఈశ్వరాంశ సందర్శనమే. రక్కసుని రూపమున నున్న ఇందీవరాక్షుడు "గిరీశ గళమూల హాలాహల కాలకాంతితో మేనటికంబులాడు తనమేటి త్రిశూలము పూని యుద్ధతిన్" స్వరోచిని తాకెనట (4–96). శివుని కంఠమూలమునందున్న కాలకూట కాంతితో మేనటికము లాడుచున్నదట రక్కసుని త్రిశూలము. ఇక వేట సమయమున స్వరోచి కంటబడిన అడవి పంది

> "కఠిన కంఠేకాల కంఠమూలము వాసి
> వెసవచ్చు నుజ్జ్వల క్ష్వేళమనగ" (6–88) ఉన్నదట.

శివుని కంఠమూలమున నుండక బయటకువచ్చు హాలాహలమా యనునట్లున్నదట ఆ అడవిపంది. సర్వవిషయములందును సర్వేశ్వరుని సందర్శించిన ధన్యుడు పెద్దన.

శ్రీ వేంకటేశ్వర భక్తుడగు శ్రీకృష్ణదేవరాయలను శివుడు రక్షింపవలెనని

> "ఉల్లమునందు నక్కటికమూనుట మీకులమందుగంటి మం
> చల్లనమేల మాడు నచలాత్మజ మాటకు లేతనవ్వు సం
> ధిల్ల గిరీటి బాశుపత దివ్య శరాఢ్యుని జేయు శాంబరీ
> భిల్లుడు కృష్ణరాయల కభీష్ట శుభ ప్రతిపాది గావుతన్"
> (1–2)

అని కోరుట పెద్దన ఆత్మీయతయేగాని రాయల అభీష్టము కాదు. కృత్యాదియందే కాదు. ఆశ్వాసాద్యంత పద్యములందును ఈశ్వర ప్రసక్తి కనబడుచున్నది.

> శ్రీ వెంకటేశ పద ప
> ద్మావేశిత సదయ హృదయ ! హరనిటల నట
> త్పావక పరిభావి మహః
> ప్రావృత నిఖిలాశ ! కృష్ణరాయ మహీశా ! 3–1

హరుని లలాటము నందు నర్తించు అగ్నిని పరిభవించు ప్రతాపాగ్నిచేత ఆవరింపబడిన దిక్కులు గలవాడా ! అని రాయలను గూర్చిన సంబోధన. రాయల ప్రతాపాగ్నిని వర్ణింప నెంచినంతలో హరుని లలాటాగ్ని పెద్దన కన్నులకు కనబడినది.

> "వరపంచారామ రామామణీ గేయామేయ జయాంక"
> (6–124)

అని కూడ రాయలు వర్ణింప బడినాడు. పంచారామములయందలి స్త్రీ రత్నములచే గానము చేయబడదగిన జయములు కలవాడా ! అని. అమరారామము,కుమారారామము,సోమారామము,క్షీరారామము, దాక్షారామము; అనునవి పవిత్ర శివక్షేత్రములు. కృష్ణరాయల కీర్తిని కొనియాడ జేయుటకు పెద్దనకు స్ఫురించినది పంచారామములలోని రామామణులేగాని వేరొకరు కారు. ఇది పెద్దనార్యుని పూర్వాశ్రమ సంస్కార వాసనా ఫలితమేగాని వేరొండు కాదు.

పెద్దన కావించిన పూర్వాంధ్ర కవిస్తుతి యిట్లున్నది :

> వ్యాస రచిత భారతామ్నాయ మాంధ్ర భా
> షగ నొనర్చి జగతీ బొగడు గనిన
> నన్నపార్యు, దిక్కనను గృతక్రతు శంభు
> దాసు నెఱ్ఱ సుకవి దలతు భక్తి 1–8

భారతము నాంధ్రీకరించిన నన్నయను, తిక్కనను, శంభుదాసుడగు ఎఱ్ఱనను భక్తితో తలంతు ననుచున్నాడు. అవిరళజప హోమ తత్పరుడనని చెప్పికొనిన నన్నయకు గాని, "హరహరనాథ పాద నిరంతర స్మరణ తత్పర భావము కల్మినాత్మ సమ్మోదము బొందుదు" ననిన తిక్కనకు గాని ఆయా విశేషణములనుప యోగింపక, "శివపదాబ్జ సంతతధ్యాన సంసక్త చిత్తుడ"నని చెప్పికొనిన ఎఱ్ఱనకు మాత్రము శంభుదాసుడను విశేషణము తగిలించుటకు పెద్దన దృష్టిలో నున్న ఎఱ్ఱనార్యుని శివభక్తి తత్పరతయే కారణము కాని మరియొకటి కాదు. అట్లగుటకు పెద్దనకుగల శైవ మతాభిమానమే కారణము.

[ "ఈశ్వరార్చన కళాశీలుడు" గ్రంథ రచనా మూలమున ఈ వ్యాసరచనకు ప్రేరణ కలిగించిన డా. కొర్లపాటి శ్రీరామమూర్తిగారికి ఈ వ్యాసమును భక్తి పూర్వకముగ సమర్పించుచున్నాడను — జూ. వెం. రావు. ]

---

1. ఈశ్వరార్చన కళాశీలుడు. పుటలు 30, 31.
2. ,, ,, పుటలు 17–18.

*జూలూరి వెంకటేశ్వరరావు*

## ఒక యజ్ఞాత లక్షణ ప్రబంధము

# "రసమంజరి"

ఇది మా ప్రపితామహుడగు రామయ్యగారు స్వహస్తాన లిఖించుకొనుచు, సంధానించుకొనిన తాళపత్ర భాండాగారమునుండి నాకు లభించినది. దీని ముఖపత్రముపై "రౌద్రినామ సంవత్సర

చైత్ర శుద్ధపంచమీలు'' అని త్రద్రచనా కాలమున్నది గాని మీరాద్రియే శకమునకు సరిపోవునో చెప్పుటకు వీలులేదు.

ఈ కృతిభానుదత్తుని రసమంజరి కనుసరణము. కవి చక్రవర్తియైన భానుదత్తుడు శా. శ. 1220–80 నడుమ వెలసిన సంస్కృత కవి. అతని రసమంజరికి రసతరంగిణి అలంకార తిలకముల కన్న గొప్ప పేరున్నదనుటకు నిప్పటివరకు దానికి వెలువడిన యనువాదములు మరియు వ్యాఖ్యలే నిదర్శనము.

రాయల రసమంజరి దాని కనువాదమగునో లేదో తెలియదు గాని దాని నిజమైన యనువాదములు పదునారవ శతాబ్ది యుత్తరార్ధమున వెలసిన గణపవరపు వేంకటకవితో నారంభమైనవి. అతని పిమ్మట నెల్లూరివీరరాఘవ కవి, శ్రీమన్నారాయణయ్య, గుడిపాటి కోదండపతి, తాడూరి లక్ష్మీనరసింహారావు, అమరవాది నీలకంఠయజ్వ, తాడేపల్లి సాంబమూర్తి యనువారు క్రమముగా ననువదించుచు వచ్చిరని ఆంధ్రప్రతాప రుద్ర యశోభూషణ పీఠిక సాహిత్య కుసుమాంజలి వలన దెలియును. పైవారేగాక విజమూరి శివరామారావుగారు గూడ నొకటి రచించినటుల దెలియును.

ప్రస్తుతము నాకు లభించిన గ్రంథము సాహిత్య కుసుమాంజలి గీలించినవారి దోసిలిలోనికిగాని, యితర కవి చరిత్రకారుల దృష్టిలోనికి గాని రాలేదు.

ఈ కవి తన గ్రంధావతారికయందు—

మకరకుండల కేయూర మహితహార
భాసురుండగు మదన గోపాలదేవు
డమిత కృపతోడ కలలో మదంకితముగ
విలత శంగార కవిత గావింపుమనిన—

వ. మహాప్రసాదంబని సంతుష్టాంతరంగుండనై తదనంతరంబ

చ. ధరపయి పాలవాయికులధన్యుడు వెంగయరంగనాథుడీ
శ్వర కరుణాధురంధరుడు సర్వకళాప్రతిభాన్వితుండు ము
ఖ్య రస కవిత్వతత్వ నిధియంచును నెప్పుడు సత్కవీశ్వరుల్
దరచుగ నెన్నగా మిగుల దైవకటాక్షము గల్గి పెంపునన్.

తే. తనర కవిత యొనర్చును ధరణి వెలయు
నఖిల కవిజన కర్ణరసాయనముగ
రసవివేకులు దీని పరామృశించి
యాదరింపగవలయు నిర్వ్యాజులగుచు

అనియు నాశ్వాసాంత గద్యములందు

''ఇది శ్రీ మదనగోపాల వరలబ్ధాఖిల కవిత్వ తత్వాప స్తంబసూత్ర కుత్సస గోత్ర పవిత్ర పాలవాయి వెంగిభట్టార్య రంగనాథ ప్రణీతంబైన రసమంజరీ కావ్యంబునందు'' అనియు జెప్పుకొని యున్నాడు. ఈ యవతారికా శ్వాసాంతములనుబట్టి జూడ వీరి యింటిపేరు పాలవాయివారు. కుత్సస గోత్రులు. ఆపస్తంబ సూత్రులు. తండ్రిపేరు వెంగభట్టు. తనపేరు రంగనాథుడు. వీరు శ్రోత్రియులు గావచ్చును. ఇతడు మదనగోపాల వరమున కవితాతత్వము నెరిగినవాడని తెలియును.

ఈ మదనగోపాలుని నివాసము కృత్యాది మరియు షష్ఠ్యంతములనుబట్టి గుచ్చాద్రియని దెలియును. ఆ పద్యము లివి:

శ్రీలక్ష్మీ కుచకుంభసీమ విలసచ్ఛృంగార కాశ్మీర ప
త్రాళిన్ వ్రాయుచు నొక్క కేవ మురళీహస్తంబు నిర్మించి యు
బ్బాలన్ గేలియొనర్చి వేడుకలచే భాసిల్లు గుచ్చాద్రి గో
పాలస్వామి ననంత యుక్తిమతిచే భావించి సేవించెదన్.

శరణాగత రక్షకునకు
పర వీరభయంకరునకు ప్రవ్యక్తునకున్
గురుసుతపాలున కంగజ
గురునకు గుచ్చాద్రి మదన గోపాలునకున్

గుచ్చమనగా గుత్తి. గనుక నీ గుచ్చాద్రి గుత్తికొండకు సంస్కృతీకరణము. అది నేడు జిల్లాలో నున్నది. కనుక నీ కవియు నా ప్రాంతపువాడే కావలెను.

ఇందు ప్రథమోల్లాసమున స్వీయతదంతర్భావమైన ధీరాధీరాది భేదములు, పరకీయ, తదంతర్భావమైన విదగ్ధాది భేదములు మరియు సామాన్య లక్షణములున్నవి.

ద్వితీయోల్లాసమున అష్టవిధ నాయికలు, వారికి సహాయలగు దూతికలు చెప్పబడినారు. ఈతడు ''ప్రవత్స్యత్పతిక'' యను నవమ నాయిక నంగీకరించి యామె లక్షణము నిట్లు వివరించెను :


# ఆంధ్రపత్రిక

## చందా వివరములు

**విడి ప్రతి: 30 పైసలు**

| | న్యూస్ ఏజంటుద్వారా | పోస్టుద్వారా |
|---|---|---|
| | రూ. పై. | రూ. పై. |
| సంవత్సరచందా | 108-00 | 115-20 |
| అర్ధసంవత్సరచందా | 54-00 | 57-60 |
| మూడు మాసాలు | 27-00 | 28-80 |
| నెల చందా | 9-00 | 9-60 |

''ప్రస్థానం వలయై:కృతం ప్రియసఖై ర(స్రై రజస్రంగతం
ధృత్యానక్షణ మాసితం వ్యవసితం చిత్తేన గంతుం పురా
యాతుం నిశ్చిత వేతసి ప్రియతమేస్సర్వైస్సమం ప్రస్థితం
గంతవ్యే సతి జీవితం ప్రియసుహృత్సార్థ: కిముత్సంజ్యతే!"

దీనికీతని యనువాద మిట్లున్నది :

వలయము లుంగరంబులును వజ్రపు మేఖల ధైర్యమకులన్
వలనుగ నీదు చిత్తమును వారకమున్ను ప్రయాణ యత్నముల్
దలకొన, నాయకుండు గమనంబున కిప్పుడు నుద్యమింపుమో
చలమరి జీవనా నిలమ! సఖ్యమదేటికి వీడెదిప్పుడున్.

తృతీయోల్లాసమున శృంగార నాయకులు మరియు వారికి కాగల సహాయులను గుఱించియున్నది.

ఈతడు కృత్యాదినిట్లు ప్రతిజ్ఞ నొనర్చినాడు :

పొసగ ననంతమే కృతులు బుద్ధికొలందిని జెప్పవచ్చుగా
నసమతరాకృతిన్ వెలయునట్లు రసాన్విత కావ్య మార్గమిం
పెసగగ గాంచి గూర్చుటకు నెంతటి వానికినైనగాని సా
ధ్వసము జనించు నెట్లయిన ప్రౌఢిమ మీరగజేయు నయ్యెడన్

* * *

మంజుపద లీలగల రస
మంజరియను నాట్య రమణి మహిరాణింపన్
గొంజక నాడించెద కవి
పుంజము తద్రసవిలాస భూతిగనంగన్.

మన సాహిత్యమున శాస్త్రగ్రంథ రచన రెండువిధములుగా సాగినది. అందొకటి పూర్వకవి కావ్యములు పరిశీలించి లక్ష్యము లుద్ధరించుట. రెండవది యేక నాయకపరముగా లక్ష్యములు రచించుట. ఇందీ కవి రెండవ మార్గమునే యనుసరించి నట్లీ పద్యము వలన దెలియును.

ఈ రసమంజరి పద్యము
లారసి యర్థంబు సేయు నప్పుడు సుకవుల్
నేథుపున కృష్ణ పరముగ
కూరిమి నర్థంబుసేయ కొమరగు మిగులన్.

ఇది భానుదత్తుని కృతి కనుసరణమని మొదట జెప్పితిని. దానిని కవియే —

సదమల భావ విస్ఫురస సర్వ కవీంద్ర మనోద్వి రేఫమిం
పొదవ రసాభిలాషమున నుండుటకై కవిభాను మిశ్ర స
మ్మద కృతియైనయట్టి రసమంజరి మంజుల పుష్పమంజరీ
మృదుతర రీతి నత్యధిక హృద్యముగా నొనరింతు నెంతయున్.

అని తెలిపెను. అంతేగాక—

ఇందు మదీయ ప్రౌఢిమ
కందందు రచింతు కల్పనాకృతిగా నిం
పొంద నుదాహరణంబులు
కుందనమున జాతి కెంపు గూర్చిన భంగిన్.

అని తాను దీనియందు స్వీయకల్ప నోదాహరణము గూడ గూర్చినట్లు జెప్పెను. అట్టి వానిలో కవి మదీయుని యిచ్చిన యుదాహరణము లొందు రెండు జూపుదును.

వృత్తసురత గోపనకు లక్ష్యము —

పెదవి వ్రణంబిదేమి సతి? పెంపుడుచిల్క ఫలంబు కాముడా!
కుదురు మెఱుంగు చన్నుగవ కొప్పడ జీరవిదేమి దెల్పవే!
సదయుడ కేళికా విపిన శాఖిని పూవులుగోయుచుండన
య్యదనున కేతకీ ప్రసవమంటె తటిల్లున, నేమిసేయుదున్

వర్తమాన సురత గోపనకు లక్ష్యము—

కారణ మొప్పగా ప్రియుని కౌగిట జేర్ప విదేమి చిత్రమే?
వారిజ నేత్రి ఘర్మజల భారముచే! అదిగాక చిల్కమా
చారురతి ప్రసంగముల సాటి నెలంతలతోడ జాటగా
భారవు సిగ్గుచే! మరియు ప్రత్యహము పడకింటి లోపలన్
గూరుకు రాదదేమో? పతికోపము జేసిన జేయనీ సఖీ !

నాకు లభించిన యప్రతి సమగ్రమైనను తాళపత్రములు శిథిలమైనందువలన యెడనెడ కొన్ని యక్షరములు మరియు పదములు లోపించినవి.

నేను భానుదత్తుని ''రసమంజరి''ని జూడలేదు కనుక జిజ్ఞాసువు లెవరైన నున్నయెడల నీ యుదాహరణములను మూల ప్రతితో పోల్చి చూచి గుణాగుణములు నిర్ణయింతురని, దీని సమగ్రమైన ప్రతిని సంపాదించి కవి తన ప్రతిజ్ఞను నిర్వహించుట యందెంతవరకు కృతకృత్యుడైనది, యేయే నూతన లక్షణములు ప్రవేశపెట్టినది పాఠక లోకమునకు దెలిపెదరని యకృతి పరిచయమును జేసితిని.

శ్రీ కపిలవాయి లింగమూర్తి

# ముగిసిన ఒక శకం

ఆరవ లోకసభ ఎన్నికలలో, ప్రజలచే తిరస్కరించబడ్డ శ్రీమతిఇందిరాగాంధీ రాజకీయ భవిష్యత్తుపై ఎన్నో ఊహాగానాలు జరుగుతున్నాయి. శ్రీమతిగాంధీ కనీసం తక్కువమెజారిటీతో నెగ్గగలరని భావించిన విదేశీ పరిశీలకులకు ఆమె ఓటమి ఒక విస్మయంగా తోచింది. 'టైమ్స్ పత్రిక' జనతాపక్షం విభిన్నపక్షాల కలగాపులగమని, అది చాలారోజులు పదవిలో వుండటం సంశయమనీ వ్రాస్తూ—తమ సంస్థను బలిష్టపరచి, ప్రజల మన్ననలను పొంది, శ్రీమతిగాంధి తిరిగీ అధికారంలోనికి రావచ్చునని, అభిప్రాయం వెళ్ళబుచ్చింది. కానీ అమెరికాపత్రికలలో మరికొందరు పరిశీలకులు శ్రీమతిగాంధీ ఎంతవరకు తమ ప్రభావాన్ని కాంగ్రెసు సంస్థపై చూపగలరని సంశయిస్తున్నారు. 'ఫైనాన్సియల్ టైమ్స్'కథనం ప్రకారం, కాంగ్రెసులోని తీవ్రవాదులు దేశంలో కాంగ్రెస్సుపై ప్రజలకు ఏర్పడిన తిరస్కారభావానికి, శ్రీమతిగాంధీని నైతికంగా బాధ్యురాలనుచేసి, ఆమెను కాంగ్రెస్సునుండి తొలగించవచ్చుని ఒక

అభిప్రాయం. ఏ విషయమూరాబోయే సంఘటనలే నిర్ణయించగలవు. కానీ, ఒక దశాబ్దంపైన దేశాన్ని పరిపాలించి, ప్రజలమన్ననలను బడసి, దేశవిదేశాలలో ఖ్యాతిగాంచిన ప్రధాని, ఒక సామాన్య అభ్యర్థి వలె ఓడిపోవటం, అటు ప్రజల రాజకీయ చైతన్యానికి నిదర్శనంగాను, ఇటు ప్రధాని వ్యక్తిగత విధానాలపై ఒక తీర్పుగానూ పరిగణింపవలసి వస్తుంది.

మొట్టమొదట ప్రధానిగా ఎన్నుకోబడ్డప్పుడు శ్రీమతి గాంధీగారిని గురించి ప్రజలకు అంత ఎక్కువగా తెలియదు. మొరార్జీ విరుద్ధంగా ఆమె గెల్చినప్పుడు, ఆమెను "నెహ్రూ కూతురుగా", "ప్రథమ మహిళా ప్రధానిగా" అభివర్ణించారు. ఆమె ప్రధానిగా వర్తించిన తొలి సంవత్సరాలు, ఆమెను పార్లమెంటులో ఒకమంచి వక్తగాకూడా గుర్తింపుకు తేలేకపోయాయి. శ్రీలోహియా వారిని "మూగబొమ్మగా" అభివర్ణించిన సమయంకూడా లేక పోలేదు. అప్పటిలో తీవ్రంగా పరిణమించిన ఆహారసమస్య, విదేశ మారకపు ద్రవ్య సమస్యలను ఆమె పరిష్కరించలేక పోయింది. ముఖ్యంగా అమెరికా ఒత్తిడికి లోనై, రూపాయి మారకపువిలువను తగ్గించడం, పి.యల్. 480క్రింద అమెరికా సహాయం పొందటం వంటి చర్యలు, వారిని దక్షిణపక్షపు వారినుండి వేరుచేసింది.

కానీ, నాల్గవ సాధారణ ఎన్నికలలో పెద్ద మెజారిటీతో నెగ్గడం, 1969లో రాష్ట్రపతి ఎన్నికలలో తనకంటె అనుభవజ్ఞులైన కాంగ్రెస్సు నాయకులను రాజకీయచతురతతో ఓడించి, కాంగ్రెస్సు విభజన, దాని వెన్నంటివొచ్చిన రాజకీయ సంఘటనలను ధృడంగా ఎదుర్కొనడంతో, శ్రీమతిగాంధీ ప్రజల దృష్టిలో పూజ్యురాలైనారు. తమ సిద్ధాంతాలను ఫురోగమన దృక్పథంతో రూపొందించి, బ్యాంకుల జాతీయకరణ, రాజభరణాల రద్దు మున్నగు చర్యలతో, తమపార్టీకి ఒక ఉత్తేజాన్ని సమకూర్చారు. తర్వాత జరిపిన మధ్యంతర ఎన్నికలలో ఘనవిజయాన్ని సాధించి, అప్పట్లో ఎదురైన బంగ్లాదేశ్ సమస్యను, సముచితరాజకీయ చాకచక్యంతో పరిష్కరించి, రాబోయేతరాలకు ఒక ఆదర్శం నెలకొల్పారు.

కానీ, దేశంలో అప్పటినుండే ఒక రాజకీయ నైతిక పతనం ప్రారంభమైంది. తెలిసో, తెలీకో ప్రధాని అధికారాన్ని కేంద్రీకృతం చేయనారంభించారు. రాష్ట్రాల అధికారాలు మూలబడ్డాయి. ప్రతి చిన్న విషయానికి రాష్ట్ర ముఖ్యమంత్రులు ఢిల్లీకి పరుగులెత్తడం ప్రారంభించారు. ఫెడరల్ రాజ్యాంగవ్యవస్థ కేవలం నామమాత్రమైంది. దుర్బల ప్రతిపక్షాలు, అధికారదాహంతో వర్తించే రాజకీయ నాయకులు ఈ క్రియకు దోహదమైనారు.

పరిపాలనవర్గం ప్రజలకుచేసిన వాగ్దానాలను నిలబెట్టలేక పోయింది. ప్రజలలో నానాటికి అశాంతిరెచ్చిపోయింది. ప్రజాస్వామ్య వ్యవస్థ ఒక కఠిన పరీక్షకు గురిఅయింది. ఈలోగా జె. పి. ఉద్యమం బయల్దేరింది. దానిముఖ్యోద్దేశ్యమేమైనా, అది రాజకీయ వ్యవస్థను ఎంత గందరగోళపరచినా, ప్రజలనది ప్రభావితం చేసిందన్నమాట తథ్యం. గుజరాత్ ఉద్యమం ప్రజల ఆగ్రహానికి మచ్చుతునకైంది. ఈ ఉద్యమాన్ని పటిష్టంగా ఎదిరించి, ప్రజల మెప్పును పొందే ధైర్యం పరిపాలనావర్గానికి లోపించింది. ప్రజల, ప్రభుత్వపుమధ్య 'అగాధం' ఏర్పడింది. అనేక సమస్యలకు అధికార యుక్తమైన, పరిష్కారాలు చూపించారేగానీ, ప్రజాభిప్రాయ యుక్తమైన పరిష్కారాలుచూపించలేకపోయారు. ఆంధ్రఆందోళన దీనికి ఒక తార్కాణం.

ఇది ఇలా వుండగా, జనతా ఫ్రంట్ గుజరాత్ ఎన్నికలలో దిగ్విజయాన్నిపొంది, కాంగ్రెస్సు వ్యతిరేక ప్రభంజనానికి నాందీ పలికింది. అదే సమయింలో అలహాబాద్ హైకోర్టు తీర్పు ప్రతిపక్షాలను మరింత ఉత్తేజపరచింది. ఆ సమయానికి తగ్గట్టు ఒక హోదాతో ప్రధాని ప్రవర్తించకపోవడం శోచనీయం. అత్యవసర పరిస్థితి, రాజ్యాంగ సవరణలు, అధికార పార్టీ నిజాయితీని సంశయింపజేసాయి. అత్యవసర పరిస్థితి వలన దేశంలో సుస్థిరత ఏర్పడినా, స్వేచ్ఛా స్వాతంత్ర్యం లోపించడంతో ప్రజల ప్రభుత్వపు మధ్య అవగాహన, సహకారంబదులు భయం, ద్వేషం పులుముకొన్నాయి. పత్రికా స్వాతంత్ర్యం పోవడంతో విరివిగా జరుగుతున్న అధికార దుర్వినియోగం ప్రజల ముందు, పరిపాలకుల ముందు, పత్రికలు తేలకపోయాయి. వారసత్వపు రాచరికంవలె, శ్రీ సంజయ్ రాజకీయాలలో రావడం, ప్రధాని ఆ చర్యలను సమర్ధించడం, హేయమైనది. ఈచర్య కాంగ్రెస్సుపై ప్రజలకుగల అభిమానాన్ని హరించేటట్టు చేసింది.

ఎన్నికల ఫలితాలు ప్రజల తీర్పును చెప్పాయి. ఒక శకం అంతరించింది. శ్రీమతి గాంధీ పతనాన్ని అనుసరించి, మనం కొన్ని సిద్ధాంతాలను రూపొందించవొచ్చు.

అ) విశృంఖల అధికారం — ముఖ్యంగా రాజకీయాలలో — వ్యక్తి పతనానికి మూలహేతువు.

ఆ) స్వేచ్ఛ, స్వాతంత్ర్యం లోపించినపుడు, అధికార దుర్వినియోగం తప్పదు.

ఇ) ప్రజాభిప్రాయాన్ని తిరస్కరించి, ఏ పాలనవర్గము చాలా కాలం మనజాలదు.

ఈ) క్రమశిక్షణ అన్నది ప్రజలలో ఉద్భవించాలేగాని, బలవంతంగా రుద్దబడరాదు.

*డా. మురళీధర*

# షాబాజ్ జౌలియాగారి సమాధి : కొన్ని చారిత్రకాంశాలు

దాక్షారామము ఒకనాటి జననాథపురం. కొంతకాలం పేద డాకిరేమిగా వ్యవహరించబడి క్రమేణా దాక్షారామమైంది. నేటి దాక్షారామము శైవులకు మాత్రమేకాక, ముస్లిమ్‌లకు సైతం దర్శనీయమైన ప్రాచీన పుణ్యస్థలం. రెండు అతి ప్రాచీనమైన మశీదులు, షాబాజ్ జౌలియాగారనే ప్రసిద్ధ ముస్లిం ప్రవక్త సమాధీ ఈ గ్రామంలో వున్నాయి. షాబాజ్ జౌలియాగారి సమాధికల ప్రాంతము,

దాని ప్రక్కనేవున్న నేటి వెలంపాలెం మశీదు(శాసనాలలో వెలుంబలిగా పేర్కొనబడ్డ సమీప ప్రాంతం నేటి వెలంపాలెం) రాజమండ్రి వేణు గోపాలస్వామి ఆలయంవలె, ముస్లిమ్ పాలకుల మత విజృంభణకు గురియై మశీదులుగా మార్చబడిన దేవాలయాలు. అందుకు బుజువులుగా మశీదులలోని హైందవ దేవాలయ శిల్పరీతికి చెందిన స్థంభాలు, చెక్కబడిన రాళ్లు చూపరులకు కనపడతాయి. ఏ సుల్తాన్ దండయాత్ర ఫలితంగా గ్రామంలోని దేవాలయాలు శిధిలమై మశీదులుగా రూపొందాయి? అన్న ప్రశ్నకు జవాబుగా శాసన పరమైన ఆధారాలేవీ కనపడవు కాని, షాబాజ్ జౌలియాగారి గురించి స్థానికులు పరంపరగా చెప్పకునే వృత్తాంతంవలన తెలుసుకోదగిన చారిత్రకాంశాలు వున్నాయి. గత శతాబ్దంలో ప్రచురించబడిన "**District cazeteer of Madras presidency: East Godavari**"లో షాబాజ్ జౌలియాగారి వృత్తాంతాన్ని వుదహరించబడింది.

స్థానికులు చెపుతున్న కథనం నేటికీ ప్రచారంలో వుంది.

షా—బాజ్ జౌలియా నాగోర్‌మీర్ సాహెబ్‌గారి సమకాలికుడు. 500 ఏళ్లక్రితం, మదీనావద్ద గర్దెజ్‌లో జన్మించి, శిష్య బృందంతో దాక్షారామం చేరుకున్నారు. కాశీలో వ్యాసమహర్షికి ఒక యింట్లోనూ భిక్ష లభించనట్లే, జౌలియాగారి శిష్యబృందానికి భిక్ష లభించనందువల్ల ఆకలికి ఓపలేక, శైవమఠానికి చెందిన ఒక గోవును వధించి, గోమాంసాన్ని భుజించారు. శైవులకీ, నవాబులకీ మధ్య ఘర్షణ జరిగింది. జౌలియాగారు, శైవమఠాధిపతీ సవాళ్లు వేసుకున్నారు. శివలింగాన్ని ఒక చెరువులోనికి విసిరి, మళ్ళీ పైకి తెచ్చినవారే మఠాధిపతులుగా వుండాలని తీర్మానించుకున్నారు

శివమఠాధిపతి ఎంతగా ప్రార్థించినా చెరువులోకి విసిరిన లింగం పైకి రానేలేదు. జౌలియాగారు తమ మహత్తుతో శివలింగాన్ని పైకి తెప్పించి విజయం సాధించి, శైవమఠాన్ని తనవశం చేసుకుని, దాన్ని మశీదుగా మార్చివేశారు. జౌలియాగారికి వారసులుగా చెప్పబడుతున్నవారు నేటికీ దాక్షారామంలో వున్నారు. జౌలియాగారు, మఠాధిపతీ పందేలు వేసుకున్న చెరువు 'లింగాల చెరువు' అని వ్యవహరించబడుతూ వుంది.

మహత్తులనేవి (Miracles) ప్రాచీన కాలంలోనూ, ఈ'Synthetic Super' యుగంలోనూ కూడా జరిగి వుండలేదని డాక్టర్ కోవూర్ ప్రసంగాల సారాంశం.

జౌలియాగారు శివలింగాన్ని తమ మహత్తును ప్రదర్శించి నీళ్లలోంచి పైకి తెప్పించారా? పండితయ్య శైవమత భక్తునిగా మానవాతీత శక్తుల్ని ప్రదర్శించారా? ఒక యోగి మంత్రజలం చల్లినంత మాత్రాన కాళ్లు చేతులు తెగిన సారంగధరుడు యధా పూర్వస్థితిని పొందాడా? వంటి ప్రశ్నలకు సమాధానం చెప్పడం కష్టమే. ఆయా కాలాల్లో, ఆయా మహత్తులను మహాపురుషులకు అంటకట్టబడిన మహత్తులను, యధాతధంగాకాక, వారి అభిమానుల అతిశయోక్తులుగాకూడా భావించాలి మనం. జౌలియా గారి కధనంవలన తేలిన చారిత్రకాంశాలు.

1. 19వ శతాబ్దం చివరిభాగంలో జరిగిన కధాకాలం 500 ఏళ్లక్రితం అని చెప్పడంవల్ల జౌలియాగారు 14–15 శతాబ్దాల మధ్యకాలంలో దాక్షారామం చేరుకుని వుండవచ్చు. అప్పటికే పురాతన గ్రామంలో ప్రసిద్ధ భీమేశ్వరాలయం కాక మరి కొన్ని శైవమఠాలు, ఆలయాలు వుండేవి.

2. జౌలియాగారి కథనం వలన ఆనాడు శైవులకీ, నవాబులకీ మధ్య మతపరమైన ఘర్షణలు జరుగుతూ వుండేవని, కొన్ని సందర్భాలలో ముస్లిమ్‌లే ఆధిపత్యం వహించి శైవమఠాల్ని ఆక్రమించుకుని వుండవచ్చును.

3. మరపు మసకల వెనుక దాగిన కాలగతికేసి, మనోనేత్రం తెరచిచూస్తే—

మతపరంగా ఆనాడు జరిగిన రక్తపాతాలు, క్రూరహత్యలు సాక్షాత్కరిస్తాయి మనకు. మధ్యయుగపు నవాబుల దండయాత్రల గురించి, శ్రీ నేలటూరి వెంకటరమణయ్యగారు "వాళ్లు పగిలెను. వీళ్లు పగిలెను. వూళ్లు తగలెను. పురములు బెగసెను" అని తమ కవితలో చెప్పడం జరిగింది. బౌద్ధులు జైనుల్ని, శైవులు బౌద్ధ మతస్థుల్ని, శైవుల్ని నవాబులు ఒకరి నొకరు హింసించుకున్న ఘట్టాలు, ఒకరి వసదుల్ని మరొకరు ఆక్రమించుకున్న సన్నివేశాలు చరిత్రలో లేకపోలేదు. ఆవిధంగానే బౌద్ధారామాలు శైవారామాలుగా మార్పు చెందినట్లుగానే శివాలయాలు మసీదులైనాయి. ప్రస్తుత కాలంలో ఈ గ్రామంలో హిందూ—ముస్లిం సోదరుల ఐక్యత అవిచ్ఛిన్నంగా సాగుతోంది. ప్రతి ఏడాదీ జౌలియాగారి దరగాలో వుత్సవాలు జరుగుతాయి. ఆ వుత్సవాలలో ముస్లిం సోదరులతోబాటు, హిందువులుసైతం వుత్సాహంగ పాల్గొనడం చూస్తుంటే ఒకనాటి శిధిల శైవమఠం సుమా అన్న భావన, హిందువుల మనస్సు మారుమూలల్లో ఏ కొంచెంగానైనా దాగి వున్నదేమో అనిపిస్తుంది.

ఏమైనా జౌలియాగారి దరగా, నేటి హిందూ—ముస్లిం సోదరుల మత సామరస్యానికి ఒక నిదర్శనంగా కనపడుతుందీనాడు.

**శ్రీ పి. నరసింహం**

# అచ్చ తెనుగు

'క గ చ జ యు గ ట డ ణ త ద న ప బ మ య ర ల వ స హళాంతు హల్వర్గః' అను చింతామణి సూత్రముపై జనవరి నెల 'భారతి'లో శ్రీ పి. వి. కృష్ణమాచార్యులుగారు వెలిబుచ్చిన "ఆనాటికి అచ్చతెనుగు పదములలో 'హ'కార మున్నట్లు నన్నపార్యుని భారత భాగమున ఒక పదమైనను లభింపదు. ఆంధ్రశబ్ద చింతామణిలో 'హ'కారము తెనుగు వర్ణముగా ప్రక్షిప్తమా! ఆనాటికి'హ' కార ఘటితములు అచ్చతెనుగు పదము లేవైనా కలవా ? పండితులు

ఈ సందేహమును తీర్చవలయునని ప్రార్థన'' అను అభిప్రాయమునకు సమాధానముగనో లేక తత్సందేహ నివృత్తికిగనో శ్రీ వంతరాం రామకృష్ణారావుగారు ఏప్రియల్ నెల 'భారతి' లో వ్రాసిన 'సమాధాన ప్రయత్నము'ను చదివాను. ''సంస్కృతసమేతరంబయిన యీభాష యచ్చయనంబడు'' నను బాలవ్యాకరణకారుని యాచ్ఛిక పరిచ్ఛేదమందలి ప్రథమసూత్రమునకు పండితులు చేసిన వివరణ ప్రకారము ఆచ్ఛికములనగా సంస్కృతభవములు, ప్రాకృతభవములు, ప్రాకృత సమములు, దేశ్యములు. వీనికే తెనుగు, అచ్చతెనుగు, వికృతి యని నామాంతరములు. ఈదృష్టితో ఆలోచిస్తే శ్రీ వంతరాం రామకృష్ణారావుగారి ప్రయత్నం ఫలించింది.

కాని శ్రీ పి. వి. కృష్ణమాచార్యులుగారి సందేహములోని 'అచ్చతెనుగు' అను పదమున కర్థం నా కర్థంకాలేదు. వారి యీ సందేహమును చదివినపుడు నా బుద్ధి భాషాశాస్త్ర దృష్టిలో ఆలోచించింది. శ్రీ వంతరాం రామకృష్ణారావుగారు వ్యాకరణశాస్త్ర దృష్టితో సాధించారు. పై సందేహములోని ఆచార్యులవారిదృష్టి వ్యాకరణ శాస్త్రరీతిలోనిదే. అయితే ఇంకా సందేహానికి తావులేదు. ఇకపై నా యభిప్రాయాన్ని వ్రాస్తాను.

నా దృష్టిలో 'తెనుగు'కు 'అచ్చతెనుగు'కు భేదముంది. ఆనాటి తెనుగనగా పైన బాలవ్యాకరణకారుడు వివరించిన యాచ్ఛికము. కాని అచ్చతెనుగనగా నాటికీక్షేత్రంలో స్వతస్సిద్ధంగా తయారైన దేశ్య గ్రామ్యములు. అదే సంస్కృత, ప్రాకృతముల పొత్తు సంభవించని కాలములోని యీగడ్డపై వ్యవహరింపబడిన భాష. ఆధునిక భాషా శాస్త్రవేత్తల దృష్టిలోని మూలద్రావిడం నుండి 11వ శతాబ్దంనాటికీ మాగాటిపై పరిణతి పొందిన స్వచ్ఛమైన ప్రాంతీయము.

'తెనుగు', 'అచ్చ తెనుగు' పదాలకీ విధంగా భేదం చెప్పకున్నప్పుడు అచ్చతెనుగు పదాలలో 'హ'కారమున్నదా అని ప్రశ్నించుకుందాము. మూలద్రావిడమే యీ భాషకూ మూలమైతే దీనిలో కూడ 'హ'కారమున్నదని చెప్పక తప్పదు. అందుకు కారణము, తమిళ కన్నడ వర్ణ సమామ్నాయాలలో 'హ'కారం కన్పించడమే. అయితే యిక్కడ మరలా మరొక సందేహము కలుగుతుంది. తెనుగుకంటె తమిళ కన్నడము లెంత ముందుగా వాఙ్మయావస్థ పొందినప్పటికీ అప్పటికే వాటిపై కూడ సంస్కృత ప్రాకృతముల ప్రభావముపడి యుండవచ్చుగదా ! ఆధునిక చారిత్రక పరిశోధనల దృష్ట్యా యీ దేశంలోని ద్రావిడజాతి మొదట ఉత్తర భారత దేశంలో నివసించి, తరువాత ఆర్యజాతిచే దక్షిణాదికి తరుమబడుట నిజమైతే, ఆర్య భాషల ప్రభావం ద్రావిడ భాషలపై తప్పకుండా పడివుండాలి. ఇంక మూలద్రావిడమంటే ఆర్యుల దండయాత్రలకు పూర్వం భారతదేశమంతటిలోను ద్రవిడ జాతిలో స్వతస్సిద్ధంగా తయారైన భాష. ఆ భాషకు పూర్తి లిపి ఉండకపోనచ్చుకాని యుచ్చారణలో 'హ'కారముండి యుండవచ్చు. 'హెయ్' 'హాయ్' మొదలగు పశువులనదిలించే శబ్దాలుండి యుండెడివనడానికి ఆస్కారముంది. కేవలం వాచ్యంగా వున్న శబ్దాలు సంస్కృతాదుల ప్రభావం వలన లిపిని కూడా పొందియుండవచ్చును. ఆర్య భాషలలో ఆయాధ్వనులకు లిపి కనిపించడమే ద్రవిడ భాషలలోని 'హ'కారాదులు వర్ణ సమామ్నాయంలో స్థానం పొందడానికి హేతువు. ఆ విధంగా తమ్ముబోలిన ధ్వనులు ఆర్య భాషలందు కనిపించక ద్రవిడ భాషలందలి కొన్ని ధ్వనులు వర్ణ సమామ్నాయములో ప్రవేశింపలేకపోయినవి. ఉదాహరణకు చేప; తేప మున్నగు పదాలలో మనం నిజంగా మనం పలికే ధ్వని 'ఏ' కారముకాదు. 'ఏ' కారమునకు 'ఆ'కారమునకు మధ్యగా ఉంటుందాధ్వని. అట్టి ధ్వనికి ఆర్య భాషలలో లిపి సదుపాయం లేకపోవడంతో ద్రవిడ భాషలందుకూడ లేకుండ పోయింది. అంతేకాక ఆర్య భాషలలో తమ్ముబోలు ధ్వనులు లేక 'ఌ' అనే ద్రవిడ లిపిని కలిగిన ధ్వని పూర్తిగా మరుగు పడిపోగా తమిళంలో'మ' లాగ ఉండి కింద తోకవంటి గీత కల లిపిని కలిగినధ్వని క్రమంగా తప్పుకుంటున్నది. వీటిని బట్టి ద్రవిడభాషా పండితులపై ఆర్య భాషలకుగల ప్రభావం మనకర్థమవుతుంది. అది ద్రవిడ భాషలపై పనిచేసి కొంత లిపి సంస్కరణ జరగడానికి తోడ్పడింది. తద్వారా ద్రవిడ భాషలలో పెద్దగా ఉపయోగంలో లేని ధ్వనులను 'హ'కారాదులను వర్ణ సమామ్నాయములలో స్థాన మేర్పరచుకొన్నవి. ఎన్నో మరుగున పడిన అచ్చతెనుగు పదములలో యీ 'హ'కారమునుపయోగింపబడిన పదములుకూడ ఉండవచ్చు. అందుకే మనకా పదములు దొరకడం మృగ్యమయింది. అంత మాత్రాన అచ్చ తెనుగులో 'హ'కారోచ్చారణ లేదనడానికి వీలులేదు. అంటే అచ్చ తెనుగులోనే 'హ'కారమున్నది. ఏ విధంగా ఆలోచించినా ఆచ్ఛికవర్ణ సముదాయములలో 'హ'కారముండుట నిర్బాధకము. అది ప్రక్షిప్తము కాదు.

*శ్రీ చింతలపూడి వెంకటేశ్వర్లు*

## తెలుగులో కొన్ని అక్షరములు అవసరమా !

భాషా విషయములో తొందరపాటు తగదు. ఏదైనా సంస్కరణ రావలసి యున్నయెడల అది ప్రజలనుండియే రావలయును. గ్రాంథిక భాష ప్రాబల్య మున్నంతవరకు తెలుగులో అన్నీ అక్షరములు వాడబడుచుండెడివి. కాని వ్యాసములు, కథలు, నవలలు, పద్యకావ్యములుకూడ గ్రామ్య భాషలో వ్రాయడము మొదలయినప్పటి నుంచి కొన్ని అక్షరముల వాడుక తప్పిపోయి ఆ ధ్వనికోసము ప్రత్యామ్నాయ అక్షరములు ఉపయోగించుట సర్వసాధారణమైనది.

మొట్టమొదట తెలుగులిపి నుంచి వైదొలగినది అరసున్న. ఈ అరసున్న ప్రాముఖ్యము పూర్వకవులందరు గుర్తించినా, ఇప్పుడు అరసున్న వాడేవారులేరు. వాడేవారు లేరంటే ఏయే పదాలలో అరసున్న నాడవలెనో, ఏయే పదాలలో అక్కరలేదో చాలామంది రచయితలకు తెలియకపోవడము ఒక కారణమై యుండును, ఈ అరసున్న తెలుగు దేశీయ పదములలోనే కనిపించును. కాని సంస్కృత

సంబంధమైన తత్సమములలో కాని, తద్భవములలోకాని కనిపించదు. అసలు సంస్కృత వాఙ్మయములో అరసున్న లేనేలేదు. ఇంచుమించు పూర్ణానుస్వారము **కూడ** లేదనే చెప్పవచ్చును. తెలుగులో సంభవ మని వ్రాస్తే' సంస్కృతములో 'సమ్భవమని' వ్రాస్తారు. అలాగే 'ఆంధ్రులని' తెలుగులో రాస్తే 'ఆన్ధ్రులని' సంస్కృతములో వ్రాస్తారు. పూర్వము తెలుగులో కూడా పూర్ణానుస్వారము వాడుకలో ఉండెడిది కాదు. తమిళములోకూడా పూర్ణానుస్వారము వాడుక సంస్కృతములోవలెనే 'తంబి' అని వ్రాయుటకు బదులు 'తమ్బి' అంటే 'తమ్‌బి' అని వ్రాస్తారు. అందువల్ల తెలుగు లిపిలోఅర్ధాను స్వారము పూర్తిగా తీసివేయ వచ్చును.

పూర్ణానుస్వారము బహుళ ప్రచారములో ఉన్నది కనుక దానిని తప్పక స్వీకరించి ఉపయోగించుట మంచిది. తెలుగుభాషలో ద్విత్తము వ్రాయడముకంటె పూర్ణానుస్వారము ఉపయోగించుట తేలిక కనుక యీ అక్షరమును తప్పక మన భాషలో ఉంచుట ప్రస్తుత పరిస్థితులలో ఎంతైనా అవసరము. ఇక విసర్గ విషయము. విసర్గ సంస్కృత భాషలో ప్రముఖస్థానము వహించి యున్నందువలనున్ను, మన భాషలో సంస్కృత పదములు అధిక శాతము ఉండడంవల్లను విసర్గను మాత్రము విసర్జించలేము. 'దుఃఖము' అనేమాట తెలుగులో ఉన్నది. అది విసర్గ ఉపయోగించి అయినా వ్రాయాలి లేదా 'దుఖ్ఖము' అనేనా వ్రాయాలి.అటువంటి చోట్ల విసర్గ ఉపయోగించడమే తేలిక గనుక మన భాషలో విసర్గ కూడా ఉంచవలెను.

**మన భాషలో అచ్చులు :-** అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ,ఋ,ౠ, ఌ, ౡ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ, అం, అః. వానిలో ఌ,ౡల వాడకము ఎప్పటినించో మానివేయబడినది. అక్కడక్కడ కౢప్తము మొదలైన పదములలో పూర్వము వాడబడేది. ఇప్పుడు ఆ మాటను 'క్లుప్తము'అని వాడుతున్నారు. అలా చెలామణి అవుతున్నది. ఇప్పుడు 'కౢప్తము 'అని వ్రాస్తే చాలా మందికి ఆ మాట ఏమిటో, దాన్ని ఎలా ఉచ్ఛరించాలో తెలియదు. అందుచేత మన లిపినుంచి ఌ, ౡ అనే రెండు అక్షరములను తీసివేయవచ్చును.

ఇక ఋ, ౠ అక్షరముల విషయము. ఇవి వేరే అక్షరముల ఉపయోగము పూర్తిగా తగ్గిపోయినది. 'ఋషి'అని వ్రాయవలసి వస్తే 'రుషి'అని రాస్తున్నారు. కాని ద్విత్వాక్షరములలో ఇది ఇంకా ఉపయోగములో ఉన్నది. కృష్ణుడు, వృత్తుడు వగైరా పదములలో ఋకారము ఉపయోగములో ఉన్నదనే చెప్పవచ్చును. అయితే విడి అక్షరములుగా ఋ, ౠ లను ఉపయోగించడములేదు కనుక ఆ రెండు ప్రత్యేకాక్షరములుగా విడిచిపెట్టవచ్చును.

ఐ, ఔ అక్షరములకు బదులు కొంతమంది 'అయ్, అవు' అనే ద్వ్యక్షరములను వాడుచున్నారు. కానీ ఐ ఔ లు ఇంకా వాడుకనుంచి పూర్తిగా తొలగిపోనందున వాటెని ప్రస్తుతము లిపిలో ఉంచుటయే మంచిదనిపించుతుంది.

**ఇక హల్లుల విషయము .-** క, ఖ, గ, ఘ, ఙ, చ, ౘ, ఛ, జ, ౙ, ఝ, ఞ, ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, బ, భ, మ, య, ర, ల, వ, శ, ష, స, హ, క్ష, ఱ.

వీటిలో ౘ, ౙ లు ఇప్పుడు వాడుకలోలేవు. ౘాప, ౙల్లెడ వంటి పదములలో యీ అక్షరములు ఉపయోగించినను, వాటిధ్వని చ, జ లకు తేడాగా ఉన్నను, అవి ఇప్పుడు నిరుపయోగములయిన అక్షరములుగా యున్నవి. వాటిని తొలగించినను ప్రమాదములేదు నిజంగా పరిశీలించి చూడగా అవి వాటంతటే మన ప్రస్తుత భాషలోనుంచి తొలగిపోయినవి. వాడుకలోనుంచి పూర్తిగా తగ్గిపోయినవి.

ఙ ఞ లు కూడా వాడుకలో లేవుకాని అప్పుడప్పుడు కొన్నిపదములు ఙనము వగైరాలు వ్రాయడములో అప్పుడప్పుడు ద్విత్తములుగా ఉపయోగించబడుచున్నవి. కాని వాటి ప్రత్యేకోపయోగము కనబడుటలేదు. ద్విత్తములుగా మాత్రమే ఉపయోగింపబడే యీ రెండు అక్షరములను మన లిపిలోనుండి తొలగించుటకు ఆక్షేపణ ఉండకూడదు.

ఇక శ, ష, స అక్షరములు కొంచము హెచ్చు తగ్గుగా ఒకే ధ్వని కలవి. ఉత్తర దేశములో 'శ' అను అక్షరమును 'ష'గా పలుకుతారు. పైగా శ, స ధ్వనుల బేధము చాలామంది రచయితలు పాటించడములేదు. కాని యీ మూడు అక్షరములు యింకా ప్రచారములోయున్నవి కనుక వాటిని తొలగించే ప్రసక్తి ప్రస్తుతము లేదు.

బండి ఱ అక్షరము ఇప్పుడు అమలులోనేలేదు. 'కాకరపఱ్ఱు' అని రాయవలసినచోట 'కాకరపర్రు' అని రాస్తున్నారు. కొంత మందికి బండి ఱ ఎక్కడ వాడాలో, మామూలు ర ఎక్కడ వాడాలో తెలియకపోవచ్చును. కాని ఈ అక్షరము యొక్క అవసరము ఇప్పుడెవరికి అవసరము లేదనే అనవచ్చును.

కాలానుగుణంగా లిపిలో మార్పులు రావడం సహజం. పూర్వ శాసనాల్లో ఉన్న లిపి ఇప్పుడు మనం చదవడం చాలా కష్టమౌతుంది. అలాగే కాలం తెచ్చే మార్పులు మనం గమనించి అవసరమైన అక్షరాలను అంటే వాడుకలో లేనివి తీసివేస్తే మనభాష నవీనమై, సుబోధమై యుంటుంది. అనవసర అక్షరాలను చిన్న పిల్లలకు బోధించడం తప్పుతుంది. అరవములోను, ఇంగ్లీషులోను ఉన్న అక్షరాలను బట్టిచూస్తే మన భాషలోయున్న అక్షరముల సంఖ్య చాలా ఎక్కువ. మన భాషలోఉన్న ధ్వనులన్నీ ఆ భాషలో లేవన్నది నిజమైనా ప్రస్తుతపరిస్థితులలోఅనవసరమైన అక్షరములను బోధించడము హర్షించతగ్గది కాదు.

మార్పు సహజం. ప్రచారంలో మార్పువచ్చినప్పుడు అది గమనించి మార్పు అనుమతించడమే వివేకము. ఆచార ప్రకారము వెడదామని మార్పు ప్రజల్లోవచ్చినా అనుకోవడము విజ్ఞత కాదు. మార్పును చేయవలసివచ్చినప్పుడు అది సమాజానికి ఉపయోగమో, కాదో, విచారణచేసి మార్పును అనుసరించడమే మంచిది.

అయితే దీనికి అభ్యంతరము కొంతమంది చెప్పవచ్చును. పురాణ కవులు, ప్రబంధ కవులు వ్రాసిన కావ్యములు కొంతకాలానికి అర్థముకాక పోవచ్చుననేది. ఆ అభ్యంతరము అన్ని భాషల లోను ఉన్నదే. పూర్వము వ్రాసిన ఇంగ్లీషు లిపికి, ఇప్పటి లిపికి తేడాలు ఉన్నవి. అయినా అప్పటివారు వ్రాసినవి ఇంకా చదువుతూనే ఉన్నారు. అలాగే మన భాష విషయమూను.

*శ్రీ గంగిపాటి రామమూర్తి*

# లేఖలు

## వచన పద్యం - వచన కవిత్వం - పద్య వచనం

'భారతి' (ఏప్రిల్ 1977) లో శ్రీ సోమసుందర్‌గారు "ఒక టన్ను ముడిఖనిజంలో ఐదుగ్రాముల బంగారం, తరం తరం—సమాలోచనలు"లో 'వచనపద్యం, వచనకవిత్వం' అనువాటి గురించి వెలిబుచ్చిన అభిప్రాయాలపై ఇలా వ్రాస్తున్నాను:

శ్రీ సోమసుందర్‌గారు 'వచన పద్యం, వచన కవిత్వం'లను దాదాపు పర్యాయపదాలుగా వాడినారు. ఇది సరికాదు. 'వచనపద్యం, వచనకవిత్వం'లు వేర్వేరు సాహిత్య ప్రక్రియలు. ఆ మాటకు వస్తే "పద్యవచనం" అనే మూడవ దినుసుకూడా ఉంది. ఈమూడింటి స్వరూపస్వభావాలు వివరిస్తాను.

వచనం చదువుతూంటే పద్యం చదువుతున్నామా అనే స్పృహ కలిగించే రచన "వచనపద్యం".

వచనం కవితామయంగా ఉంటే ఆ రచన "వచనకవిత్వం".

పద్యాన్ని (ఛందోవాక్యాన్ని) వచనరూపంలో వ్రాస్తే ఆ రచన "పద్య వచనం".

## వచన పద్యం

చార్లెస్ బోద్లేరు నామకరణంచేసిన **Vers Libre** (ఇంగ్లీషులో **Free Verse**) ప్రాత ప్రక్రియయే. పేరు మాత్రం కొత్తది. శ్రీ సోమసుందర్‌గారు పేర్కొన్న ఫ్రెంచి రచయిత షాటూబ్రియా కంటె చాలా పూర్వమే జోషింధు బెర్లెన్ అనే ఫ్రెంచి రచయిత కవితామయ వచనం వ్రాసినాడు. **Vers libre** ను శ్రీ సోమసుందర్ గారు ముక్త ఛందస్సు అన్నారు. ఇది **Free Uerse** యే కాని **Freed Verse** కాదు కాబట్టి నేను దీన్ని "స్వేచ్ఛా ఛందం" అంటాను. "పవిత్రబైబిలు" పూర్వ ప్రకరణంలోని **'Solomon's Song'**అనేది వచన పద్యం. బ్రాహ్మణములు, కొన్ని ఉపనిషత్తులు వచన పద్యాలు కల్గి ఉన్నాయి. అథర్వవేదంలోని ఉచ్చాటనలు వచన పద్య స్పృహను కల్గిస్తాయి. బసవేశ్వరుని కన్నడ "వచనములు" (వాటిపేరే వచనములు, "వచనదల్లి నామామృత తుంబి, నయనదల్లి నిమ్మ మూరుతి తుంబి" అని ఒక వచనమే ఉంది) పద్యాలే, అంటే వచన పద్యాలు. పదునెనిమిదవ శతాబ్దంలో మాక్ఫర్సన్ ప్రకటించిన "ఓసియన్" వచన పద్యం. పందొమ్మిదవ శతాబ్దంలో ఆస్కార్‌వైల్డు **Poems in prose** వ్రాసినాడు. ఇది, **(prose-poem** అనేది**)** మన 'వచన పద్యం'కు సరిపోతుంది. **prose-poem**కూ **Free Verse**కూ భేదమేమంటే, మొదటిది పాదబద్ధత లేకుండా, రెండవది పాదబద్ధత కలిగి వ్రాయబడుతాయి. ఈ **prose-poem** అనే ప్రక్రియ పదునెనిమిదవ శతాబ్దపు ఆలివరు గోల్డుస్మిత్తు **"City night piece"**అనే వ్యాసం (ఇది చదవని ఆంగ్లభాషా విదుడుండడనుకొంటాను) **prose-poem** టాగూరు "గీతాంజలి" ఆంగ్లానువాదం వచనపద్యం. మూలం బెంగాలీ, పాటలు. పాటలు అని ఏవి ఉన్నాయో, అవి వచన పద్యాలే. వీనిని "పదములు" అని ప్రాచీనకాలంలో పిల్చేవారు. చండీదాసు, విద్యాపతి, అన్నమాచార్యుల పదములు వచన పద్యాలు. గీతలు, కృతులు వచన పద్యాలు కాకపోవచ్చును. ప్రాచీనుడైన కృష్ణమాచార్యుల "సింహగిరి వరహరి వచనములు" వచనపద్యాలు. తెలుగుభాషలో మొట్టమొదటి డాక్టరేటు అయిన శ్రీ చిలుకూరు నారాయణరావు రచన "శ్రీకృష్ణజననం" వచనపద్యం.

Song of Solomon :

**The watchmen that go about the city found me : to whom I said, Saw ye him whom my soul loveth?**

ఇటువంటివి 106 ఉన్నాయి

**Ossian : "I have seen the walls of Balclutha, but they were desolate. The five had resounded in the halls; and the voice of the people is heard no more. The stream was removed from its place by the fall of walls. The thistle shook there its lonely head; the moss whistled to the wind."**

**Prose-poem (Wilde's) : "When Narcissus died, the pool of his pleasure Changed from a cup of sweet waters in to a cup of salt tears."**

### బసవేశ్వరుని వచనం

"నరెకెన్నెగె, తెరగల్లకె, శరీరగూడ వాగదమున్న హల్లుహోగి బెన్నుబాగి అన్యరిగె హంగాగదమున్న కాలుమేలె కయ్యనూరి కోలహిడియదమున్న ముప్పిం దొప్పవళియదమున్న మృత్యుముట్టదమున్న పూజిసు వమ్మకూడల సంగమ దేవర."

ఈ భాషరానివారు అయిననూ, దీన్ని గట్టిగా చదివితే పద్యాన్ని తలదన్ని నట్లుంటుంది.

ఏ భాషలో ఐనా, నిజమైన వచన పద్యాలు తక్కువ సంఖ్యలో ఉంటాయి. వచన పద్యాలని చెలామణిలో ఉన్న ఆధునిక తెలుగు రచనలు వ్యాకరణం తప్పిన వాక్యాల సముదయాలో వచన వాక్యాలను విరుగగొట్టి రకరకపు పొడుగులుగల పాదములలో వ్రాయబడ్డవిగనో కన్పిస్తాయి.

## వ చ న క వి త్వం

రసం, ధ్వని, భావం, అలంకారం, రీతి, చమత్కారం, ఔచిత్యం మొదలైన కావ్యగుణాలు కల్గిన ఏ గద్య అయినా వచన కవిత్వం అవుతుంది. సంస్కృతంలో గద్యం, వచనం వేర్వేరు. మొదటిదే కవిత్వాని కర్హమయిందని నిర్వచనాలబట్టి తెలుస్తుంది. తెలుగులో గద్యం, వచనం సమానార్థకాలు. వచనం అనేదానికే మర్యాద హెచ్చుగా ఉంది. వచనం వచనం మాదిరే ఉండి కవితాంశాలు కల్గివుండే వచన కవిత్వం. బాణుని "కాదంబరి", దండి "దశకుమార చరితము" వచన కవిత్వాలు. తెలుగులో పానుగంటి "సాక్షి," మున్నంగి శర్మ, రచనలు వచన కవిత్వాలు. శ్రీ శివలెంక శంభు ప్రసాదుగారి "తెలుగు వెలుగులు", శ్రీ తిరుమల రామ చంద్రగారి 'రేఖా చిత్రాలు' వచన కవితామయాలు. ఇంగ్లీషులో జెర్రిమీటేలర్, థామస్‌బ్రౌను, డీక్వెన్సీ, వాల్టరు పాటర్, జాన్ రస్కిను వచన రచనలు కవిత్వం గలవి. తెలుగులో ప్రాచీన కవులు వచనాన్ని ప్రత్యేక ఫ లి తా ల కో స ం ప్రయోగించినారు. పోతన "భాగవతం" లో గజేంద్రమోక్షం, గంగావతరణ ఘట్టాల్లోనూ, పింగళి సూరన "కళాపూర్ణోదయం"లో సరస్వతీ చతుర్ముఖ విలాస ఘట్టంలోనూ అనంతుని "భోజరాజీయం"లో కొన్ని ఘట్టాల్లోనూ, ఈ సరణి కనబడుతుంది. చిన్నయసూరి "నీతిచంద్రిక"లో వ్రాసిన వచనం, ప్రాచీనుల ఛందోరూప పద్యాల యొక్క ఖండాన్వయ రూపపద్ధతే అని నాదొక నిగమనం కలదు. ఉదాహరణకు "భోజరాజీయం" లో మొదటి పద్యమే తీసికోండి.

చ. "ధనరహితుఁడు. పుత్రసముదాయసమేతుడు. ఉపాయశూన్య
 వర్తనుడు, అరయంగ నాద్విజుడు. తత్ప్రియభామయు బుద్ధి
 హీన. జీవన మొనరింపలేదు. ఇలువాడ నెఱుంగడు..
 భాండ శుద్ధిలేదు. అనిశము పోరుచుండు. తదుపాత్త
 పురాకృత కర్మమో యనన్."

ఇందు "అరయంగ నాద్విజుడు," "తదుపాత్త పురాకృత కర్మమో యనన్" అనువాటిని వాక్యప్రారంభాల్లో వేసికొంటేచాలు, పద్యమంతా నేడు మనం వ్రాసే గ్రాంథిక వచనం అవుతుంది. తిక్కన కవిత్వంలో ఇట్టి పద్యాలు ఎచ్చటచూస్తే అచ్చట కనబడతాయి.' వచనం వ్రాసే ప్రతిభవేఱు. పద్యంవ్రాసే ప్రతిభవేఱు.

## ప ద్య వ చ న ం

"పద్యవచనా" నికే "వృత్తగంధి" అని అంటారు. ఛందోబద్ధ వాక్యాలను పాదబద్ధత లేకుండా వ్రాస్తే 'వృత్తగంధి' అవుతుంది. ప్రాచీన తెలుగు కవులు వచనం వ్రాసేటప్పుడు ఛందోబద్ధ వాక్యాలను అచ్చటచ్చట ఇరికిస్తూ పోయినారు.. ఇదొక చమత్కారం అన్నైనా అనుకోవలె, చాపల్యం అన్నైనా అనుకోవలె. నన్నయ, తిక్కన, శ్రీనాదాది కవుల వచనాల్లో పద్యభాగాలు చూడగలం.

నన్నయ :

"అక్కథకుఁడు శౌనకాది మహామునులకుంజెప్పె నాది యుగంబున గశ్యప" - ఇది వచనం. నిజానికిది సీసపద్యపాదం.

సీ. "అక్కథకుఁడు శౌనకాది మహాముని
 లకుంజెప్పె నాది యుగంబునం గ......"

(శ్రీ నిడుదవోలు వేంకటరావు "వచన వాఙ్మయము" నుండి గ్రహింపబడినది)

శ్రీనాధుని "భీమేశ్వర పురాణము" లోని వచనాల్లో సీస పద్యపు ముక్కలున్నాయని శ్రీ బండి నాగరాజుగారి పరిశోధనా ఫలితం (చూ. పింగల ఆంధ్రపత్రిక), శ్రీ గిడుగు పిడుగు గ్రాంథిక భాషావాదులపై వేసిన బహిరంగ లేఖా వజ్రాయుధం "ప్రౌఁ దెనుఁగు కమ్మ" వచన రూపంగా వ్రాయబడ్డ పద్యం. అది వచనంగా వ్రాయబడినందువల్లనే హడలు పుట్టించేదిగా ఉంది. ఉదాహరణ కొక పంక్తి.

వచనం : "సిరిఁదాల్చు తేఁడొగిఁజిన్ని చూడ్కులఁ జూచు తెనుఁగు చదువుల రచ్చతీర్పరులారఁ గ్రిందనుఁగ్రైవాలు చేసిన నేనయా".

ఇది సీసపద్యం.

సీ. "సిరిఁదాల్చు తేఁడొగిఁజిన్ని చూడ్కులఁ జూచు
 తెనుఁగు చదువుల రచ్చతీర్పరులారఁ
 గ్రిందనుఁగ్రైవాలు చేసిన నేనయా"

గిడుగు, వచనం వ్రాయడానికెవరికైతే రాదన్నాడో, ఆ చిన్నయసూరి "నీతి చంద్రిక" లో పద్యమ్ముక్కలు కన్పడతాయి. ఉదాహరణ : "వలదని వాకొనకుండగ, మూకుటనోళులు గ్రమ్మ వచ్చునే". ఇందు మొదటి భాగం కందం. రెండవ భాగం ఉత్పల లేక చంపకమాల. ఇంగ్లీషులో డికెన్సు నవలల్లో చాలాచోట్ల ఛందోబద్ధ వాక్యాలు కన్పడతాయి.

వచనం వచనంలాగే ఉండి కవితా గుణం కలిగి ఉండవలెనే కాని, పద్యం వచన రూపంగా వ్రాయబడి, అ"వచనం" కవితామయం అనిపించుకోవలెనని తాపత్రయపడటం, కవితాప్రియులపై మాయచేయడమే అని కొందరి విమర్శకుల అభిప్రాయం. కవిత్వం అంతా మాయయే ఆయెమటి !

కవిత్వాన్ని అల్లే విధానంలో ఇంకొకఫణితి సూచిస్తూ ఈ వ్యాసం ముగిస్తాను.

ఛందస్సులో ఉన్న పద్యం, పద్యరూపంలోనే వ్రాయబడి ఉంటుంది. దాన్ని చదివితే, (అంటే అర్థవంతంగా చదివితే) వచనం చదువుతున్నామా అనిపిస్తుంది. ఉదాహరణకు, తిక్కన చిత్ర·విచిత్ర ఛందో విన్యాసాలు చేసిన "స్త్రీ పర్వము"లోని ఈ సీస పద్యం ఆలకించండి. భీముడు గాంధారితో అన్నమాటలు→

సీ. ''తలపోసి చూడంగ ధర్మమయ్యె నధర్మ
మయ్యెనే ప్రాణ భయంబు కతన
నట్లు సేసితిఁ గృపయార సైరింపుము
నీదు పుత్రుఁడు లావు నేర్పుఁగలఁడు
గావున నమ్మెయిగాని యోర్వంగ రా
దది యట్టులుండె ధర్మాత్మజునకుఁ
బాడితో వచ్చెనే పరిభవంబతనిచే
ద్రౌపది యేక వస్త్రయు రజస్వ
ఆ. లయును గాదెయపుడు దయమాలి కొలువున
కీడ్చి తేరఁబంచి యేఘి యనియె
నతడు వినవె యూరులప్పణ్య కాంతకుఁ
జూపుటెఱుఁగవే విశుద్ధ చరిత''

ఈ పద్యం గట్టిగా అర్థవంతంగా చదవండి. వచనంవలెనే ఉంటుంది కాని పద్యంవలెకాదు. వచనాన్ని పద్యంవలె తోపింపడానికి సాధారణ కవి తిప్పలు పడతాడు, పద్యాన్ని వచనంవలె ధ్వనింప జేస్తాడు తిక్కనలాంటి మహాకవి. ఇట్టి పోకడలు పింగళి సూరన కవిత్వంలో కలవు. ఈ కవితా సంవిధానానికే పేరుపెట్ట వలెనో సహృదయులాలోచించండి. ''పద్యవచనం'' కూ, దీనికీ భేదం ఇదీ : పద్యంను వచన స్వరూపంగా వ్రాస్తే పద్యవచనం అవుతుంది. పద్యంను వచన స్వభావంగా ధ్వనింపజేస్తే, తిక్కన పద్యంలోని ప్రక్రియ అవుతుంది.' నేను దీనిని ''వచన ఛందం'' అంటాను.

*శ్రీ సర్దేశాయి తిరుమలరావు*

# ''కులాలుఁడు - రజకుఁడు''

1977వ సంవత్సరం ఏప్రిల్ 'భారతి'లోని నా లేఖను విమర్శిస్తూ ఈ నెల (ఆగష్టు) 'భారతి'లో ప్రచురింపబడిన శ్రీ యం. వి. రమణయ్యగారి లేఖ చదివాను.

నా లేఖలో ''అంతేకాదు, ఆపదాలు (కులాలుఁడు, రజకుఁడు) వ్రాతకూ, ఉచ్చారణకూ సులభమైనవి'' అని వ్రాసాను. 'కుమ్మరి, చాకలి' పదాలకంటె ఆ పదాలు సులభమైనవి అని నా ఉద్దేశం కాదు. శ్రీ రమణయ్యగారు రెండవ తరగతి తెలుఁగు వాచకం చూచి ఉన్నా, నా లేఖలోని వాక్యాలను సదవగాహనతో పఠించిఉన్నా నా వాదం వితండవాదమని అనలేరు.

రెండవ తరగతి తెలుఁగువాచకము చూడండి. అందులో ''సంయుక్తాక్షరములు — సంఖ్యాపదములు'' అను పాఠమున్నది. ఆ పాఠములో— 'సంవత్సరము, స్నేహము, స్త్రీలు, త్రిమూర్తులు, చతుర్వేదములు, పంచపాండవులు, షట్కాలములు' మొదలగు పదములున్నవి. ఈ పాఠము దాటి మరి మూఁడు పాఠములకు గాని 'వృత్తులు' అను పాఠమురాదు. 'వృత్తులు' పాఠమునందు 'కులాలుడు, రజకుడు' అను పదములున్నవి. అప్పటికే సంయుక్తాక్షరములు,' సంఖ్యాపదములు వ్రాయగలిగి చదువగలిగిన విద్యార్థిపై 'కులాల, రజక' శబ్దములు సులభముగా వ్రాయగలిగి, ఉచ్చరించగలుగుననుట నిర్వివాదాంశము కాదా? ఇది వితండవాదమో, నిర్వివాదమో—విజ్ఞులు నిర్ణయింతురుగాక! ఇంత చిన్న విషయానికి పండిన పండితులైన శ్రీ రమణయ్యగారు తలబ్రద్దలు కొట్టుకొని ఆలోచించుట మరింత హాస్యాస్పదము.

ఇక నా లేఖలోని చివరి వాక్యమును పరిశీలింపుడు. 'ఆంధ్రబాలబాలికలకు భవిష్యత్‌లో ఆ పదాల అవుసరం ఉంది'— అను నా వాక్యంలోని భావం, కుమ్మరి, చాకలి అను పదాలకుబదులు 'కులాల, రజక' పదాలు భవిష్యత్తులో సాంఘిక ప్రాముఖ్యత పొందబడి భాషలో చోటు చేసుకుంటవి అనేకదా! ఈ విషయమునే రమణయ్యగారు మరొకవిధంగా చెప్పారు. అంతమాత్రంచేత తామే సర్వజ్ఞులని భావించడం రమణయ్యగారి అహంకృతికి నిదర్శనమని భావింపక తప్పదు.

నిఘంటువులలోని మాధుమూల పదాలు తెలుఁగు వాచకమ్ములందు చొప్పించి, పసిపిల్లల మనసులు నొప్పింపరాదని శ్రీ రమణయ్యగారి భావము. ఐతే మనము మాట్లాడుతున్న మాటలు నిఘంటువులలోనివి కావా? నిఘంటువులలో లేని పదాల నెన్నుకొని ఎవరైనా సార్థకమైన భాషను మాట్లాడగలరా?

*—శ్రీ పాయల సత్యనారాయణ*

# పాఠకులకి మనవి

ఆగస్టు 77 'భారతి'లో ప్రకటించిన శ్రీ క్రొవ్విడి లక్ష్మన్న వ్యాసంలో పొరబాటు దొరిలింది. దానిని ఈ క్రిందివిధంగా సవరించుకొని చదువగలరని మనవి.

22వ పుట మొదటికాలంలోని రెండో పేరా ''వీరి ప్రమదావనం'' మొదలుకొని మూడోపేరా సాంతం, రెండోకాలంలోని యుగకవులా అన్న శీర్షిక క్రింద 3వ పేరాగా చేర్చి చదువుకోవాలి. పొరపాటు దొరిలినందుకు చింతిస్తున్నాము.

*- సంపాదకుడు*

# సవరణ

ఆగస్టు 77'భారతి'లో ఆంధ్రదేశ చరిత్రభూగోళ సర్వస్వం మూడో సంపుటం గ్రంథవిమర్శలో మహా మహోపాధ్యాయ పరవస్తు రంగాచార్యులవారి జన్మస్థలం విశాఖపట్టణం కాదని, వారి శాకుంతలానువాదం పూర్తిగా లభ్యంకాలేదని వ్రాశాను.

ఈ నడుమ ఆం. ప్ర. సాహిత్య అకాడమీవారు వెలువరించిన వైతాళికులు రెండోభాగంలో శ్రీ పురిపండా అప్పలస్వామిగారు పై రంగాచార్యులవారిని గూర్చి వ్రాస్తూ —వారు విశాఖపట్టణంలో జన్మించారని, శాకుంతలానువాదం సమగ్ర వ్రాతప్రతి వారివద్ద ఉందని తెలిపారు. శ్రీ అప్పలస్వామిగారికి కృతజ్ఞత తెల్పుతు, 'భారతి' పాఠకులకు క్షమార్పణ కోరుతూ సవరించి చదువుకోవలసిందని ప్రార్థిస్తున్నను

*శ్రీ సుందరేశ్వరరావు*

# గ్రంథ విమర్శలు

## మూడు కవితా తోరణాలు

### 1. చైతన్య కేతనం

[యువకవుల కవితా సంకలనము. క్రౌన్1/16.48పుటలు. వెల రు 3/– ప్రతులకు : శ్రీనివాస బుక్ డిపో; సిద్ధిపేట; మెదకు జిల్లా–502103.]

ఇది సాహితీ వికాస మండలి (సిద్ధిపేట) వారి ప్రచురణము. ఇందు 29 మంది వ్రాసిన కవితా సుమాలు మాలగా కూర్చబడి ఉన్నవి. అక్షరాభ్యాసం వారు, మధ్యతరగతివారు, పై తరగతి కవుల రచనలుగా ఉన్నవి. అచ్చు ముచ్చటదీరటం రచయితకు మొట్టమొదట అత్యంత అవసరం; ఇది కవితా పథయానంలో వీరు ఎత్తిన కేతనం. దీనిని ఇంకా చైతన్యవంతంగా చేసుకొంటే భాషాదేవికి మంచి ఆభరణాలే కూర్చగలరు.

శ్రీ కుందుర్తి పరిచయంగా వ్రాసిన దానిలో రచన ఏ కొద్ది మందికీనా? అందరికీనా?—అని ప్రశ్నవేసి మంచి ప్రత్యుత్తరమే ఇచ్చినారు. పూర్వం చదువుకొన్నది కొద్దిమంది — వ్రాసినవారు ఇంకా కొద్ది; అంటే అభిరుచులు పరిమితం. అందులో అర్హత ఉన్నవే మనగలిగినవి. నేడు అది మారినది. వివిధ లభిరుచులవారు చదువుకొన్నారు; వారికి తగిన నచ్చిన వ్రాతలు వస్తున్నవి. దీనికి ముద్రణ విధానం చాలా సహాయపడుతున్నది. అచ్చు అయినది ప్రతిదీ ప్రతివారికి రుచించదు. నాలుకకొకరుచి, బుర్రకొక బుద్ధి కదా! కాబట్టే ఎన్నో ప్రక్రియలు బయటికి వస్తున్నవి. కుందుర్తి అన్నట్లు—మంచో చెడో కాలమే నిర్ణయిస్తుంది. కన్నీళ్ళు చెమటలు కార్మికులు అనే పడికట్టురాళ్ల కవిత్వం కాలప్రభావమే! నిజం. ఇంతకూ ఇప్పటి మన చదువు 33 శాతమే, అందరూ చదువుకొంటే ఈ ప్రచురణ ప్రవాహం ఎట్లుంటుందో.

ఇందు కొందరు రచయితలు నుడికారానికి సొంపు వెలయింప జేసుకొని ఉన్నారు. అష్టకాలవారి అనుభూతి; చేవూరి నారాయణ పునాదిరాళ్లు బాగున్నవి. కొన్నిటిలో భాష ఉన్నది, భావం తక్కువ. మొత్తంమీద చదివి, ప్రోత్సహింపవలసిన సంకలనం.

### 2. నిప్పురవ్వలు :

[కర్త— బిగుళ్ళ. క్రౌన్ 1/16. 55 పేజీలు; వెల, రు. 2/ ప్రతులకు : హైదరాబాదు అభ్యుదయ రచయితల సంఘం, ముఖర్జాంమార్గ్, హైదరాబాదు–500029.]

ఆవేశమున్నంతగా ఆదర్శంలేని కవితల పోకడలు ఇవి. శ్మశానంలోగాక ప్రజలలో విప్లవమున్నది. ఇది మావో మాటలకు ఒక మళ్లింపుగా నున్నది. ప్రబంధాల మలయా నిలాలవలెనే నవయువ కవులకు దోపిడీలు, కరువు, కాల్పులు పడికట్టురాళ్లు ఊతపదాలు అయినవిగదా! అయినా వాటిని చెప్పేపద్ధతిలో భిన్నత రామణీయకత ఉంటే పఠనయోగ్యంగానే ఉంటుంది, లేకుంటే అస్తిపంజరాల గలగలలే. ఈ గుణం లేనందున పాడిందే పాడే పాచిపళ్ల దాసరులు అవుతారు. ఎక్కువమంది ఈ ముఠావారే. (మన్నించండి)

ఇజాలు వద్దనే వీరిదీ ఒక ఇజం కాదా? నాస్తికవాదమూ ఒకమతమే గదా! ఏమిటీ ఈ అర్థంలేని నినాదాలు. మన కులాలు లేని దేశాలలో ఇంకొక రకం కులాలు ఉన్నవిగదా.

ఈ రచయితలో, ఉద్రేకానికి తగిన భాష ఉన్నది, నడక సత్తువ ఉన్నది. ''తిరుగబడ్డ జలాన్ని తిరుగబడ్డ జనాన్ని అడ్డుపెట్టజాలవు'' అన్నది మంచి సూక్తి. మాటల రవ్వలు సరే. మంటల గవ్వలు ఏమిటి ? వెనుకటికి ఒక కవి ''ప్రాసకీడ్చినానే కూసుమండా'' అన్నాడంట.

''ప్లైన్–మైనస్'' ఇది ప్లస్ అయ్యా!

### 3. వనమాలి వచన పద్యాలు :

**Prose Poems of Vanamali.**

[డెమ్మి1/8. 48 పొరటలు. వెలలేదు; ప్రతులకు : ఎ. పి. బుక్ డిస్ట్రిబ్యూటర్స్–3237రాష్ట్రపతిరోడ్, సికిందరాబాదు.]

వనమాలి తెనుగు రచనకు సొంతంగా వ్రాసిన ఇంగ్లీషు అను వాదంతో ఎదురెదురుగా అచ్చువేసిన వచన పద్యావళి ఇది. పద్యాలు పనికిరావు, పాతచింతపండు. రచనకు శృంఖలాలు అని అంటూనే ఈ కోవవారు తమ గీతలను పద్యాలంటారు. అంటే పద్యాలపై వ్యామోహం, తపన, ఆలాపన వీరిలో అంత బలంగా ఉన్నట్లున్నది. ఇది వీరికి ఒక **'obsession'** గా ఉన్నది. (హిరణ్యకశిపునికి హరి శబ్దం వలె) అందులో వచన పద్యాలు అనడం ఒక **Parax.**

ఈ కవికి తెనుగు రచనలో ఇంకా బాగా చేయి తిరుగవలసి నట్లున్నది. ఇక ఇంగ్లీషు కసుగాయ పాకం. **Bad** ఇంగ్లీషు అన లేము గాని **Good** ఇంగ్లీషుకాదు. (కటువుగా చెప్పిన దానికి మన్నించండి.) ఇంగ్లీషు నుడికారం లేదు. ఇంగ్లీషు వ్రాయడం ఇండియనులకు అంతగా అబ్బదని వారి వాదం. (సరోజనీనాయుడు, రాధాకృష్ణన్, వివేకానంద, గాంధీజీ మొదలైనవారు **exceptions**) వెనుకటికి దువ్వూరు రామిరెడ్డి **'Voice of the reed'** వ్రాసి, డాక్టర్ కజిన్స్ సవరిస్తే ఆమోదాన్ని పొందినది. డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య తమ జన్మభూమిలో సమీక్షిస్తూ — **'Reddi has contributed Telugu phrase to English'** అన్నాడు. అదీ ఈ కవికి ఇంకా అలవడలేదు. ప్రవాహాలు **Rivers;** **'Iternity in End'** రోగిష్టికి **'Convalescent; withdraw'** అంటే జారిపోవడం మొదలైనవి మంచి నుడికారాలు కావేమో! అంటే ఇంగ్లీషు ఇడియం కుదురలేదు—అనవచ్చు.

తెనుగుకు యథామాతృకంగా ఇంగ్లీషు చేయక స్వతంత్రించి నాడు. ప్రయత్నం ప్రశంసింపదగినదే! 'సాధనమున పనులు సమకూడు ధరలోన' అని గదా పెద్దలు అన్నది. ఈయన వ్రాసి సిద్ధహస్తుడు కావాలని ఆశిస్తున్నా.

మరుపూరు కోదండరామరెడ్డి

# కరపత్రాల భాగోతం - తెర వెనుక దుమారం !

గత చరిత్రలో కలసిపోయిన ఒక పీడకలను పదేపదే జ్ఞాపకం చేసుకుంటే తప్ప కొందరికి అన్నం సయించదు. అలాగే సాహిత్య జలధిలో లేచిన సుడిగుండాల్ని సైతం ఏదో రూపేణా చిరస్మరణీయం చేస్తే తప్ప కొందరికి తోచదు. అలాంటి పనుల ద్వారా తప్ప మహత్కార్యాన్ని సాధించామన్న సార్థకత కలగదు. అలాంటి మనస్తత్వాన్ని దుఃఖ భాజనత్వం అంటారు పెద్దలు !

సరిగ్గా అట్టి సంతృప్తి కోసం ప్రచురించినదే– ''కరపత్రాల దుమారం — తెర వెనుక భాగోతం ...''- దీని సంకలన కర్తలు — అనంతం, లక్ష్మీకాంతం. బుక్‌లవర్స్ పబ్లికేషన్సు–విశాఖపట్నం–1 అనేవారు 1977 సంవత్సరపు కానుకగా దీని నందించారు. 1/8 క్రౌన్, 103 పుటలు. వెల — మూడు రూపాయలు.

ఈ గ్రంథాన్ని డా|| జి. కృష్ణమూర్తిగారికి అంకితంచేశారు. వారు 'లిటరరీ క్రిటిక్‌ల కంప్యూటర్' అని వివరించారు. కంప్యూటర్ అంటే అర్థమవుతుంది; కాని లిటరరీ క్రిటిక్‌గా వారు సాధించిన దేమిటో మనకి తెలియదు.

ఈ కరపత్రాల కరపత్రానికి లేదా ఖర పత్రానికి ఒక పరిశోధన పత్రపు స్థాయిని చేకూర్చేందు కీ సంకలన కర్తలు కొన్ని చిట్కాలు ప్రయోగించారు. అవి ఏవనగా — 1. తాము కొన్ని వందల (వేల ?) కరపత్రాలు పరిశోధించి, ఇందు పొందుపరచినవి మాత్రమే ఎన్నికచేసి — ఈ గ్రంథాన్ని సాధించినట్లు ఒక సొంత కితాబు యిచ్చుకొన్నారు. 2. ఈ పుస్తకం ప్రచురించడానికి కొందరు హేమాలు, కొందరు హేమీలు కలసి సప్తర్షి మండపం సహకారమూ, సలహాలూ అందించినట్లు చెప్పకొన్నారు. 3. దీనికీ ఒక చారిత్రక ప్రాధాన్యతను ఆపాదించుకొందుకుగాను, కరపత్రాల ప్రాధాన్యత గురించి ఐదు పుటల ఉపోద్ఘాతం అందించారు.

ఉపోద్ఘాతంలో — ఆధునిక కాలంలో కరపత్రాల ప్రాధాన్యత ఎలా రూపొందిందీ, కరపత్ర రచన ఎప్పుడు ఎలా ప్రారంభమైందీ, వగైరా వగైరా కథా కమామీషూ కొంత చెప్పారు. ఆ పరిచయం చదివీ చదవగానే–'నిజమే బాబోయ్ ! ఇదేదో పరిశోధనా పత్రమే!' అనే భ్రమ అర్భకులందరికీ కలుగుతుంది. ఆ మేరకు ఈ అనంత లక్ష్మీకాంతాలు విజయం సాధించినట్లే !

ఈ పుస్తకంలో వారు ప్రధానంగా ప్రచురించదలచిన కరపత్రాలు–దిగంబరులు, విశాఖ విద్యార్థులు, విరసంవారూ వేసినవి మాత్రమే ! వాటికే ఏకపక్ష ప్రాధాన్యత కలిగించడం ద్వారా, జాతి మరచిపోయిన ఒక పీడ కలను కెలికి జ్ఞాపకంచేయ సంకల్పించారు. కాని ఆ కరపత్రాలు మాత్రమే ప్రచురిస్తే మరీ వీరశైవం విభూతి పెండికట్లలోనే వ్యక్తమైపోతుందన్న భయంతో, కొంత లౌక్యం చేశారు. భగత్సింగ్ ఎసెంబ్లీలో విసిరిన కరపత్రాన్నీ సంపాదించారు. కళాప్రపూర్ణ పురిపండా అప్పలస్వామిగారు అస్పృశ్యతకు వ్యతిరేకంగా గేయంరాసి గాంధీజీ సన్నిధిలో (తెలుగులోనూ శ్రీ శ్రీ ఆంగ్లానువాదాన్నీ) చదవగా, 1934 లో విశాఖ జిల్లా కాంగ్రెస్ సంఘం కరపత్రంగా ప్రచురించినదాన్నీ జతపరిచారు. జె.పి.జెయిలు నుంచి ఇందిరాగాంధీని అభిశంసిస్తూ రాసిన లేఖనీ పొందుపరచారు.

దీనితో ఈ గ్రంథానికొక పరిశోధనా పత్రపు కళ అబ్బిందని సంతృప్తిపడ్డారు. మిగిలిన వానిలో పన్నెండు కరపత్రాలూ వెరసిగా విరసానికి సంబంధించినవే! 13వ కరపత్రం డాక్టర్ కోవూరుమాయల మరాఠీలకు చేసిన సవాలు. ఇదివరకే హేతువాద పత్రికల్లో ప్రచురితమైంది. 14 వది జనమంతా యిదివరకే కళ్లు వాచేలా చదివిన యిరవైసూత్రాల ప్రణాళిక. చివరది–'**J. P. writes to Indira**' అనేది లోగడ అన్ని దినపత్రికలలోనూ, ప్రచురితమైనదే !

ఇందులో అధిక సంఖ్యతో ప్రాధాన్యమీయబడిన, తెలుగు సాహిత్యంలో వీచిన దుమారానికి సంబంధించిన డజను కరపత్రాలలో–దిగంబర కవులు 1967 లో సాహిత్యఎకాడమీ సమావేశంలో సంచిపెట్టినది మొట్ట మొదటిది !

ఒక వ్యవస్థ నిరంకుశంగా, నిర్నిరోధంగా సాగిపోతున్నపుడు దాన్ని ప్రశ్నించి, ఎర్రజెండా జళిపించి, ఆపవలసిన అవసరం జాతికుంది. ఆ పనే ఈ కరపత్రం చేసింది. ఐతే ఆ చేసినవారు దిగంబరులు కనక సాధారణ మర్యాదలను అతిక్రమించడం వారికి సర్వసాధారణమే ! అతి మితవాదిగానూ, వ్యష్టిదాష్టీకవాదిగానూ, ఆంధ్ర సాహిత్య వీధిలో నిలచిన నందికేశ్వరుడు విశ్వనాథ సత్యనారాయణ ! ఆయన సహజంగానే — వీరేశలింగం సాహిత్యవేత్త కాదన్నా, గురజాడ అకవి అన్నా–వీర వైశ్యనాథులు తంధానతాన అన్నారు. కాని పై యిరువురినీ విశ్వనాథ పూర్వ సువాసనా యుగంలో ప్రశంసించిన దాఖలాలెన్నో ఉన్నాయన్న సంగతి కొత్తగా కళ్లు తెరచిన ఈ చెక్కభజన బలగానికి పాపం తెలియదు. ఈ బలగంతో విశ్వనాథ మరీ పేట్రేగి — కాలుకు బలపం కట్టుకొని తిరిగాడు. అన్నం పెట్టిన చేతుల్నే కరవపూనుకున్నాడు. (చూ. గంగూలీ ప్రణయ గాథ) అలాంటి విశ్వనాథలో ఔచితీ విచారణ ఆయనకన్న ముందే కీర్తిశేషమైంది. జమీందారీ బిడ్డడు కనకనే టాగోరు నోబెలు బహూమానం పొందగలిగాడు తప్ప — అతనసలు కవే కాదు. అంటే టాగోరు శిష్యుడ్నని చెప్పకొనే ఎకాడమీ అధ్యక్షుడు నోరు మెదపలేదు. అలాంటపుడు విశ్వనాథలో ఆంగ్రెబ్బ మరీ పెచ్చు పెరిగి, వితండవాదంగా రూపొందింది.

చిత్రాల్లోకెల్లా చిత్రమేమిటంటే — అతివాదిగా పరిగణింపబడిన శ్రీ శ్రీ విశ్వనాథతో ఈ విషయంలో ఏకీభవించి టాగోరు అసలు కవే కాదనడం ! మన్‌మహన్ రేఖ సరిహద్దుగా పరిగణించమని — అటు చాంగ్–కైషేకూ, యిటు మావ్–సె–టుంగూ ఏకకాలమందు ప్రకటించలేదూ? అలాగే అతి అతివాదులూ–అతి మితవాదులూ వర్తులం చివర ఇలాగే ఏకీభావం పొందుతూంటారు!

ఈకరపత్రాల దుమారంలో ప్రధానాంశంగా ప్రదర్శితమైన విరసానికి సంబంధించిన కరపత్రాలను, ఇప్పుడిలా పోస్టుమార్టమ్‌గా గ్రంథస్థం చేయడంలోగల కీలకమైన ప్రయోజనమేమిటో బోధపడదు. ఇందులో అభివ్యక్తమైన వివిదాభిప్రాయాలన్నీ యిప్పుడు ఏకోన్ముఖంగా ప్రవహిస్తున్నాయనడానికి దాఖలాలు లేవు ! మరి కిం ప్రయోజనం ?

కమ్యూనిస్టు మాతృ సంస్థ నుంచి 1963లో ఒక ప్రధాన విభాగం చీల్చుక బయటపడ్డ తర్వాత కమ్యూనిస్టులు లక్ష గ్రూపు

లుగా వేరింటి కాపురాలు పెట్టేసుకున్నారు. ఈ దేశంలో మార్క్సిజం—ఏనుగూ ఏడుగురు గ్రుడ్డివాళ్లా కథమాదిరిగా అపభ్రంశం పాలయింది. ప్రతి అంధుడూ తనకు లభించిన శరీర భాగమే ఏనుగు అసలు స్వరూపమని వాదోపవాదాలు చేస్తున్నారు. గజం మిథ్య, పలాయనం మిథ్యగా మారింది. నేటి భారతదేశానికి అలనాటి కారల్ మార్క్సు స్వయంగా వచ్చి 'నాయనలారా యిది మార్క్సిజం కాదర్రా' అని చెప్పబూనితే, మన ఉగ్రవాదులు అతని గెడ్డం గొరిగి పంపించేస్థితిలో ఉన్నారు.

ఇన్ని మార్క్సిస్టు గ్రూపుల్లోనూ, పార్టీల్లోనూ చేసిన తప్పుల్ని బహిరంగంగా ఒప్పుకొని లెంపలు వాయించుకోవడంలో—గుడ్డిలో మెల్లగా , సి. పి. ఐ.య్యే నయమనిపిస్తోంది. కమ్యూనిస్టు అనేవాడికి ఆత్మవిమర్శ చేసుకొనే చిత్తశుద్ధీ, గుండె దిటవూ ప్రాథమికావసరం! మిగిలిన ముఠాలలో ఆమాత్రమూ కానరావడంలేదు.

పోతే తక్షణ సాయుధ విప్లవ కమ్యూనిస్టులలో సైతం ఈనాడు ఎన్ని ముఠాలుగా వేర్పడ్డాయో-లెక్కలు తీయడం ఎవరి తరమూకాదు. భారతదేశంలో మార్క్సిజం—నేతి నేతి వ్యవహారంగా బ్రహ్మపదార్థంగా మారిపోయింది. ఎవడి మార్గానికి వాడే సేనాధిపతి! చివరికి విరసంలో కూడా ఎన్ని ముఠాలు రూపొందాయో, గుండెలపై చేయి వేసుకొని వాళ్ళ బహిరంగంగా చెప్పరు.

1970లో శ్రీ శ్రీ సన్మాన వేదికపై మోళీ ప్రదర్శన చేసిన జ్వాలాముఖిగాని, నిఖిలేశ్వర్‌గాని యిప్పుడే గ్రూపులో ఉన్నారో తెలియదు. వారు విరసానికి దూరమయ్యారు. అటు దిగంబర కవిత్వానికీ గాక, యిటు విరస కవిత్వానికీగాక జ్వాలాముఖి మాత్రం యిటీవల మార్మిక కవిత్వం ప్రచురిస్తున్నాడు. నిఖిలేశ్వర్ ప్రభృతులు ఏం రాస్తున్నారో ఎవరికీ తెలియదు!

చేనేత వస్త్రాలయం దగ్గర జేబురుమాళ్లు ఉచితంగా పంచిపెడుతున్నారంటే ఊరు ఊరంతా అక్కడే ఉంటారు. జనం లూటీ చేసేలాగున్నారని పోలీసులు లాఠీచార్జి ప్రారంభిస్తే ఒక్కపిట్ట మళ్లీ కనిపించదు! నాయకత్వపు కీర్తి తేలిగ్గా లభిస్తుందనేసరికి వీర ప్రదర్శనంచేసిన ప్రముఖ రచయితలంతా, జెయిళ్లూ నిర్బంధాలూ ఎదురయ్యేసరికి చల్లగాముక్కు లెగపీలుస్తూ తోకలు ముడిచారు. వెంగళ్రావుగారి పోలీసులకు అండర్ టేకింగు యిచ్చి, బ్రతికిఉండిన సుఖములు బడయవచ్చుననుకుంటూ బయటపడ్డారు. వందలాదిముక్కుపచ్చలారని యువకులు మాత్రం ప్రాణాహుతి కావించుకొన్నారు.

కరపత్రాల దుమారం వాళ్ళు తీగలాగారు!...డొంకంతా కదలవలసి వచ్చింది మరి!......ఏడేళ్ల ఏలినాటి శని తెలుగు దేశపు చరిత్రను కన్నీళ్లతోనూ, రక్తంతోనూ విరచించింది! శాండిల్యాదులు ముప్పయివేలు కాజేసి, ఆహ్వానితులైన రచయిత లందరికీ రానుపోను ఖర్చులనిమిత్తం మారని దొంగచెక్కు లిచ్చి, జరిపిన అభ్యుదయ సదస్సనే దొంగాటకం రోజున ఏర్పడబోయే విరసానికి శ్రీ శ్రీ నాయకత్వం కావలసి వచ్చింది! అతడ్ని కిడ్నేప్‌చేసి నాయకత్వం అంటకట్టారు. ప్రస్తుతం విరసం ప్రధానులకు శ్రీ శ్రీ ఒక బాటిల్ నెక్‌లా తయారయ్యాడు. కనుకనే ఎంత దుర్మార్తి పోసన్నదీ పత్రికలు చూస్తున్నవారి కందరికీ తెలుస్తూనేవుంది!

ఇలాంటి అస్తవ్యస్త విఫల విప్లవోద్యమ చరమ సంధ్యలో కరపత్రాల దుమారంద్వారా సాధించదలచిన ఉత్కృష్ట ప్రయోజనం ఏమిటి? ఈషన్మాత్ర అభిప్రాయ విభేదం ఉన్నంతమాత్రంలో ప్ర వారినీ వర్గశత్రువులుగా నిందించే సెక్టేరియన్ మదోన్మత్త తప్రపంచ చరిత్రలో ఎలాంటి కుక్కచావుచచ్చిందో, అలాంటిగతే మనదేశంలోన పట్టిందని కనులు తెరచిచూడగలిగిన వారికందరికీ తెలుస్తూనేఉంది. అట్టి స్థితిలో గతంనుంచి గుణపాఠాలు నేర్చుకొని, సుద్బుద్ధితో భవిష్యత్ రూపురేఖలను తీర్చుకోవాలే తప్ప—గతాన్నితవ్వి తలకెత్తు కోవడంద్వారా లభించేవి ఎముకలూ పుర్రెలూ మాత్రమే!

గతమనేది ఏడేళ్లదైనా, ఏడువందలఏళ్లనాటిదైనా మంచిగతమున కొంచమేనోయ్! దానివల్ల వర్తమానపు రూపు లకు ఏమాత్రం ప్రయోజనం ఉండదు. ఈ ప్రధానాంశాన్ని ఈ అనంతం, లక్ష్మీకాంతంగార్లు గ్రహించినట్లు కనిపించదు. అట్టి సదవగాహన ఉంటే గతించిన పీడకలలకు, ఇలాంటి నికృష్టస్మృతి చిహ్నలను నెలకొల్పే అవివేకానికి పూనుకోరు!

గాలి కదిలితే మళ్లీకనిపించని కరపత్రాల గురించి, అదొక పరి శోధనాంశంగా చెప్పుకుంటున్నవాళ్లకి, గాడిదలు మేసివేసేవాల్ పోస్టర్ల పరిశోధనకూడా ప్రధానాంశమే! చివరికి హైస్కూలుగోడలమీద కుర్రకారు రాసే బూతులబుంగ పరిశోధన సైతం ఒకమహా వ్రతమే.

కనక సోదర విప్లవ రచయితల కొక్కటే మనవి. మీ దుందుడుకు చర్యలవల్ల, అసంగత అసంబద్ధ కుహనాసిద్ధాంత కార్యక్రమాలవల్లా యిప్పటికే ఎన్ని క్యాసెక్కుల నెత్తురూ కన్నీరూ అనంత వాహినిగా ప్రవహించిందో గమనించండి! ఎంతోమంది విద్యాధికులు—సమాజానికెంతో ఉపయోగపడవలసినవాళ్ళు నిష్ప్రయోజక మహత్తర త్యాగాలకు పాల్పడి ప్రాణాలర్పించారో పరిశీలించండి. ఎందరు మానవతుల బ్రతుకులు బ్రద్దలయ్యాయో గుర్తించండి! అటు సమాజంలోని దోపిడీదారులు ఎంతమంది చంపబడ్డా సామాజిక దోపిడీ నశించలేదు. మీరు విప్లవోద్యమంగా భావించి చేసినదంతా విఫలమైపోయింది. వర్గశత్రువుల కూటనీతి మరింత బలాన్ని పుంజుకుంది.

ఏ విప్లవోద్యమంవల్ల పీడితవర్గం ఉజ్వల భవిష్యత్తు పొందుతుందని మనమంతా ఆశిస్తున్నామో—ఆ శ్రామికవర్గం చిన్న చిన్న వాగ్దానాలకు మోసపోయే నిస్సహాయస్థితికి దిగజారింది. అట్టి శ్రామిక వర్గాన్ని సుసంఘటితంచేసి, చైతన్యవంతం కావించి, మిత్రశ్రేణుల నన్నిటినీ ఏకోన్ముఖం చేయవలసిన మహత్తర బాధ్యత రచయితలందరిపైనా ఉంది. అంతవరకూ మహాశక్తివంతమైన వర్గ శత్రువు—ఇలాంటి పిల్లసమేరీలవల్లనూ, పిచిక పితూరీలవల్లనూ నిర్జితుడు కాడన్న యథార్థాన్ని సోదరులంతా ఇప్పటికేనా గ్రహిస్తే శుభోదర్కమే!!

శ్రీ సోమసుందర్

**Printed and Published for Nageswara Rao Estate (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 75226.**